# చతుర

నవంబరు 2009
రూ.10/-

సిహెచ్.సుబ్బరత్నమ్మ
**కదంబమాల**
10 లో...

# చతుర

సంపుటి -32
సంచిక - 10
నవంబరు 2009
382వ సంచిక

కథ వెనుక కథ
**వనితల వెతల 'ముద్ర'** 04

జ్ఞాన పీఠాలు - *10*
**శ్రుతికావ్యకర్త బేంద్రే** 08

**ప్రవేశిక విజేతలు** 81

**కాలాతీతం**
ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ
వేదికలో లూయీ స్టీవెన్సన్ నవల
**కిడ్నాప్** 114

యర్రంశెట్టి శాయి అపార్ట్‌మెంటాలజీ
**'లై' డిటెక్టర్** 120

చతురకతలు 126

**మనసున ఉన్నదీ...** 129

**ప్రవేశిక** 130

**నిన్నటి నిజం**
సేకరణ : డా॥ రామడుగు వెంకటేశ్వర శర్మ

**చతుర ప్రపంచం**
సేకరణ : కావ్య

క్యాప్షన్ మీదే - *11* మూడో కవర్ పేజీ

ముఖచిత్రం : త్రిష
ముఖపత్రాలంకరణ : రాజుయాట



'బాగా సంపాదిస్తున్నావు.. డబ్బివ్వు' సుధను అడిగాడు ఆమె అన్న. 'చాలా అప్పులున్నాయి.. నా దగ్గరేమీ లేదు' అంది గతాన్ని మరచిపోని సుధ. 'నీకు కళ్లు నెత్తికెక్కాయ్. సంపాదిస్తున్నానని అహం. మొగుడొదిలేసినా పులుపు చావలేదే' అన్నాడు అన్న కసిగా. స్వార్థపూరిత సంబంధాలను ఎండగడుతూ.. ఏడుగురు అమ్మాయిల సాగించిన జీవన పోరాటాన్ని హృద్యంగా ఆవిష్కరించిన సిహెచ్.సుబ్బరత్నమ్మ నవల

**కదంబమాల**

10 వ పేజీలో

బొమ్మలు : భాస్కర్

# కథ వెనుక కథ

## వనితల వెతల ముద్ర




యుగాలు గడుస్తున్నా, తరాలు మారుతున్నా.. స్త్రీగతి దుర్గతేనా? ఆచారాలు, సంప్రదాయాల పేరిట వారిని బాధించడం, శ్రమ, లైంగిక దోపిడీలకు పాల్పడడం అన్ని సమాజాల్లోనూ కన్పిస్తున్నదే. పల్లెల నుంచి నగరాల దాకా హింస. బసివిని, మాతంగిని, జోగిని, దేవదాసి, కన్నెరికం.. పేరేదైతేనేం? వనితల బతుకుల్ని ఊరుమ్మడి సొత్తుగా మార్చేయడం... ఇదే కథావస్తువును స్వీకరించి, సమాజాన్ని ఆలోచింపచేసేలా చక్కని నవలని అందించారు డాక్టర్ వి.ఆర్.రాసాని. సుమారు మూడేళ్లక్రితం 2006 డిసెంబరు 'చతుర'లో 'ముద్ర'గా ప్రచురితమైన ఈ నవల పాఠకుల్ని అలరించింది.. కదిలించింది.. ఆలోచింపజేసింది. అంతేకాదు ఏడాది క్రితం 'జోగతి' పేరుతో కన్నడంలోకి అనువదితమై కన్నడిగుల అభిమానాన్నీ చూరగొంది. త్వరలో రెండో ముద్రణకు వెళ్లనుండడం దీనికి నిదర్శనం. రెండు రాష్ట్రాల పాఠకుల్ని ఆకట్టుకోవడమేగాక, ఆలోచింపజేసిన 'ముద్ర' 'కథవెనుక కథ' ఈనెల మీకు ప్రత్యేకం!

రచయిత డాక్టర్ రాసాని చిత్తూరుజిల్లా తిరుపతిలో తెలుగు అధ్యాపకులు. స్వస్థలం సమీపంలోని ఓ మారుమూల పల్లె. రాయలసీమలో బసివిని పేరుతో మోసపోతున్న, మొత్తం జీవితాన్నే కోల్పోతున్న దళిత వనితల హృదయావేదన ఆయనను కదిలించింది. ఆ కష్టనష్టాల్ని అక్షరీకరించాలన్న తపన రగిలించింది. పర్యవసానమే 'ముద్ర'. 2006 డిసెంబరు 'చతుర'లో ప్రచురితమైన ఈ నవలకు పాఠకులతో పాటు విమర్శకులనుంచీ ప్రశంసల జడి. కన్నడిగుల మనసుల మీదా దీని ముద్ర పడింది. గత ఏడాది 'జోగతి' పేరున డాక్టర్ టి.డి. రాజన్న తగ్గి దీన్ని కన్నడంలోకి అనువదించారు. త్వరలోనే ద్వితీయ ముద్రణకు వెళ్తోందని చెబుతున్నారు. ఈ సందర్భంగా మూల రచయిత రాసాని ఏమంటున్నారో వినండి..

'ముద్ర' చతురలో నవలగా రావడానికి ముందే 'అక్షింతలు' పేరిట కథగా, ఆ తర్వాత 'మాత' పేరుతో నాటకంగా రాశా. 'మాత' తిరుపతి ఆకాశవాణి నుంచి ప్రసారమైంది. ఆ తర్వాతే దీన్ని నవలగా రాయాలని అనుకున్నా. అంశమేమో సున్నితం. పీడిత వనితల బతుకు చిత్రానికి అద్దంపట్టేది. పురుషుల దురహంకారాన్ని వేలెత్తిచూపేది. అంటే కరుణతో పాటు కాఠిన్యాన్నీ మేళవించి, వ్యథార్త జీవిత యదార్థ దృశ్యాన్ని పాఠకుల ఎదుట నిలపాలన్నమాట. సంప్రదాయమంటూ

సాగుతున్న అకృత్యాన్ని వెల్ల డించడంలో ముందు జాగ్రత్త ప్రధానం. ఇమిడే భావం, వాడే శైలి, రాసే భాష, అంత ర్లీనంగా సాగే హృదయ ఘోష.. అన్నిటా పదును ముఖ్యం. దురంతాల కోరల్లో చిక్కిన స్త్రీల, బాలికల దురవ స్థను చూపుతూనే మరోవైపు స్వార్థబుద్ధుల టక్కుటమారాల్ని ఎండగట్టాలి అనుకున్నాను.



కన్నడ నవల 'జోగతి' ముఖచిత్రం

'ముద్దరేసి వదలడం' రాయలసీమలో బాగా వాడు కలో ఉన్నమాట. బసివి ఆచా రాన్ని అడ్డుపెట్టుకుని 'మృగాళ్లు' సాగించే దుష్కృత్యం కాబట్టే 'ముద్ర' పేరు పెట్టాను. నవలలో ఉన్నవి సజీవ పాత్రలే. స్వస్థలం చిత్తూరు జిల్లాలో, పొరుగు రాష్ట్రం తమిళనాడుకి చెందిన కొన్ని ప్రాంతాల్లో ఇప్పటికీ ఉన్న స్థితిగ తులే. చిన్నతనంలో చూసిన, ఆ తర్వాత కాలంలో గమనించిన వ్యక్తుల రీతులనే నవలలో పొందుపరిచా. పులిచెర్ల, కాళ హస్తి, చిత్తూరు దగ్గరి కల్లూరు... ఇలా పల్లెల్లోనే కాదు.. తిరుపతి పట్టణం, పరిస రాల్లో కూడా తిరిగి చూశాను. నిజజీవితం లోని పాత్రల్ని నవలలోకి తెచ్చినందుకే ఇంత సహజత్వం. రెండు దశాబ్దాలక్రితమే తిరుపతి స్థానిక టీవీలో 'కన్నెరికం' అనే కార్యక్రమానికి రూపకల్పన చేశాను. అదే ఊళ్లలోని మాతమ్మల నివాస ప్రాంతాల తీరుతెన్నుల్ని పరిశీలించాను. నాకు తెలిసి నవి, ఇతరులతో మాట్లాడి తెలుసు కున్నవి.. వీటినే నవలలో పొందుపరి చాను. ఆ సజీవ, సహజ పాత్రలు కొన్ని నేటికీ తిరుగాడుతుంటాయి. నా కళ్ల ముందే! రచయితగా నా మదిని కదిపిన పాత్రలు రెండు. కోటమ్మ, అలివేలు. ప్రధా

### సజీవ, సహజ పాత్రలు

ఎత్తుగడ ఎలా ఉండాలి? పరిస్థితిని వర్ణించాలా? సంభాషణగా చెప్పిం చాలా?.. ఇలా ఎన్ని ఆలోచనలో! మిత్రుడు మధురాంతకం నరేంద్రతో ఎన్నెన్ని చర్చలో!! ఒకటీ రెండూ కాదు.. మూడేళ్ల మనోమథనం. నవలగా రూప చిత్రణకు ఇంకో మూడేళ్లు. అంతా కలిసి ఆరేళ్ల శ్రమ ఫలితమే ముద్ర! ముసలి ఓబులవ్వ, సాయిబులమ్మి హసీనా సంభా షణలతోనే నవల ఆరంభం. తనకథ చెప్పిన హసీనా తదుపరి కథని నడిపిం చడం ప్రత్యేక అంశం.

మనసులోనిది కాగితంమీద పెట్టడానికి తపించాను, పరిశ్రమించాను. నాలుగు సార్లు తిరగరాశాను. అప్పటికి వచ్చింది ఆశించిన రూపం.

## సంచలనం

మనదేశంలోని అనాచార పద్ధతుల్లో 'జోగిని' ఒకటి. ఆ పూర్వాపరాలు, స్థితిగతుల్ని రాసాని ఎంతో విశ్లేషించి రాశారు. ఇది కన్న డంలో ఓ నూతన కథావస్తువు కావడంతో, అంతటా సంచలనం కలిగించింది. ఆయనని, కన్నడంలో అనువదించి ముద్రించిన వారిని మనస్ఫూర్తిగా అభినందిస్తున్నా.

– మీరా సాబిహళ్లి శివన్న,
బెంగళూరు (ప్రసిద్ధ సాహితీవేత్త)

## ప్రయోగాత్మకం

కర్ణాటక సాహిత్యలోకంలో సంచలనం కలి గించిన కాదంబరి (నవల) ఇది. సరికొత్త ప్రయోగాత్మక రచనగా ఎందరో కన్నడిగుల గుండెల్ని తాకింది. ఇందులోని కథనరీతికి చదువరులు స్పందించిన రీతి మాత్రం మాటలకు అందనిది, అపూర్వమైనది కూడా.

– కుం. వీరభద్రప్ప, బళ్లారి
(కన్నడ రచయిత, కేంద్ర సాహిత్య
అకాడమీ పురస్కార గ్రహీత)

నపాత్ర కోటమ్మ రూపుని బాల్యంలోనే చూశాను.

### సత్వర స్పందన

చతురలో 'ముద్ర' నవల రావడం, కన్నడంలోకి అనువాదంగా మారడం.. నన్నెంతో ఆనందపరిచిన సందర్భాలు. ఆ తర్వాత తిరుపతి మహతి ఆడిటోరియంలో ఏర్పాటైన చైతన్య సదస్సు. అక్కడ న్యాయమూర్తి ఆధ్వర్యంలో దీన్ని నిర్వహించారు. బసివినులకు పునరావాసం, ఇతర సహాయాలకు కూడా అక్కడే శ్రీకారం చుట్టారు. ఇంతటి స్పందనకి నా రచన కారణమైనందుకు ఇంకా ఇంకా ఆనందం.



రాసాని

### కథాంశమిదీ..

ఊరిచివర దళితవాడలో బసివిని గుడిసె.. వృద్ధ యాచకురాలు ఓబులవ్వ నివాసం. అటువైపు ఎవ్వరూ రాకపోవడానికి కారణముంది. ఊళ్లోని మాతమ్మ ఆచారానికి ఎందరో ఆడపిల్లలు బలైంది అక్కడే. ఆమెకూడా ఒకప్పుడు బసివినిగా ముద్రపడి చివరికలా అనాథగా మారింది. ఓ అర్ధరాత్రి గుడిసెలోకి వచ్చిన హసీనా.. అక్కడే నాలుగు రోజులు ఉంటానంటుంది. అవ్వకు వంద రూపాయలిస్తుంది. కేవలం నాలుగు రోజుల వ్యవధిలో కథంతా పూర్తి. సారాంశమంతా ఆ యిద్దరు స్త్రీలూ మాట్లాడుకోవడంలోనే ఉంటుంది. హసీనా ఎవరనేది నవల చివరిదాకా సస్పెన్స్!

ఆమె పూర్వపు పేరే కోటమ్మ. తనూ దురాచార సర్పదష్టురాలే. తనకు లొంగడం లేదని ఊరి సర్పంచి ముసలయ్య.. శాస్త్రితో కలసి కుట్రపన్ని ఆమెని 'బసివి'గా మార్చి ఓ బిడ్డకు తల్లిని చేస్తాడు. అంతటితో ఊరుకోక తన అవసరాలకోసం అధికారులకు తార్చబోతాడు. తప్పించుకొచ్చిన ఆమెపై హత్యాయత్నం చేయిస్తాడు. బిడ్డను తల్లిదండ్రులకు వదిలేసి ఊరుమారిన ఆమెకు పొలం పనుల్లో పరిచయమవుతాడు మణి. ఆ తమిళ వలసకూలీతో కలిసి రైలెక్కుతుంది. కన్నమ్మ అని పేరు మార్చుకుని అతని భార్యగా అక్కడికి వెళ్ళిపోతుంది.

మణికి అదివరకే పెళ్లయింది. ఆ మొదటి భార్య పేరు అలివేలు. ఆమెతో అవమానం, ఆపై కులవివక్ష కూడా కన్నమ్మకు ఎదురవుతాయి. మణి నిరాదరణకు గురై అక్కణ్నుంచి వెళ్లిపోతుంది. ఐస్ ఫ్రూట్స్ అమ్ముకుని బతికే సలీం మాయమాటలకు లొంగి అతని ఇంటికి చేరుతుంది. తనే ఉర్దూ నేర్పించి, హసీనాగా ఆమె పేరు మారుస్తాడు. కువైట్ అంటూ తీసుకెళ్ళి బొంబాయిలోని వేశ్యాగృహానికి అమ్మేస్తాడు. ఏళ్లు గడుస్తాయి. తనలాగే

### మరో ముద్రణ

కన్నడదేశంలోనూ 'ముద్ర' అనువాద నవల 'జోగతి'కు ఎంతో ఆదరణ లభిస్తోంది. పేరున్న కన్నడ నవలలతో సమంగా, ఇదీ ఇక్కడ చాలా మందిని చదివించింది, ఇంకా ఇంకా చదివిస్తోంది. రచయిత రాసాని, అనువాదకుడు రాజన్న తగ్గి ఎంత ఆనందిస్తున్నారో ప్రచురణకర్తగా నాకూ అంతే సంతృప్తి, అంతే సంతోషం. ఏడాది గడవకముందే ఇప్పుడిక రెండో ముద్రణకు సిద్ధమవుతున్నా.

**–ఎం. భైరేగౌడ,**
బెంగళూరు, ముద్రాపకుడు

మోసపోయి అదే గృహానికి చేరిన విజయ అనే తెలుగు అమ్మాయిని ఆమె చేరదీస్తుంది. కాపలాగా ఉన్న రౌడీ షేర్ ఖాన్‌ను ఉపయోగించి విజయతోపాటు తానూ తప్పించుకుంటుంది. గుడిసెకి చేరుకుని తన కన్నీటికథనే ఓబులవ్వకు వినిపిస్తుంది. అప్పటి ఆ కోటమ్మే ఇప్పుడీ హసీనా. తర్వాత కథ మొత్తాన్నీ తనే నడుపుతుంది.

చిన్నప్పుడే తను వదిలివెళ్లిన కూతురు ఏమైంది? అది తెలుసుకోవడానికే తిరిగి వచ్చిందామె. అయితే ఆమె కూతుర్ని 'ఊరి బాగు' పేరిట బసివినిగా మార్చాలని కొందరు సిద్ధమవుతారు. రంగంలోకి దిగిన కోటమ్మ ఆపల్లె ఆడవాళ్ళలో నిశ్శబ్ద విప్లవాన్ని తెస్తుంది. కోరుకున్న అబ్బాయితోనే కూతురుకి పెళ్లి జరిపిస్తుంది. దురంతానికి అలా అడ్డుకట్టవేసిన ఆమె తన 'మైల జీవితం' కూతురిపై పడకూడదని రాత్రికి రాత్రే ఊరొదిలి చీకట్లో కలిసిపోతుంది. మర్నాడు తెల్లవారుజామునే ఓబులవ్వ శవంగా మారిపోతుంది. హసీనాగా వచ్చి కోటమ్మ యిచ్చిన వందనోటు ఆ ముదుసలి చేతిలో రెపరెపలాడుతుంటుంది. ఇదీ నవల సారాంశం.

### ఆద్యంతం ఆసక్తికరం

'ముద్ర'లో కథాగమనం తొలినుంచీ ఆసక్తికరమే. కోటమ్మకంటే ముందే పన్నెండేళ్ల బుడ్డమ్మను ఊళ్లో బసివినిగా మారుస్తారు. 'కన్నెరికం' చేస్తాడు ముసలయ్య. కొందరు మగవాళ్ళు ఆమెను పువ్వులా నలిపేసి, చంపేసి, శవాన్ని చింతలతోపులో వేలాడదీసి ఆత్మహత్యగా నిరూపిస్తారు! ఇదంతా చదువుతుంటేనే గుండె చెదిరిపోతుంది. మరి రెండు కీలక పాత్రలు.. మూగగా కోటమ్మను ఆరాధించే కిష్టయ్య, తాగుబోతు 'గుండెకాయలోడు'. వందనోటును చేతిలో పట్టుకుని ఓబులవ్వ చనిపోవడం ఇంకో ఘట్టం. సమాజంలోని అన్ని దురాచారాలు, దయనీయ పరిణామాలకు డబ్బే మూలమనేది దీంతో ప్రస్ఫుటమవుతుంది. పాత్రానుగుణంగా వాడిన చిత్తూరు మాండలికం, తెలుగు- తమిళభాషల కలబోత యాసలూ చదువరుల్ని ఆకట్టుకుంటాయి. త్వరలో తమిళంలోకీ ఈ నవల అనువాదం కాబోతోంది మరి.

సేకరణ: శరత్‌బాబు

## కృషి ఫలించింది



ఇంత మంచి నవలను కన్నడంలోకి అనువదించినందుకు ఆనందంతో తబ్బిబ్బవుతున్నా. సమస్య తీవ్రతను పాఠకుల ముందుకు తెచ్చినందుకు సంతోషిస్తున్నా. మొదట ఇది 'చతుర'లో వచ్చినప్పుడు, చదివినంతసేపూ చలించిపోయాను నేను. కొందరి కారణంగా బసివినులుగా మారిన కోటమ్మ, బుడ్డమ్మల స్థితికి ఎంత తల్లడిల్లిపోయానో! రాసాని ఎవరో అప్పట్లో నాకు తెలియకున్నా, నవలానువాదం సాగించాను. తదుపరి స్పందన చూస్తుంటే, నాటి నా కృషి వృథాపోలేదనే అన్పిస్తోంది.

**–డాక్టర్ టి.డి. రాజన్న తగ్గి**
'ముద్ర' అనువాదకులు

## చెంప దెబ్బ

పురుషాధిపత్య సమాజంపైన ఎక్కుపెట్టిన బాణం.. ఈ నవల. జోగినీ దురాచారానికి ఇదో చెంపదెబ్బ. కొన్ని కులాల్లో ఎప్పటినుంచో ఉన్న ఓ అనాచారాన్ని తీసుకుని ప్రతిభావంతంగా రాసిన నవలా రచయిత రాసాని అభినందనీయులు. ఇతివృత్తం ఎంతో అరుదైంది కావడంతో, కన్నడంలోనూ పేరు సంపాదించి పెట్టింది. ఆయనను కన్నడిగులకు దగ్గర చేసింది.

**– డాక్టర్ దొడ్డ రంగేగౌడ,**
సినీ రచయిత, 'జోగతి' ఆవిష్కర్త

# శ్రుతికావ్య కర్త బేంద్రే

ద.రా.బేంద్రే

**కస్తూరి... పరిమళాన్ని విస్తారంగా పంచినట్లు కన్నడ వైభవం 2007 నాటికే ఏడుసార్లు జ్ఞానపీఠ పురస్కారాన్ని తెచ్చిపెట్టింది. మరాఠీ వాడైనప్పటికీ దత్తాత్రేయ రామచంద్ర బేంద్రే కన్నడమే తన సర్వస్వంగా భావించి అధునిక కన్నడ కవితా పితామహుడుగా, కర్ణాటక కుల తిలకుడుగా, వరకవిగా ప్రశస్తి గాంచాడు. భారతీయ ఏకత్వతా నిరూపణకు మణిద ర్పణంగా నిలిచాడు. విశ్వవ్యాప్తంగా ప్రతి కన్నడ గృహంలోను బేంద్రే పేరు సుపరిచితం. 'నాకుతంతి' కావ్యానికిగాను ఆయన ప్రఖ్యాత ఒరియా నవలాకారుడు గోపీనాథ్ మహంత్‌తో సంయుక్తంగా 1973లో జ్ఞాన పీఠ పురస్కారం అందుకున్నారు.**

**బేం**ద్రే కర్ణాటకలోని ధార్వాడ్‌లో 1896 జనవరి 31న జన్మించాడు. తండ్రి రామచంద్రభట్, తల్లి అంబుతాయి. వీరిది పండిత కుటుంబం. పితామహుడు అప్పాభట్ దశగ్రంథి. రామచంద్రభట్ కూడా పండితుడే. వీరి పూర్వీకులు మహారాష్ట్రలోని కొలాబా జిల్లా కుంభారు గ్రామం నుంచి వచ్చి ధార్వాడ్ జిల్లా షిరహట్టిలో స్థిరపడ్డారు. బేంద్రే పన్నెండో యేటనే తండ్రిని కోల్పోవడంతో తల్లి, అమ్మమ్మ పెంచారు. 'పూటకూళ్ళు' నడిపి జీవనం సాగించారు. అందుకే తల్లిపేరు కలుపుకొని 'అంబికా తనయ దత్త'గా సాహితీ నామం పెట్టుకున్నాడు. ధార్వాడ్‌లోని విక్టోరియా ఉన్నత పాఠశాలలో మెట్రిక్యులేషన్ ఉత్తీర్ణుడయ్యాడు. పుణె ఫెర్గుసన్ కళాశాలలో పట్టభద్రుడయ్యాడు. బాల్యంలోనే సాహిత్యాభిరుచితో కవితా రచన ప్రారంభించాడు. 'కర్నాటక మిత్ర' అనే లిఖిత పత్రిక నడిపాడు. భక్తి సాహిత్యం, రవీంద్రుని, అరవిందుని రచనలు కూలంకషంగా అధ్యయనం చేశాడు. బేంద్రే తను చదివిన పాఠశాలలోనే ఉపాధ్యాయుడుగా జీవనయాత్ర ఆరంభించాడు. లక్ష్మీబాయితో వివాహమయింది. ఆంగ్లేయ పాలనను నిరసిస్తూ, దేశభక్తి ప్రపూరితమైన 'నరబలి' అనే వ్యంగ్య రచన చేసి జైలు శిక్ష అనుభవించాడు. ఉద్యోగం పోయింది. పుణెలో పినతండ్రి వద్ద వుండి కన్నడం - ఇంగ్లీషులో ఎం.ఏ చేశారు. కౌటుంబిక జీవితంలో ఎన్నో కష్టాలు ఎదురయ్యాయి. తల్లి, ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు మరణించారు. గడగేత, హుబ్లీలో కొంతకాలం ఉపాధ్యాయుడుగా పనిచేసి, పుణెలోని కామర్స్ కళాశాలలో అధ్యాపకుడుగా చేరాడు. చివరకు షోలాపూర్‌లోని డి.ఎ.వి. కళాశాల కన్నడ శాఖలో 1946లో ఆచార్య పదవి లభించింది. కష్టాలు వెన్నంటుతూనే వున్నాయి. కవిగా పైకివస్తున్న జ్యేష్ఠకుమారుడు రామచంద్ర ఆకస్మికంగా కన్ను మూశాడు. పన్నెండేళ్ల తర్వాత బేంద్రే ధార్వాడ్ తిరిగి వచ్చాడు. కేంద్ర ప్రభుత్వం 1956లో ధార్వాడ్ ఆకాశవాణికి సలహాదారుడిని చేసింది.

జ్ఞాన పీఠాలు 10

జీవితంలో ఎన్ని తీవ్ర సమస్యలెదురైనా బేంద్రే నిరంతర రచనాశీలిగా నిలిచారు. ఆయన తొలి కవిత 'తుత్తూరి'. 1917లో ప్రప్రథమంగా బేంద్రే కావ్యగానం చేసినప్పుడు రసజ్ఞ శ్రోతలు ఆయనలో భావి కవిశేఖరుణ్ని దర్శించారు. విమర్శకులు బేంద్రే కావ్య నిర్మాణ కాలాన్ని మూడు దశలుగా వర్గీకరించారు. అవి 1917-23 ఆరంభ దశ, 1923-56 పరిణతదశ, 1956-81 సముజ్జ్వల దశ. అతడి చాలా కృతుల్లో విశిష్టమైన సాంఖ్య దర్శన భూమిక ప్రస్ఫుటమవుతుంది. కన్నడంలో నూతన కావ్యధార రూపశిల్పుల్లో బేంద్రే ప్రముఖ

స్థానం వహిస్తారు. భావకవిత్వానికి నూతన అన్వయాన్ని, కల్పనా విలసనాన్ని ఆయన కల్పించారు. తనను వ్యక్తిత్వ నిరపేక్షపూర్వక శ్రుత్యర్థంలో భావనిష్ఠ కవిగా చెప్పుకున్నారు. "మాతు మాతు మథిసి బంద నాదద నవనీతా" అంటారు బేంద్రే. అంటే ప్రతి పదాన్ని మథిస్తే జనించే నాద నవనీతం ఆనందప్రదం. మొదట బేంద్రే సంప్రదాయ బద్ధమైన షట్పది, అర్థషట్పది ఛందం అవలంబించినా తర్వాత నూతన గేయ రూపాలు స్వీకరించారు. 'రాత్రిగె', 'జీవదగెళతి' వంటివి దీనికి ఉదాహరణలు. నూతనాభివ్యక్తి విధానాన్ని ఆయన ప్రవేశపెట్టారు. 'బెళగు' ఇందుకు చక్కటి తార్కాణం. 'చెట్ల, పొదల గళం నుంచి/ పక్షుల గానాలు వినిపిస్తున్నాయి/ అడివి నేల గంధర్వసీమగా మారింది'. కృష్ణకుమారి, గరి, మూర్తి, ఉయ్యాలె, నాదలీలె, సఖీగీతె, హాడు-పాడు, హృదయసముద్ర, ముక్తకంఠ, చైత్యాలయ మున్నగు కృతుల్లో బేంద్రే తన కవితా వైదుష్యాన్ని అద్భుతంగా ప్రదర్శించారు. అలంకారిక వైభవం, శైలీసౌందర్యం ఆవిష్కరించే ఈ కావ్యాలలో వస్తువైవిధ్యం కానవస్తుంది. 'సఖీ గీతె' దీర్ఘదాంపత్య సంబంధి కావ్యం. ప్రేమను ఎంత రసార్ద్రంగా చిత్రించారో ఆకలిని అంత శక్తిమంతంగా చూపారు: "గదరుత్తిహుదు గర్జిసుతి హుదు/ బడవర బగ్గర తుత్తిన చీలద/ ఒళగిన ఒళగిన దనియెుందు." ఇవి 'తుత్తిన చీల' కవితలోని పంక్తులు. పేదల ఆకలి ఆక్రోశాలు నేలను కబళిస్తాయని గర్జిస్తున్నట్లు హెచ్చరిస్తాడు. 'కురుడు కాంచాణ' ఐశ్వర్యమదాంధతను గర్హిస్తుంది. 'హృదయసముద్ర', 'నాకు తంతి' మొదలైనవాటిలో ఆధ్యాత్మిక చింతన చోటుచేసుకుంటుంది. అరళు-మరళు, జీవలహరి, ఇదునభోవాణి ఇత్యాదుల్లో మానవ జీవిత విశ్లేషణ గోచరిస్తుంది. 'నిరాభరణ సుందరి' బేంద్రే కథారచన కౌశలానికి మచ్చుతునక. తిరుకర పిడుగు, ఉద్ధార, నగెయహూగె వంటి నాటకాలు, సాహిత్య మత్తు విమర్శె, సాహిత్య సంశోధనె, విచార మంజరి, సాహిత్యద విరాట్‌స్వరూప మొదలైన విమర్శ గ్రంథాలు కన్నడ సాహిత్యంలో అత్యంత ప్రామాణికంగా నిలిచాయి. భగ్నమూర్తి, ఉపనిషద్రహస్య, కబీర వచనావళి, గురుగోవిందసింగ్ వంటి అనువాదాలు ఇంగ్లీషు, హిందీ, బెంగాలీ, మరాఠీ భాషల్లో ఆయన పాండిత్యాన్ని నిరూపిస్తాయి. ఆయన ఇంగ్లీషు, మరాఠీల్లో కూడా మౌలిక రచనలు చేశారు. 38 కావ్యాలు, ఆరు నాటకాలు, ఒక కథాసంపుటి, 11 విమర్శగ్రంథాలు, పది అనువాదాలు, ఓ ఆంగ్లరచన, నాలుగు మరాఠీ గ్రంథాలు రాశారు.

1964లో వెలువడిన 'నాకుతంతి' జ్ఞానపీఠ పురస్కారం పొందిన మహాకావ్యం. ఇది ప్రతీకాత్మకంగా సాగిన తాత్త్విక కావ్యం. నవ్యమానవావిర్భావాన్ని ప్రకటిస్తుంది. బేంద్రే విశ్వమానవతను ఇందులో అన్వేషిస్తారు. ఆత్మోన్నత్యాన్ని ప్రపంచీకరిస్తుంది ఇది. భారతీయ ఆధ్యాత్మిక భావ సారాన్ని నిక్షిప్తం చేస్తుంది. సార్వదేశికతను, ప్రజాస్వామ్య జీవన చైతన్యాన్ని ఉద్బోధిస్తుంది. ఇది 44 కవితల సమాహారం. నగరజీవనంలోని వికృతాలను చూపుతూ, అనర్థాలు నశించి నవానందం మోసులెత్తాలని చాటే కావ్యమిది. 'నాకు తంతి' అంటే నాలుగు తంత్రులని అర్థం. బేంద్రే కవితల్లో దీనికి మకుటస్థానం. విశ్లేషకులు దీనిని గొప్ప శ్రుతి కావ్యంగా వర్గీకరించారు. నేను, నీవు, అతను, ఆత్మ- ఈ నాలుగు పదాల తాత్త్విక, సామాజిక చతుర్ముఖాభివ్యక్తి ఈకావ్య వస్తువు. బీజాక్షరమంత్రం అంతర్నిహితమైవుంది. కవి మాటల్లోనే.. 'నాకుతంతిలోని నాలుగు భాగాలు ఒకే భావంలోని నాలుగు అభివ్యక్తులు. మొదటిది నాదప్రధానం. రెండవది భావచిత్రమయం. మూడోది ప్రశ్నోత్తర రూపం. చివరిది మొదటిదానిపై భాష్యం. ఇవే నాలుగు తంత్రులు' అందులోని కొన్ని పంక్తులు.. 'నేను నీవు మధ్య పోరాటం/ ఎమిటో నాకు తెలియదు/ నాలుగు తంత్రుల వాద్యంలో/ నాలుగు స్థానాల నాలుగు నాదాలు/ ఒక్కటైపోతాయి.'

కన్నడ సాహితీ రంగానికి బేంద్రే చేసిన మహత్తర సేవ 1923లో 'గెళెయరగుంపు' మైత్రీ సంఘాన్ని స్థాపించి, కన్నడ సాంస్కృతిక చైతన్యాన్ని, స్వాతంత్ర్య సమరోత్సాహాన్నీ ఉద్దీపింపచేయడం. బేంద్రే కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం, ఫెలోషిప్ పొందారు. ఆయనకు కేల్కార్ బహుమతి, మైసూరు, కర్నాటక విశ్వవిద్యాలయాలు, కాశీవిద్యాపీఠం గౌరవ డాక్టరేట్లు, భారత ప్రభుత్వం 'పద్మశ్రీ' గౌరవం, హైదరాబాద్ హిందీ ప్రచార సభ 'సాహిత్యచార్య' బిరుదం లభించాయి.

వరకవిగా, కర్నాటక కవికుల తిలకుడుగా సాహితీలోకం శాశ్వతస్థానం సమకూర్చుకున్న ద.రా.బేంద్రే 1981 అక్టోబరులో దివంగతులయ్యారు. కవిగా అమరుడయ్యారు.

**–గోవిందరాజు రామకృష్ణారావు**

ఎక్కడో పుట్టి, ఎక్కడో పెరిగినా, చదువులమ్మ చెట్టు నీడలో కలిశారా ఏడుగురు అమ్మాయిలు... శాంతి, లత, రమ, సుమ, స్వర్ణ, సుధ, సుజాతలు! చదువు పూర్తయి, జీవితంలో స్థిరపడినా వారి నడుమ పెనవేసుకుపోయిన ప్రేమానుబంధాలు చెదిరిపోలేదు.. వారిలో కొందరు ఎలా జీవనసమరంలో విజేతలుగా నిలిచారు? మరికొందరు కాలచక్రం ఇరుసుల నడుమ ఎలా నలిగిపోయారు? పరిస్థితులతో పోరాడి ఓడిపోయిన సుజాత దయనీయగాధ ఏమిటి? వారి హృదయాల్లో సజీవ వాహినిగా కొనసాగిన అంతస్సూత్రం ఏమిటి? గతంలోని మధుర స్మృతులను నెమరువేసుకుంటూనే వర్తమాన జీవితంలోని వెలుగునీడల్ని, ఎత్తుపల్లాల్ని అద్భుతంగా ఆవిష్కరించిన సిహెచ్.సుబ్బరత్నమ్మ కదంబమాల ఈ నెల చతుర కానుక!

# సిహెచ్. సుబ్బరత్నమ్మ

# కదంబమాల

"వి శాలమైన కాంపౌండులో బాటకిరు పక్కల ఉన్న అశోక వృక్షాలు గాలికి తలలూపుతూ, అతిథులను ఆహ్వాని స్తున్నాయి. సంధ్యా సమయానికి సంకే తంగా పక్షుల కిలకిలారావాలతో కాంపౌండు ప్రతిధ్వనిస్తోంది. కిలోమీటరు దూరంలో రాచకన్యలా తెల్లని బిల్డింగు నీరెండపడి మెరుస్తోంది. అమ్మాయిలంతా రకరకాల దుస్తులతో నవ్వుతూ, తుళ్ళుతూ తిరుగుతున్నారు. బ్యాడ్మింటన్ ఆడే వాళ్ళు, త్రోబాల్ ఆడేవాళ్ళు, స్కిప్పింగ్, లాంగ్‌జంప్, డిస్కత్రో రకరకాల ఆటలతో గ్రౌండు ఎంతో కోలాహలంగా వుంది. నేను, మా నాన్న చేయి పట్టుకొని భయభ యంగా చూస్తూ కాంపౌండు దాటి హాలు లోకి అడుగుపెట్టాను. మంచి ఒడ్డూ పొడ వుతో చాలా లావుగా వున్న ఆమె వేషధా రణ నాకు వింత అన్పించింది. బాబ్డ్ హెయిర్‌తో ఉన్న ఆ యాభైఏళ్ళ స్త్రీ మమ్మల్ని సమీపించి "హేమండి! మీ అప్లి కేషన్ చూశాను. మీ అమ్మాయిని హాస్ట లులో చేర్చడానికి వచ్చారు కదూ! కూర్చోండి" అంది నాన్ననుద్దేశించి. కంగారు, భయం, దిగులు, ఆందోళన వీటిలో ఏది ఎక్కువగా ఉన్నదో చెప్పలేని స్థితిలో నేను నాన్న చెయ్యివదలకుండా పట్టుకున్నా.

"ఉమెన్స్ హాస్టల్‌కు నేనే వార్డెన్‌ని. పక్కనున్న ఆఫీసు రూమ్‌లో, ఫీజుకట్టి రసీదు తీసుకురండి. రూమ్ ఎలాట్ చేస్తాను" అంది ఆ ఆంగ్లో ఇండియన్ లేడీ.

"ఇప్పుడే వస్తానుండమ్మా" అంటూ వెళ్ళారు నాన్న. పది నిముషాలలో ఆయన వచ్చి రిసీట్ ఆమె చేతిలో పెట్టగానే,

"శాంతీ! నీకు రూమ్ నెంబరు నైన్ యిచ్చాం. యూ ఆర్ సో లక్కీ. పెద్ద హాలులాగా వుంటుంది. ఇప్పటికి ఆరుగురు అమ్మాయిలున్నారు. నువ్వు ఏడోదానివి. మా అమ్మాయిలందరూ చాలా మంచివాళ్ళు. డిగ్రీ చదివే పిల్లవి ధైర్యంగా ఉండాలి. వాళ్ళు నీ దిగులు పోగొట్టి వాళ్ళలో కలుపుకుంటారులే" అంది.

తర్వాత నాన్నవైపు తిరిగి "అమ్మాయి గురించి మీరేమి దిగులు పడక్కరలేదు. సో, మీరు వెళ్లిరండి. థ్యాంక్యూ" అంది ఆమె.

"స్వీపరు సామాను తెస్తుంది. నువ్వు నా వెంట రామ్మా! నీకు రూమ్ చూపించి మీ రూమ్మేట్స్‌ని పరిచయం చేస్తాను" అంది నా చెయ్యి పట్టుకొని రమ్మన్నట్టుగా.

ఎప్పుడూ అమ్మని, నాన్నని వదిలి వుండని నాకు కళ్లలో నీరు తిరిగింది. నాన్న కూడా వదలలేక వదిలి వెళ్తున్నట్టు నెమ్మదిగా అడుగులేస్తూ హాలు దాటారు.

"శాంతీ! కంట్రోల్ యువర్ సెల్ఫ్! యూ ఆర్ ఎల్డర్! కమాన్" అంది వార్డెన్ కదుల్తూ.

తప్పదన్నట్టుగా ఆమె వెంట వరండా దాటి చెక్కమెట్లు ఎక్కి మేడపైకి వెళ్ళా. చాలా పెద్ద హాస్టలు. గవర్నమెంటు కాలేజీ హాస్టలు కదా! పకడ్బందీగా వుంది. అమ్మా యిలు కొందరు పిట్టగోడ మీద కూర్చొని రోడ్డుమీద వచ్చేపోయే వాహనాలను చూస్తూ కామెంటు చేస్తున్నారు. కబుర్లు చెప్పుకుంటున్న కొంతమంది అమ్మాయిలు నా వైపు ఒకసారి చూసి మళ్ళీ కబుర్లలో లీనమయ్యారు. బిల్డింగుకు దూరంగా బాట కిరుపక్కలనున్న చింత, వేప, మద్ది చెట్ల కింద ఇవేమి పట్టనట్టు కొంతమంది అమ్మాయిలు ఏకదీక్షగా చదువుతున్నారు. ఇంత సంతోషంగా వీళ్ళంతా ఎలా వున్నా రబ్బా అన్పించింది. కార్నర్‌లో వున్న ఒక రూమ్ దగ్గర ఆగి, మునివేళ్ళతో తలుపు తట్టింది వార్డెన్.

"కమిన్" అని విన్పించింది.

లోపలకి వెళ్లగానే- టేబిల్ దగ్గర కూర్చొని రికార్డు రాసుకుంటున్న యిద్దర మ్మాయిలు, "గుడీవెనింగ్ మేడమ్" అంటూ లేచి నిలబడ్డారు.

"ఈ అమ్మాయి శాంతి. ఈ రోజే హాస్ట లులో చేరింది. మీ రూమ్మేట్. లత, రమా..మీరిద్దరూ ఈ అమ్మాయి దిగులు పోగొట్టి మీలో కలుపుకోవాలి. గుడ్‌నైట్" అంటూ వెళ్ళిందావిడ.

"శాంతీ! కూర్చో!" అంటూ చనువుగా భుజంమీద చెయ్యేసి కూర్చోబెట్టింది ఒక మ్మాయి. ఫ్లాస్కులో నుండి కాఫీ పోసి చ్చింది మరొకమ్మాయి. కాఫీ తాగగానే కొంచెం రిలీఫ్‌గా అన్పించింది నాకు. ఎర్రగా, సన్నగా వున్న అమ్మాయి 'లత' అని, పొడవుగా వున్న అమ్మాయి 'రమ' అని పరిచయం తర్వాత తెలిసింది.

"కాట్ మీద దుప్పటి వేస్తాను. ఇవ్వం డమ్మా" అంది సూట్‌కేస్ తెచ్చిన స్వీపర్.

దుప్పటి తీసిచ్చి సాయంత్రం స్నానం చేసే అలవాటువల్ల పావడా, వోణీ, టవల్ అన్నీ భుజాన వేసుకొని సోప్‌బాక్స్ చేతిలో తీసుకున్నా.

"శాంతీ! హాస్టలులో ఇప్పుడు స్నానం చేసిరావడమంటే బ్రహ్మాప్రళయం. రేషన్ షాపులో కంటె పెద్ద క్యూ వుంటుంది. ప్చ్. లాభంలేదు" అంది రమ.

"గణ గణ" బెల్ మోగింది.

"దేనికి? " అన్నా.

"సాయంత్రము ఏడింటికల్లా అందరూ ప్రేయర్ హాలుకెళ్ళాలి. అక్కడ అటెండెన్సు తీసుకుంటారు" అంది రమ.

అందరం పెద్దహాలులోకెళ్ళాం. సుమారు మూడొందల మంది అమ్మాయిలున్నారు. అంతా నిశ్శబ్దంగా కింద కూర్చున్నాం. సర్వ మత ప్రార్థన జరిగింది. కొంతమంది అమ్మాయిలు భక్తిగీతాలు పాడారు. వార్డెన్ వచ్చి అటెండెన్సు తీసుకొని వెళ్ళింది.

"రమా! లతా! ఈ అమ్మాయెవరు? " అంటూ ఒక పొడుగాటి అమ్మాయి ప్రశ్నించింది.

"శాంతి అని మన రూమ్మేట్. నీవు పుస్తకాల పురుగువు కదా! నీకు తెలీదు" అంది లత.

తర్వాత తనే "ఈ అమ్మాయి స్వర్ణ. అన్నింటిలో తనే ఫస్ట్. యన్.సి.సి. ఆఫీసరు కూడ" అంటూ నాకు పరిచయం చేసింది.

ఒక్కరి ముఖంలో కూడ దిగులు, విచారం కాగడాబెట్టి వెదికినా కన్పించటం లేదు. నేను ఆలోచిస్తుండగానే మళ్లీ 'బెల్' విన్పించింది. ప్రశ్నార్థకంగా చూశా.

"శాంతీ! ఇది మీల్స్ బెల్. టయిమ్ అంటే టయిమే మన 'రాక్షసి'కి. ఆలస్యమయ్యామంటే నీళ్ళ సాంబరే గతి!" అంటూ రమ అందరినీ హడావుడిగా డైనింగ్ హాల్‌కి తీసుకెళ్ళింది. నేను అంత పెద్ద డైనింగ్ హాలును ఎప్పుడూ చూడలేదు. చాలా టేబిల్స్, కుర్చీలు వున్నాయి. అమ్మాయిలంతా బిలబిలలాడుతూ తమ తమ ఫ్రెండ్స్‌తో తలొక టేబిల్ దగ్గర చేరిపోయారు. వంటవాళ్లు వరుసగా వడ్డిస్తున్నారు. నాకెందుకో ఆ వాసనలకు కడుపులో దేవినట్టయింది.

"ఏమిటి? మొహం అలా పెట్టావు? ఇక్కడ మొహమాటం పెట్టుకుంటే కుదరదు. ఎలాగో సర్దుకొని తినెయ్. మన నాయరు పెట్టినట్టు ములక్కాడల సాంబారు ఎవరూ పెట్టరు తెలుసా? " అంటూ సాంబారు బక్కెట్టు తెచ్చి అందులో ములక్కాడలు వేసుకొనే పనిలో పడింది రమ.

చుట్టూ చూశా. అందరూ జోక్స్ చెప్పుకుంటూ ఆవురావురుమని తింటున్నారు. నాకేమో ఒక్క ముద్దా మింగుడు పడలా.

"ఇదేమిటి? నీవు ఒక్క ముద్దకూడ తిన

లేదు. ఇలా అయితే నీ శాల్తీ గల్లంతే" అంది సుజాత, అప్పుడే నన్ను చూసి మాట కలుపుతూ.

"ఒక్క గ్లాసు మజ్జిగ తాగుతాను. ఈ పూటకు చాలు" అన్నా.

"ఈరోజు కొత్త కాబట్టి అలానే ఉంటుంది.. రేపటినుండి నువ్వే అలవాటు పడతావులే" అంది స్వర్ణ.

"ఆ అమ్మాయి అసలే కొత్త. మీరేమిటి వసపిట్టల్లాగ వాగి ఆ అమ్మాయిని బెదరగొడుతున్నారు" అంది సుమ నవ్వుతూ.

డైనింగు హాలునుండి అందరం బైటికి వచ్చి మేడమెట్లు ఎక్కుతుండగానే గణగణ బెల్ మోగింది.

"మళ్ళీ బెల్ ఏమిటి? " అన్నా.

"స్టడీ అవరన్నమాట. పది గంటలదాకా చదవాలి. పరీక్షలప్పుడు అయితే పదిన్నర దాకా వుంటుంది. తర్వాత ఏ గదిలోనూ జీరో బల్బు తప్ప ట్యూబ్‌లైటు వెలగకూడదు. వార్డెను, ప్రిన్సిపాల్ కూడ సూపర్ విజన్‌కు వస్తారు" అంది సుజాత.

మేము రూమ్ చేరేసరికే అమ్మాయిలు కొందరు వరండాలో కూర్చొని ఏం చదవాలా అని చర్చించుకుంటున్నారు. మరి కొందరు 'బాడీ ప్రెజంట్.. మైండ్ ఆబ్సెంట్' అన్నట్టు పుస్తకం చేతిలో పట్టుకుని దీర్ఘాలోచనలో ఉన్నట్టున్నారు. రూమ్‌కొచ్చి బ్యాగులోని పుస్తకాలు తీసి షెల్ఫ్‌లో సర్ది, చదువుదామని ఓ పుస్తకం తెరిచా. ఒక్క అక్షరమూ చదవలేక పొయ్యా. కండ్లనీరు అక్షరాలను కమ్మేస్తోంది.

డైనింగ్ టేబిల్ దగ్గర చిలిపి కజ్జాలతో తమ్ముళ్ళతో, చెల్లెలితో కలిసి చేసే భోజనం, మధ్యలో నాన్న ఊరడింపు, అమ్మ ఆప్యాయతతో కూడిన మందలింపుతో కొసరి కొసరి వడ్డిస్తుంటే, వద్దంటూనే తినేవాళ్ళం. నేను ఆలోచనలలో ఉండగానే "కొత్తగా హాస్టలులో చేరిన అమ్మాయివి నువ్వేనా? " అనే గంభీరమైన స్వరానికి ఒక్కసారిగా ఉలిక్కిపడి లేచి నిలబడ్డా.

"హాస్టలు వాతావరణం చదువుకు బాగా అనుకూలంగా వుంటుంది. హోమ్ సిక్‌నెస్ వదిలిపెట్టి బాగా చదువుకో. కంట్రోల్ యువర్‌సెల్ఫ్. డోంట్ బీసిల్లీ!" అంటూ ముందుకు వెళ్ళారు మా ప్రిన్సిపాల్. ఆమెను చూస్తేనే అందరూ పులినో, సింహాన్నో చూసినట్టు హడలి చస్తారు. కేరళ ఆమె. బాధ్యతలేమి లేవు కాబట్టే హాస్టలు క్యాంపస్‌లోనే వేరే బిల్డింగ్‌లో ఉంటుంది. భోజనం చెక్ చెయ్యటానికి ఆమె కూడ డైనింగ్ హాల్‌కే వస్తుందట. ఆమె అంత దగ్గరగా వచ్చి మాట్లాడేసరికి నాకు కొంచెం ధైర్యం వచ్చినట్లయ్యింది. 'ఛీ! నేనేమిటి? యింత చిన్నపిల్లలా ఏడుస్తున్నాను. రేపటినుండి బాగా చదువుకోవాలి' అనుకుంటూ బెడ్‌మీద చేరా. పగలంతా సామాను సర్దుతూ క్షణం తీరిక లేకుండా తిరగడం వల్ల వెంటనే కళ్ళు మూతలు పడ్డాయి.

గణ గణ గంట మోత, వార్డెన్ కంచు కంఠం విన్పించేసరికి కళ్ళు తెరిచా. అప్పటికే స్వర్ణ టేబిల్ దగ్గర చదువుతూ కన్పించింది. "తెల్లవారుజాము ఐదు గంటలయ్యింది. లేచి చదువుకోవాలి. వార్డెన్ సూపర్ విజన్‌కు వస్తుంది. కమాన్ బ్రష్ చేసుకో శాంతీ!" అంటూ లత, రమ, సుజాత వెళ్లారు.

వార్డెన్ తిట్లకు భయపడేమో తూగుతూ, జోగుతూ చదువుతున్నారు. వార్డెన్ పైకి రావడంతో అంతా సర్దుకుని కూర్చున్నారు.

"ఏయ్! లే! ఏందా మొహం. బ్రష్ చేసుకువచ్చి కూర్చో నిద్ర మొహంతో నువ్వేమి చదివావో చెప్పు వింటాను" అంటూ ఒకమ్మాయి దగ్గర ఆమె కుర్చీ లాక్కుని కూర్చుంది. దెబ్బతో ఆ అమ్మాయి కిక్కురుమనకుండా బాత్‌రూమ్స్ వైపు





వెళ్లింది.

ఆరు గంటలకల్లా మళ్లా బెల్ విన్పించే సరికి "కాఫీకి అమ్మడూ!" అంటూ అందరూ గ్లాసులెత్తుకుని పరుగెత్తారు.

నాకు గ్లాసు లేక, మేడపైన రూములో కిటికీ నుండి చూస్తున్నా. పెద్ద గంగాళాల్లో కాఫీ తెచ్చి క్యూలో నిలబడ్డ వాళ్ల గ్లాసుల్లో పోస్తున్నారు. నా కెందుకో అలా క్యూలో నిలబడాలంటే నామర్దాగా వుంది. ఈ లోపల లత, రమ ఫ్లాస్కుల్లో కాఫీ పోయించుకొచ్చారు. "ఎందుకంత హడావుడిగా పరుగెత్తారు. నిదానంగా పోగూడదూ!" అన్నా.

"సర్లే! భలే చెప్పొచ్చావ్. నిదానంగా పోతే మరల కాఫీ కలపలేక నాయరు నీళ్లతో కాఫీని డైల్యూట్ చేస్తాడు. అందుకే భోజనానికెప్పుడూ ముందుండాలి" అంది గీతా బోధ చేస్తున్నట్టు చెయ్యిపెట్టి రమ.

"సరే! నాకు ఈ రోజైనా స్నానం చేసే ప్రాప్తముందా? " అన్నా.

"భక్తా! వేచి చూడుము? " అంటూ అభయముద్రతో చెప్పింది స్వర్ణ.

బట్టలు భుజాన వేసుకొని సోప్ బాక్స్‌తో బాత్‌రూమ్స్‌వైపు నడిచా. కొండవీటి చాంతాడంత క్యూ వుంది. ఒక్కొక్క బ్లాకు చివర ఇరవై బాత్‌రూమ్స్ దాకా వున్నాయి. కాని ఒకరు స్నానం చేసి రాకముందే బట్టలు తలుపు మీద వేసి 'తొందరగా రావే' అని కేకలు పెడుతున్నారు. స్నానం చెయ్యకపోవడం వల్ల చిరాకుగా వుంది. పట్టు వదలని విక్రమార్కుడిలా ఎలాగైనా స్నానం చేసి తీరాలని నిలబడ్డా. కాళ్లు పీకుతున్నాయి. టిఫినుకు కాబోలు బెల్ మోగింది. రాత్రి అన్నం తినకపోవడం వల్ల నీరసంగా వుంది. 'ఎందుకొచ్చిన ఈ చదువు? అమ్మచెప్పినట్లు ఊళ్లేలాలా? ఉద్యోగం చెయ్యాలా? ' అన్పించింది. కాని నాన్న అమ్మకు నచ్చచెప్పి నన్ను చదువుకోమని ప్రోత్సహించినందుకు నాకు నేనే

## కొత్తగాలి...

**అచ్చ తెలుగు పదాలకోసం**
**డిక్షనరీల్లో ఎందుకు వేట?**
**పదదాం రండి అక్షరం మల్లెలై**
**గుబాళించే పల్లెబాట!**

– పి.సుబ్రహ్మణ్య మహర్షి,
గాయత్రీనగర్, నెల్లూరు

ధైర్యం చెప్పుకొని సర్దుకొని నిలబడ్డా.

తూనీగలాగ స్వర్ణ పరుగెత్తుకుంటూ వచ్చి "శాంతీ కొత్తగా చేరింది. నెర్వెస్‌గా ఫీలవుతోంది. మీ తర్వాత ఈ అమ్మాయికి బాత్‌రూమ్ ఇవ్వండి ప్లీజ్!" అని అక్కడ ఒక అమ్మాయితో చెప్పి,

"నీకు టిఫిన్ మేం తెస్తాంలే నీవు తొందరగా రా" అంటూ వచ్చినంత హడావుడిగా పరుగెత్తింది.

"హమ్మయ్య! బతికాను దేవుడా!" అనుకుంటూ గబగబా బాత్‌రూమ్‌లో కాలు పెట్టడంతో జర్రున జారింది. ఎదురుగా వస్తున్నఅమ్మాయి నన్ను పట్టుకొని "ఇక్కడ బాగా జారుతుంది. నెమ్మదిగా నడవండి" అని వెళ్లింది. ఇంటి దగ్గర అమ్మ వేన్నీళ్లు బాత్‌రూమ్‌లో పెట్టి 'స్నానం చెయ్యవే' అని పదిసార్లు చెప్పినా.. 'ఇదిగో వస్తున్నా' నంటూ అటూయిటూ తిరిగే నాకు పంపు నీళ్లు ఒంటి మీద పడగానే వణుకు వచ్చింది. మెల్లగా నీరు పడేకొద్దీ వణుకు తగ్గింది.

"టయమయింది. తొందరగా బయటకు రావాలి" అంటూ అప్పుడే తలుపులు బాదేస్తున్నారు. ఇంటి దగ్గర కనీసం అరగంటయినా స్నానం చేసేదాన్ని. ఇక్కడ అయిదు నిమిషాలకే తలుపులు బాదేస్తున్నారనుకొని హడావుడిగా బయటపడ్డా. రూమ్‌కొచ్చి చూద్దునుగదా.. అందరూ

డ్రెస్సింగ్ టేబిల్ దగ్గరే సెటిలయివున్నారు. అద్దంలో అందరి ప్రతిబింబాలు కన్పిస్తున్నాయి. ఎలాగో అయిందన్పించి పుస్తకాలు తీసుకునేంతలో "శాంతీ! నాలుగు ఇడ్లీలు, కారప్పొడి టేబిల్ మీద పెట్టా. తిను" అనేసరికి ఆకలి గుర్తొచ్చి ప్రాణం లేచొచ్చినట్టయ్యింది. ఒక ఇడ్లీ తుంచి నోట్లో పెట్టుకోగానే నోటికి అతుక్కుపోయింది. ఎలాగో తిని నాలుగు గ్లాసులు మంచి నీళ్లు తాగి బయటపడ్డా. హాస్టలు క్యాంపస్ నుండి కాలేజీలోకి అడుగుపెట్టాలంటే కనీసం ఒక కిలోమీటరు నడవాలి. అంతా పరుగెడుతున్నారు. టైమయ్యిందని, ప్రిన్సిపాల్ మెయిన్‌గేట్ దగ్గరే ఉంటుందని భయం. నేను హడావుడిగా క్లాస్‌కెళ్లేసరికి అప్పుడే ఇంగ్లీషు మేడమ్ వస్తున్నారు. 'హమ్మయ్య! ఈ రోజుకు బతికిపోయాను' అనుకున్నా! పక్కనే హాస్టల్ పెట్టుకొని, హాస్టల్ అమ్మాయిలు ఎందుకు లేటుగా వస్తారో నాకిప్పుడు తెలిసింది.

మధ్యాహ్నం డైనింగ్ హాలులోకి వెళ్ళేసరికి ఎవరో ఇద్దరమ్మాయిలకి నన్ను చూపిస్తూ ఏదో చెప్తున్న స్వర్ణ కన్పించింది. నేను రాగానే "శాంతీ..! సుధ, సుమ వీళ్ళిద్దరూ కూడా మన రూమ్మేట్స్. ఆదివారం ఊరెళ్ళారు. ఇప్పుడే వచ్చారు" అంటూ పరిచయం చేసింది.

లత, రమ రావడంతోటే "మా కేమైనా స్పెషల్స్ తెచ్చారా లేదా? లేకపోతే ఒప్పుకొనేది లేదు. మీరిద్దరూ ఆలస్యంగా వచ్చారని వార్డెన్‌తో చెప్పేస్తాం" అన్నారు ముక్త కంఠంతో.

"అమ్మా తల్లీ! మీకు తినుబండారాలు తెచ్చాం. సాయంత్రం తీరిగ్గా ఆరగిద్దురు, పదండి.. ముందు" అన్నారు వాళ్లు.

"అలా దారికి రండి" అంటూ అంతా నవ్వుకుంటూ వెళ్ళారు.

నా రూమ్మేట్స్ సాహచర్యంలో హాస్టలు జీవితానికి నెమ్మదిగా అలవాటుపడి చదువులో పడ్డా.

'ఫ్రెషర్స్ డే ఫంక్షను' అని ప్రతి సంవత్సరం జూలైలో హాస్టల్‌లో నిర్వహిస్తారట. అప్పటికి అడ్మిషన్స్ అన్నీ అయిపోతాయి కాబట్టి, కొత్తగా హాస్టలులో చేరిన అమ్మాయిలకు బెరుకు, దిగులు పోగొట్టి అందరితో కలసిమెలసి వుండేలాగ చెయ్యడానికేనట. సాయంకాలం చెట్లకు ట్యూబ్ లైట్స్, రంగురంగుల బల్బులు కట్టి 'మూన్ లైట్ డిన్నర్'లా చేస్తారట. మా హాస్టలు ఆ సందడిలో మునిగిపోయింది. మా హాస్టల్ క్యాంపస్‌లోనే కొంచెం దూరంగా లెక్చరర్సుకూ హాస్టలు వుంది. పదిమంది లెక్చరర్సుదాకా వున్నారు. వారు ఆరోజు మాకు అతిథులు. ప్రతి చెట్టుకు బల్బులను రకరకాలుగా అమర్చారు. ప్రిన్సిపాల్ ఆధ్వర్యంలో ప్రతీది ప్లాన్డ్‌గా చేశారు. నాటికలు, సంగీత విభావరి, ఫ్యాన్సీ డ్రెస్ షో, భరత నాట్యంలాంటి ప్రదర్శనలు అందరినీ ఉత్సాహ పరిచాయి. చివరి ఐటమ్‌గా సీనియర్లు కొత్తగా హాస్టల్‌కు చేరిన జూనియర్స్‌కు ఒక ప్రజెంటేషన్ ఇస్తూ 'నిక్‌నేమ్' కూడ చదువుతారు. ప్రజంటేషన్ సాధారణంగా పెన్నే అయి వుంటుంది. అందరూ నిశ్శబ్దంగా తమకు ఏం పేర్లు పెట్టి వుంటారా? అని ఆత్రుతతో ఎదురు చూస్తున్నారు. నాకైతే గుండె దడే!

ఎవ్వరితోను ఎక్కువగా మాట్లాడని అమ్మాయిని 'టచ్ మి నాట్' అని, పొడవుగా వుండే స్వర్ణకు 'మిస్ టాల్' అని, కొంచెం బొద్దుగా వుండే నిర్మలను 'మిస్ హెల్దీ బేబి' అని, ఎప్పుడూ హడావుడిగా తిరిగే లతను 'మిస్ గందరగోళం' అని, అన్నింటిలో తలదూర్చే రమను 'డిస్ట్రబెన్స్ ఆఫ్ ఇండియా' అని, నెమ్మదిగా వుండే

నన్ను 'మిస్ స్లో' అని, కనురెప్పలు వాలుస్తూ మాట్లాడే సుమకు 'డ్రీమ్ గర్ల్' అని, ఎప్పుడూ క్లాస్‌లో నిద్రపోతుండే అమ్మాయికి 'స్లీపింగ్ బ్యూటీ', ప్రతి చిన్న విషయానికి సందేహం అంటూ అడిగే అమ్మాయికి 'మిస్ సందేహం' అని పిలిచి స్టేజిమీద పెన్నులు బహూకరిస్తుంటే అందరూ స్పోర్టివ్‌గా తీసుకున్నారే కాని ఎవ్వరూ బాధపడలేదు. ఎంతో స్వేచ్ఛగా హాయిగా నవ్వుకోగలిగాం.

పాతిక సంవత్సరాలు గడచిపోయినా ఆ మధురస్మృతులు గుర్తుకొచ్చినప్పుడల్లా అనిర్వచనీయమైన ఆనందాన్ని కలిగిస్తాయి. అందుకే స్నేహం మంచి గంధం పరిమళంలాంటిది అన్నాడొకవి అనుకున్నా.

"ఏమిటి శాంతీ? న్యూస్ పేపర్ పట్టుకొని అలాగే గుమ్మంలో కూర్చుండిపోయావు. నా స్కూటర్ శబ్దం కూడ విన్పించని ఆలోచనలేమిటోయ్? " అంటూ శ్రీవారు పలకరించేసరికి నా ఆలోచనా స్రవంతి తెగి ఈ లోకంలోకి వచ్చా.

"ఎంత దారుణమో చూశారా? ఒక శ్రీకాకుళం, మరో కర్నూలు ఏదయితేనేం విద్యార్థులు ర్యాగింగ్ పేరిట ఎంత రాక్షసంగా ప్రవర్తిస్తున్నారు. స్నేహభావాన్ని పెంచాల్సిన సంస్కృతి విశృంఖలత్వాన్ని పెంచుతోంది. అదే నా బాధండీ. జీవితం మీద ఎన్నో ఆశలతో, తల్లిదండ్రుల కోర్కె తీర్చాలనే తపనతో వచ్చి ఆడపిల్లలు సమిధలై పోతున్నారు" అంటూ ఆవేదన నిండిన గొంతుతో అన్నా.

"ప్రభుత్వం చట్టం చేసి చేతులు దులుపుకుంటే సరిపోదు. అమలయ్యేటట్టు చూడాలి. కఠినశిక్షలుండాలి. కాలేజీ యాజమాన్యాలు, తల్లిదండ్రులు కఠినవైఖరి అవలంబించాలి. విద్యార్థులందరికీ కౌన్సిలింగ్ నిర్వహించాలి. పర్యవేక్షణ వుండాలి. విద్యార్థుల వైఖరిలో కూడ మార్పు రావాలి" అన్నారాయన సాలోచనగా.

"మేం చదువుకున్న కాలేజీ రోజుల్లో వినబడని ఈ పదం యిప్పుడు భూతంలా మారి విద్యార్థులు చదువు మానేలాగో ఆత్మహత్యలకు దిగేలాగో కారణమవుతోంది. నాకు నేను హాస్టల్‌లో చేరడం, నా స్నేహితుల ఆత్మీయత గుర్తుకొచ్చి అలానే పేపరు పట్టుకొని ఆ తీపి గుర్తులు గుర్తు తెచ్చుకుండిపోయా" అన్నా.

"నీవు ఆ కలల లోకంలోకి పోయావంటే నాకు, పిల్లలకు పస్తే.. పిల్లలు కూడ వచ్చే టైమయింది. మాకేమయినా టిఫిన్ పెట్టి, కాసిని టీ నీళ్లు పోస్తావా? మళ్లీ కలగంటావా? " అన్నారు నవ్వుతూ.

"మమ్మీ! నాకేమో ఫస్ట్ వచ్చింది" అంటూ అమ్మాయి కాలేజీ నుండి వచ్చింది.

"డాడీ! పొద్దస్తమానం పుస్తకాల పురుగులా చదువుతుంటే రాదా మరి? " అంటూ వెనకే వచ్చాడు సుపుత్రుడు.

"ఆc నీకు క్రికెట్ మీద వున్న శ్రద్ధ చదువు మీద వుంటే ఎందుకు రాదు? " అన్నాం తర్వాత-

"సరేలే! ఇద్దరూ బాగా చదవండి" అంటూ రాజీచేస్తూ లోపలికెళ్ళా.

"పోస్ట్, పోస్ట్" అనే కేక వినబడింది.

"ఏమోయ్! నీకే పెద్ద ఉత్తరమొచ్చింది. మీ ఫ్రెండ్స్ రాసినట్టున్నారు. మీ వాళ్లే నయం. ఎప్పుడో ఒకప్పుడు ఉత్తరాలు రాస్తుంటారు. మా వెధవాయ్‌లు కన్పిస్తే మాట్లాడటం తప్పితే ఎవ్వరికీ ఓపిక వుండదు. పోనీలే. ఈ మెయిలు, ఇంటర్‌నెట్ చిట్‌చాట్, ఎస్.ఎమ్.ఎస్.లు, ఫోన్‌లు పెరిగిపోయిన ఈ రోజుల్లో పోస్టల్ శాఖవాళ్లు గోళ్ళుగిలుకుంటుంటే వాళ్ళ వుద్యోగాలూడకుండా మీరు కాపాడుతు

న్నారు" అంటూ ఉత్తరం చేతిలో పెట్టి,

"ఈ ఉత్తరం యిప్పుడు మొదలెట్టకు. నేను పిల్లలు వెళ్ళాక తీరికగా చదువుకో" అంటూ ఉచిత సలహా యిచ్చారాయన.

★ ★ ★

మరుసటి రోజు ఆదివారం కాబట్టి నాకు సెలవే. పిల్లలు ఫ్రెండ్స్ దగ్గరకెళ్ళారు. ఆయన బజారు వెళ్ళగానే కవరు మీద అడ్రసు చూశా. స్వర్ణ దగ్గర నుండి. నా మనసు దూదిపింజెలా అయింది. ఎప్పుడెప్పుడు చదువుదామా అని? పనంతా ముగించి కవర్ తీశా.

"డియర్! శాంతీ!

నేనిప్పుడేమీ రాయలేను. త్వరలో వీలు చూసుకొని నీదగ్గరకు వస్తాను. ఈ ఉత్తరం నాకు సుజాత పోస్ట్ చేసింది. నీకు జెరాక్సు కాపీ పంపుతున్నా. చదువు. నీకే తెలుస్తుంది"

అక్షరాల వెంట కళ్ళు పరుగులు తీస్తున్నాయి. ఆ ఉత్తరంలో...

"ఛీ! దరిద్రపు గొట్టు మొహమా? నీకెన్నిసార్లు చెప్పాను. ఒక లక్ష రూపాయలు మీనాన్ననడిగి తీసుకురా! బిజినెస్‌కు కావాలి" అన్నాడు భర్త.

"మా అమ్మకు కేన్సరు అని చెప్పారు. మా నాన్న అమ్మ ఆపరేషను కోసం ఆ డబ్బు వుంచారండి. మా అమ్మను చూసి వెంటనే వచ్చేస్తాను" అన్నాను బతిమలాడే ధోరణిలో.

"అయితే ఉత్తరం రాసి డబ్బు తెప్పించు. అప్పుడు పంపిస్తా" అన్నారు.

"హవ్వ! చెబితే ఎవ్వరయినా నవ్విపోతారు. వాడు యిబ్బందుల్లో వుండి డబ్బు అడిగాడే అనుకో. ఆ మాత్రం సర్దలేని మామ ఎందుకు? మీ అబ్బకు వత్తాసుగా మాట్లాడటానికి సిగ్గులేదూ! పిల్లా పీచు లేదు. వెధవ మొహం నువ్వూనూ" అంటూ అత్తగారు రంగప్రవేశం చేసింది.

అమ్మను చూసేసరికి ఎక్కడలేని ఉత్సాహం వచ్చిందేమో "మధ్యాన్నం నేనొచ్చేసరికి వుత్తరం రాసి పెట్టు. నే చూసి పోస్ట్‌లో వేస్తా"నంటూ బయటికెళ్ళిపోయారాయన.

ఇంత గలభా జరుగుతుంటే తను నిమిత్తమాత్రుడినన్నట్టు మామగారు పేపరులో లీనమయ్యారు.

తలుపు చప్పుడయితే గబగబ వెళ్ళి తలుపు తీశా.

"ఇప్పుడేనా నాన్న రావడం? " అని నేను పలకరించడం, ఆయన లోపల అడుగు పెట్టడం ఒక్కసారే జరిగింది. హాలులో వాళ్ళు బొమ్మల్లా చూస్తున్నారేకాని మర్యాదకు కూడ పలకరించలేదు. ఆయనే సోఫాలో కూర్చుంటూ "బావున్నారా అక్కయ్యగారూ? " అన్నారు.

"ఆ! మా బాగెవరికి కావాలి? నాకు బీపీ, షుగరు. ఏదో ఇలా లాక్కొస్తున్నా. పిచ్చి సన్నాసి. డబ్బు సర్దు బాటుకాక తిరుగుతున్నాడు" అంటూ చెప్పిందావిడ.

"బావగారూ! ఏమిటి విశేషాలు? " అంటూ మామగారిని పలకరిస్తే,

"ఆ.. ఏముంటాయి? " అన్నారు ఆయన ముభావంగా.

"అమ్మా! వాళ్లమ్మ అమ్మాయిని చూసి మూడేళ్ళయింది. కలవరిస్తున్నది. తీసుకెళ్ళి నాలుగు రోజులుంచుకొని పంపుతాను" అన్నారు. పండ్లు, పూలు, స్వీటు ప్యాకెట్టు అత్తగారి చేతిలో పెట్టి.

"ఇదో మావాడికి డబ్బు చాలా అవసరం. డబ్బు సర్దందే పంపే ప్రశ్నలేదు. మేము మంచివాళ్లం కాబట్టి గొడ్రాలయినా అట్టిపెట్టుకున్నాం. అదే మరొకరయితేనా రెండోపెళ్ళి చేసేవాళ్లు" అందావిడ.

"మా అమ్మాయికి అన్ని పరీక్షలు పెద్దాసుపత్రిలో చేయించాం కదండీ. ఏమీ లోపం లేదన్నారు. అబ్బాయిని కూడా

పిలుచుకొస్తే లోపమెక్కడుందో చెప్తామన్నారు. మీరే కదా పంపనిది? " అన్నారు నాన్న.

దాంతో ఆమె కోపం నసాళానికి అంటింది. "మా అబ్బాయి మగమహారాజండి. వాడికేం ఖర్మ.. పరీక్షలు చేయించుకోవడానికి? వాడికింకో పెళ్ళి చేస్తాను చూస్తుండండి. నాకు మనసులో ఒకటి, పైకి ఒకటి మాట్లాడం తెలీదు. మీరు ఈ నెలలో రిటైరు అవుతున్నారట. కాన్సరు పేషంటు మీద దమ్మిడీ పెట్టినా దండగే నని మా డాక్టరు చెప్తుంటే విన్నా. ఎందుకు ఆపరేషను? చేతికొచ్చిన డబ్బు తగలెయ్యడం. నాకు తోచిందేదో చెప్పాను. నీ కూతురి కాపురం నిలబెట్టడం నీదే బాధ్యత! లేకపోతే నీవే చేతులారా చెడగొట్టిన వాడివవుతావు!" అంటూ తర్జనితో బెదిరిస్తూ మరీ చెప్పింది.

"ముంగిలా అలా గోడకతుక్కుని నిలబడకపోతే వాడు ఏం చెప్పాడో మీ నాన్నకు చెప్పరాదూ! నోటి ముత్యాలు రాలుతాయా!" అంటూ నావైపు తిరిగి హూంకరించినట్లే మాట్లాడింది.

"అమ్మను గురించి నీవు దిగులు పడవద్దమ్మా. భగవంతుడిమీద భారం వేద్దాం. కానున్నది కాకమానదు. పదిరోజుల్లో నేను వచ్చి డబ్బు ఇచ్చి నిన్ను తీసుకెళ్తా" అంటూ నాన్న చెప్పగానే అంతవరకు అదిమి పెట్టుకున్న దుఃఖం ఒక్కసారిగా కట్టలు తెంచుకొంది.

"ఏం? ఎవరు చచ్చారని నట్టింట్లో అలా ఏడుస్తున్నావు? అబ్బో! అబ్బా, కూతురు సంబడం తెలుస్తూనే వుంది. వొట్టివొట్టి ప్రేమలు దేనికి? " అంటూ మెటికలు విరిచింది అత్తగారు.

నాన్న క్షణం కూడ ఉండలేక వెళ్ళిపోయారు. రోజురోజుకు సాధింపులు ఎక్కువవుతున్నాయి. సాయంత్రంపూట స్నానం చేసి ఉతికిన చీర కట్టుకొని కొంచెం శుభ్రంగా తయారైతే "ఏమిటేవ్? సానిదానిలా తయారయ్యావ్, ఈ వెధవ్వేషాలు మా ఇంటా వంటా లేవు. మీ అబ్బ ఇచ్చిన స్కూటరు మీద షికారు పోదామనా? " అనేది అత్తగారు.

పోనీ అలా అన్నది కదా అని మరుసటిరోజు మామూలుగా వుంటే "ఏడ్రాసి మొహమేసుకొని కూర్చోకపోతే వాడొచ్చేసరికి శుభ్రంగా వుండకూడదూ? అందుకు కదూ వాడు వేళకు ఇంటికి రాకుండా తిరగడం? ఎవరన్నా చూస్తే మేం నిన్ను రాచి రంపాన పెడుతున్నామని అనుకోవాలనే గదా! ఏం బోడి తెలివి నీది? " అనేది.

ఆయన ఉలకడు-పలకడు. ఇన్ని రోజుల సంసారంలో కూడ "ఏయ్ కాఫీతే! సిగరెట్టుతే! నీళ్ళు పెట్టు!" ఇలా ఆజ్ఞలు జారీ చెయ్యడమే కాని ఒక్కరోజన్నా ఆప్యాయంగా పిలవడంకాని, సినిమాలకు, షికార్లకు తీసుకువెళ్ళింది కానీ లేదు. అవసరాలు తీర్చుకోవడానికి స్త్రీ కావాలి కాని ఆమెకు మనసుంటుందని, కోరికలుంటాయని వాళ్ళకక్కరలేదు. విసిగి ఒకసారి పోలీసుస్టేషనులో చెప్పా. వాళ్లతో లాలూచీ పడినట్లున్నారు. అప్పటినుండి ఇంకా చిత్రహింసలు ఎక్కువయ్యాయి. అమ్మానాన్నలను ఈ వయసులో ఇబ్బంది పెట్టలేక, వారికి భారం కాలేక, ఈ రొంపిలోనుండి బయటపడలేక చూస్తున్నా. ఏ చిన్న గడ్డిపోచ ఆధారం చిక్కినా నేను స్వేచ్ఛావాయువులు పీలుద్దామని చూస్తున్నా. ఈ నరకంలో ఉండలేను. పులిమీద పుట్రలా మా ఆడపడుచు, ఆమె భర్త దిగారు. ఏదో ప్లానుతో వచ్చినట్టున్నారు. ఒక్కగానొక్క కూతురని అత్తగారికి ఆమె అంటే పంచ ప్రాణాలు. అందరి కూతుర్లూ తన కూతురిలాంటివారేనని అనుకోదు. వాళ్ళిద్దరూ కలిస్తే అగ్నికి ఆజ్యం

తోడయినట్టే. కొడుకు ఎటూ డూ...డూ బసవన్న కాబట్టి ఆమె ఆడిందే ఆట, పాడిందే పాట. నాకు వీళ్ల రాక చూస్తుంటే ఏదో గూడుపుఠాణితో వచ్చారనిపించింది. వీళ్ళని తప్పించుకొని నాన్న దగ్గరకు వెళ్దామంటే పెళ్ళికావలసిన చెల్లెలుంది. మొగుణ్ణి వదిలేసిన దాన్నని దానికి పెండ్లి సంబంధాలు రావు. పోనీ ఆత్మహత్య చేసుకుందామంటే 'ఎందుకు చావాలి?' ఎదురు తిరుగుదామనిపిస్తుంది.

ఒక్కనిముషం కూర్చున్నా "నీ అబ్బ పంపిన పనోళ్ళున్నారనా? మహారాణిలా విశ్రాంతి తీసుకుంటున్నావ్?" అంటుంది. పెళ్ళై ఇరవై ఏళ్లయినా పిల్లలు లేని ఆడపడుచుదేమి తప్పులేదంటుంది. అల్లుడే వెధవ అని తిడుతుంది. వాళ్ళు రాల్చే ఎంగిలి మెతుకులకు ఆశపడి వాడు సంవత్సరంలో ముప్పాతిక రోజులు మా ఆడపడుచును యిక్కడే వదిలి ఆమెకోసం వచ్చినట్టు వచ్చి తిష్ట వేస్తాడు. వాడి చూపులు ఆకలి గొన్న పులిలా వళ్ళంతా తడిమినట్టుంటాయి. ఉండబట్టలేక ఒకరోజు ఆయనతో చెప్పా. "అబ్బో! ఇంతోటి అందగత్తె ఎక్కడా కన్పించలేదు కాబోలు. అయినా నాకు తెలీకడుగుతాను వాడివైపు చూడనిది వాడు నీ వైపు చూస్తున్నాడని ఎలా తెలిసింది" అంటూ లాజిక్‌గా ప్రశ్నించానని తన తెలివికి తనే మురిసిపోయాడు. తర్వాత "సిగ్గులేక పోతేసరి. వాళ్లు రావడం నీకిష్టం లేదు. పని ఎక్కువయ్యిందని ఏడుపు. కొంపకొస్తే ఏడ్పు మొహంతో దర్శనమిస్తావు. ఛీ... ఒక సుఖమూ పాడు లేదు. పైగా చాడీలు కూడానా? మా అమ్మకు చెప్పానంటే వీపు చీరేస్తుంది. జాగ్రత్త? ఇంతకూ నీ ప్రయాణమెప్పుడు? మా బావకు కూడ ఒక లక్ష కావాలట. పత్రా. మళ్ళా తీరుస్తాంలే. నీ అబ్బ సొమ్ము తేరగా తీసుకుంటున్నామని

## కొత్తగాలి...

**భద్రంగా ఉన్నాయి**
**బజార్లో**
**శ్రీవారి నగలు**

-పి.వి.ఎన్. ప్రసాద్,
నవులూరు

ఫీల్ అవ్వకు" అంటూ హాలులోకి వచ్చాడు. పెళ్లయినప్పటి నుంచీ ఇప్పటికి ఎంతిచ్చానో లెక్కలేదు. కాని ఒక్కసారి కూడ తీర్చలేదు. పైగా "అల్లుడికి ఆ మాత్రం ఇయ్యకూడదా? ఏమి?" అంటూ తల్లీకొడుకుల ప్రశ్నలు.

"ఒరే! ఆ మొద్దుకు అలా చెబితే వినదురా! దాని పెట్టె బైట పడేసి చార్జీకి డబ్బులిచ్చి పంపరా? ఎవడికోసం తెస్తుంది?" అంటూ అత్త హుకుం జారీచేసింది.

"ఒరే అన్నయ్యా! చేతుల గాజులు, మెళ్లో గొలుసు అన్నీ తీసుకొని పంపించరా! ఇది అసలే ముంగి. వాళ్లు ఏదన్నా అవసరానికి వాడుకున్నా వాడుకుంటారు. దీనికి అసలే పుట్టింటి వారిమీద వల్లమాలిన ప్రేమ" అంది ఆడపడుచు. సూట్‌కేస్‌తో పాటు యాభైరూపాయల కాగితం చేతిలో పెట్టి "ఇక దయచెయ్యి" అన్నారు. నేను అయోమయం నుండి తేరుకునే లోపల బజారు నుండి వచ్చిన ఆడపడుచు భర్త అందరినీ లోపలికి పిలిచి ఏదో చెప్పాడు.

నా దగ్గరకు వచ్చి "చూడమ్మాయి! వాళ్ళు చెప్పినట్టు విను, నీ సంసారం బాగుపడాలని కోరిక లేదా?" అన్నాడు. నేనేదో ఆయనను ఆపద్బాంధవుడిగా భావించి "అన్నయ్యా! మీరయినా వాళ్లకు నచ్చచెప్పండి" అన్నా. ఆ పిలుపుకు ఆముదం

తాగినట్టు మొహంపెట్టి "సరేలే! లోపలకె ళ్ళు తర్వాత మాట్లాడుకుందాం" అన్నారు. నాలుగు రోజులు యిల్లంతా నిశ్శబ్దంగా వుంది. ఆ నిశ్శబ్దం దేనికో అని నాకు భయంగా వుంది. అయితే ఈసారి ఏమైనా కాని వీరి విందు, విలాసాలకు నేను డబ్బు తేనుగాక తేను అని గట్టిగా చెప్పాలని నిర్ణయించుకున్నా.

"నేను క్యాంపుకెళ్ళాలి. రెండు రోజుల దాక రాను" అని గోడకు చెప్పినట్టు చెప్పి వెళ్ళారాయన. బెడ్‌రూములో పడుకొని నవల చదువుతున్నా.

"ఏమేవ్! తలుపు తియ్యి! ఎవరో వచ్చారు" అనే అత్తగారి కేకకు వాకిట్లోకి రాగానే ఆయన ఎప్పుడొచ్చాడోగానీ నలుగురూ కలిసి నిలేసి "డబ్బు ఎప్పుడు తెస్తావ్? " అన్నారు కర్కశంగా.

"మా అమ్మ ఆపరేషన్ కోసం మా నాన్న డబ్బు తీసుకుంటున్నారు. మీ కోసం కాదు" అన్నా ధైర్యంగా.

"రెండు నెల్లాగి చచ్చే ఆమె.. ఇప్పుడే చస్తుంది. అంతేగా" అన్నాడు ఆడపడుచు మొగుడు.

"మీకు మానవత్వం లేదు. మీ బాబు సొమ్మేం కాదు. తెచ్చివ్వడానికి" అన్నా తెగింపుగా.

నేనలా మాట్లాడతానని వూహించని మా అత్త "ఏం కూశావే? ఇంటల్లుడిని అంత మాటంటావా? నీకెంత కండకావరమే? నీవు నెమ్మదిగా చెబితే వినవూ!" అంటూ హఠాత్తుగా నా రెండు చేతులు పట్టుకొని బరబరా బాత్‌రూమ్‌వైపు లాక్కెళ్ళింది. ఈ లోపలే! మా ఆడపడుచు కిరోసిన్ కుమ్మరించి మొగుడివైపు చూసింది. వీరి ఆలోచన గ్రహించిన నేను కాలితో ఒక్క తన్ను తన్నగానే వూహించని దెబ్బకు మా అత్త దబ్బున పడింది. "చచ్చాన్రా బాబోయ్! దీనమ్మ కడుపు కాలా! దీని కాష్టం కాల్చ!" అంటూ శాపనార్థాలు పెడుతూ, బైటకు రాబోయేంతలో ఆడపడుచు మొగుడు అందిన చోట్లల్లా పట్టుకొని, ఎత్తుకొని తెచ్చాడు. ఇంత జరుగుతున్నా మామగారు పేపరులో తలదూర్చే వున్నాడు. ఇదంతా వీళ్ళ ముందే పన్నాగం పన్నారులావుంది. ఆయన సర్వలక్షణ సంపన్నుడని తెలిసినా అంతకు ముందు ఏమూలో ఆయన మీద వున్న ప్రేమ ఆ క్షణంలో జుగుప్సగా మారింది.

"ఇది శాంపిల్ మాత్రమే. నీవు చస్తే మాకు చాలా లాభమే. ఒక్కగానొక్కకూతురు. బోలెడు ఆస్తీవున్న అమ్మాయి వుంది. పిల్ల బంగారు బొమ్మ. కాని చిన్నతనంలోనే పోలియోవల్ల కాళ్ళు చచ్చుబడి చక్రాల కుర్చీలో వుంది. అందుకే విడాకుల కాగితం మీద సంతకం పెట్టు" అంటూ ఆయన కాగితాలు తెచ్చారు.

"ఏ కారణాలతో విడాకులడుగుతున్నారు? " అన్నా.

"నీకు పిల్లలు పుట్టలేదు. గొడ్రాలువి కాబట్టి" అన్నారు.

"నా టెస్టు రిపోర్టులన్నీ నా దగ్గరే వున్నాయి. నాలో ఏ లోపం లేదని వుంది. మీరు టెస్టు చేయించుకోలేదు కదా? నేను కోర్టులో ఆ మాటే అడుగుతా" అన్నా తెగింపుగా.

"ఒరే! ఈ పిశాచి యిట్లా లొంగదురా" అంది అత్త మూలుగుతూనే. "ఇగో! పోనీ! వాడితో నీకు పిల్లలు పుట్టలేదు కదా! నాతో వుండకూడదూ! నే బాగాలేనా? " అంటూ పండ్లికిలించాడు ఆడబడుచు భర్త. అదో జోకులా అంతా పెద్దగా నవ్వారు. ప్రాణం తీయడానికైనా వెనకాడేటట్లు లేరని, ముందు జాగ్రత్తగ పోలీసులతో లాలూచీపడి వుంటారని అర్థమైంది. ఇక ఆరోజు అంతా సర్దుకున్నారు.

ఇస్త్రీ బట్టలు తెచ్చే పిల్లవాడు పేపరు

చుట్టి బట్టలు తెచ్చాడు. ఆ పేపరు మీద నీ ఫొటో చూశా. ఎంత ఆశ్చర్యపోయానో అంత ఆనందపడ్డాను. నా పాలిట దేవతలా అన్పించావు. మా వూరికి యస్.పి.గా వచ్చావని, చాలా స్ట్రిక్టు ఆఫీసరని నీకు మంచి పేరు వుందని అందులో పొగుడుతూ రాశారు. నీ చిరకాల ఆశయాన్ని నెరవేర్చుకొని ఐ.పి.యస్ ఆఫీసరు అయినందుకు, మన స్నేహితులలో ఒకరు గొప్ప పదవిలో వున్నందుకు భగవంతుడికి కృతజ్ఞతలు తెలిపా. నోట్లో నాలుక లేనిదానివి ఎలా బతుకుతావే అనేవాళ్లు మీరు. అవన్నీ గుర్తుకొచ్చి ఎంత ఏడుపొస్తుందో. హాస్టలులో ఎన్ని కలలు కన్నా? "ఆశలు వుంటాయి అందరికీ, అవి నెరవేరేవి కొందరికి" అనే పాట గుర్తుకొస్తుంది. నీవు ఈ రాక్షసుల బారినుండి తప్పిస్తానని గంపెడంత ఆశతో ఎదురు చూస్తున్నా. ఎవ్వరూ చూడకుండా అప్పుడప్పుడు కొంచెం రాసి పక్కింటి పిల్లవాడి చేత పోస్ట్ చేయిస్తున్నా. ఎప్పుడేమి జరుగుతుందో చెప్పలేను.

మీ సుజాత

ఉత్తరం చదివావు గదూ శాంతీ! మినిస్టరు వస్తున్నాడని బందోబస్తు ఏర్పాటు చెయ్యమని ఆర్డరు వచ్చింది. చదువుకుందామని డెస్కులో పెట్టి ఊరెళ్ళా. వచ్చీరాగానే పేరుమోసిన రౌడీషీటరు హత్య అంటూ ఫోను... పోస్ట్‌మార్టమ్ చేయించి, శవాన్ని బంధువులకు అప్పగించి, జనాలను అదుపు చేసేసరికి నాలుగు రోజులు గడిచిపోయాయి. అప్పుడే ఉత్తరం గుర్తుకొచ్చి పూర్తిగా చదివా. ఉత్తరం తీసి జేబులో పెట్టుకొని అడ్రసు ప్రకారం సుజాత వాళ్ల యింటికి వెళ్దామని జీపు రెడీ చెయ్యమన్నా. ఇంతలో ఫోన్ మోగింది.

"మేడమ్! బర్నింగ్ కేస్. హాస్పిటలులో అడ్మిట్ చేశారు. పరిస్థితి సీరియస్‌గా వుంది. ఆమె మీ పేరు చెప్పి మీతోనే మాట్లాడాలంటున్నారు" అంటూ టూ టౌన్ ఇన్‌స్పెక్టరు ఫోన్ చేశాడు. క్షణం ఆలస్యం చెయ్యకుండా దడదడలాడుతున్న గుండెలతో బయలుదేరా. బర్నింగ్ వార్డులో ప్రవేశిస్తుంటే మాంసం కాలిన వాసన, వెంట్రుకలు కాలితే వచ్చే కమురు కంపు ఆ ప్రదేశమంతా వ్యాపించింది. ఒళ్ళంతా బ్యాండేజీలతో గుర్తుపట్టే స్థితిలో లేదు. ముఖం ఎక్కువగా కాలలేదు. శ్వాస చాలా భారంగా వుంది.

"వాళ్ళ వాళ్ళేరి? " అన్నా యస్.ఐ.తో

"ఆ అమ్మాయి అరుపులు విని పక్కింటి వాళ్ళు తెచ్చి చేర్చారట. ఆ అమ్మాయి భర్త అత్త, మామ, ఆడపడుచు, ఆమె భర్త పారిపోతోంటే వీధిలో వాళ్ళంతా కలిసి పట్టు

## అప్పట్లో ఇంకా బాగుండేది!

సుప్రసిద్ధ ఐరిష్ రచయిత ఆస్కార్‌వైల్డ్ హాస్య సంభాషణలకు పెట్టింది పేరు. వివిధ సందర్భాల్లో ఆయన చెప్పిన చతురోక్తులు కొన్ని..



అమెరికా అంతర్యుద్ధ ప్రాముఖ్యం వైల్డ్‌కు బాగా తెలుసు. అతడు తన అమెరికా పర్యటనలో బానిసత్వ రద్దుకు వ్యతిరేకంగా నిలిచిన కాన్ఫెడరసీకి పుట్టినిల్లైన చార్ల్స్‌టన్‌ను సందర్శించాడు. భోజనం తర్వాత వెన్నెల రాత్రిని ఆస్వాదించేందుకు ఓడరేవుకు వెళ్లాడు. మరో స్థానికుడు కూడా అతడితో ఉన్నాడు. అతడితో మాట కలపాలని ఆకాశానికేసి చూస్తూ వైల్డ్, 'ఈరాత్రి చంద్రుడు ఎంత అందంగా ఉన్నాడో కదూ? ' అన్నాడు.

దానికావ్యక్తి కాస్సేపు మౌనందాల్చి, తర్వాత నిట్టూరుస్తూ 'ఇప్పుడేమి అందం? అంతర్యుద్ధానికి ముందు చంద్రుడిని చూసివుండింటే ఇంకా ఎంత మెచ్చుకునిండేవాడివో' అన్నాడు.

ఎంతోమంది నోర్మూయించిన ఆస్కార్‌వైల్డ్ అంతటివాడే ఆ మాటలకు నిశ్చేష్టుడయ్యాడు.

కొని మాకు ఫోన్ చేశారు. మన వాళ్ళను వాళ్లకు కాపలా పెట్టి, మీకు ఫోన్ చేశానమ్మా" అన్నాడు ఆ అమ్మాయి ముఖం పక్కకు తిప్పి ఆ 'పుట్టుమచ్చ' చూసేసరికి ఒక్కసారి షాక్‌కు లోనయ్యా.

"సుజీ! సుజీ!" అని నాకు తెలియకుండానే అరిచా. నా అరుపులకేమో వాలిపోతున్న కనురెప్పలనెత్తి జీవంలేని నవ్వుతో ముద్దమాటలతో "వాళ్లు తగులబెట్టారు" అని ఆగి ఆగి చెప్పింది. నేను టోపితీసి పక్కన పెట్టి, దుఃఖాన్ని కంట్రోల్ చేసుకునే ప్రయత్నంలో వుండగానే డాక్టరు వచ్చి చూసి, నర్సును తెల్లదుప్పటి కప్పేయమన్నారు.

ఆ స్థితిలో సుజాతను చూడలేక, నేనీ వూళ్ళో వుండి కూడా రక్షించలేకపోయాననే బాధతో వున్నా, వెంటనే సర్దుకొని స్టేషను కెళ్ళి వాళ్ళ అత్తమామలను అందరిని కలుసుకున్నా.

"కిరోసిన్ స్టవ్ అంటించబోతే మంటలు అంటుకొన్నాయి. మమ్మల్ని అనవసరంగా స్టేషను తీసుకువచ్చారు. పరువు నష్టం దావా వేస్తాం మీ మీద" అంది అత్త.

"మమ్మల్ని మా లాయరుతో కూడా మాట్లాడనీకుండ ఏ రూల్ ప్రకారం యిక్కడ వుంచారు?" అంది ఆడపడుచు.

"ఏవమ్మా! నీకు తెలీదు. ఆ ఇన్‌స్పెక్టర్ని పిలిపించండి. మేము మాట్లాడుతాం" అన్నాడు సుజాత భర్త.

వాళ్ల మాటలు అన్నీ విని నేను మాట్లాడకుండా బయటకు వచ్చి "వాళ్లను సెల్‌లో పడేసి పోలీస్ ట్రీట్‌మెంట్ ఇవ్వండి. నిజాలవే వస్తాయి. నా దగ్గర ఆధారాలు అన్నీ వున్నాయి. డు ఇట్. ఇరుగు పొరుగు వాళ్ల స్టేట్‌మెంట్ తీసుకొని కేస్ ఫైలు చెయ్యండి" అని ఇన్‌స్పెక్టరుకి చెప్పి వచ్చేశా.

ఓ మహిళా నాయకురాలు "మేడమ్! మహిళ యస్.పి.గా వచ్చారు. మా సమస్యలు అర్థం చేసుకుంటారని ఆశగా వున్నాం. మీరు 'పిశాచాలకు' శిక్షపడేలా చూస్తామని చెప్పేదాక మేము యిక్కడి నుండి కదలం" అంది.

పత్రికా రిపోర్టర్లు కూడా వచ్చి చేరారు. వాళ్ళందరినీ శాంతింపచేసి "నేను తప్పక వాళ్లకు శిక్షపడేలా చేస్తాను. ఆడపిల్లల తల్లిదండ్రులు కూడ పెండ్లి చేయగానే బాధ్యత అయిపోయిందనుకోకుండా, వారికి మనోధైర్యాన్ని ఇవ్వాలి. అంతేకాదు, పరిస్థితులు బాగా లేనపుడు కూడా చావైనా బతుకైనా అత్తింటిలోనే అనే ధోరణి పోవాలి. మహిళలు పెళ్ళికాగానే ఎంత చదువుకున్నా కూడా ఇంటికి పరిమితమవుతున్నారు. వారికి నచ్చిన రంగంలో తమదైన శైలిలో రాణించడానికి ప్రయత్నించినపుడు ఆర్థిక స్వావలంబన ఏర్పడుతుంది. ఆత్మవిశ్వాసంతో సమస్యా పరిష్కారం చేసుకోగలరు. ప్రతి స్త్రీ పరిస్థితులతో ధైర్యంగా పోరాడగలగాలి. రాజీ అన్నివేళలా మంచిది కాదు" అని చెప్పి జీపెక్కా.

ఇంటికి వచ్చానే కాని చాలా అశాంతిగా ఉంది. ఆత్మీయురాలిని పోగొట్టుకొన్నాననే బాధ నన్ను తొలిచివేస్తోంది. అందుకే నీకు 'సుజా' ఉత్తరంతో బాటు నా బాధ కూడా వెళ్ళగక్కా, కొంత రిలీఫ్‌గా వుంటుందేమోనని.

స్వర్ణ

కళ్లనీరు తుడుచుకుంటూ ఆ ఉత్తరం పట్టుకొని అలానే వుండి పోయా చాలా సేపు.

"ఏమిటి శాంతీ! తలుపులన్నీ బార్లా తీసి పెట్టి అలా కూర్చుండి పోయావ్?" అంటూ శ్రీవారు పలకరించేసరికి ఒక్కసారి ఆయన్ను అల్లుకొని విషయం చెప్పి తనివితీరా ఏడ్చా.

"నువ్వు కాస్త ముఖం కడుక్కొని కాఫీ,

బిస్కట్లు తీసుకురా! కొంచెం రిలాక్సింగ్‌గా ఉంటుంది. ఈ లోపల పిల్లలు వస్తారు" అన్నారు శ్రీవారు.

కాఫీ తాగాక కుర్చీలో వెనక్కువాలి "శాంతీ! తల్లిండ్రులలో కూడ మార్పు రావాలి. ప్రతివారు ఇంజనీరు, డాక్టరు కావాలి అంటూ అప్పులు తెచ్చి తాహతుకు మించి కట్నకానుకలిచ్చి, పెళ్ళి చేసి అంతటితో అయిపోయిందనుకుంటారు. కాని అసలు కథ అప్పుడే మొదలవుతుంది. కట్నం రేటుకు తగ్గట్టు లాంఛనాలు అంటూ గుంజాలని చూస్తారు. అవి యివ్వలేక పోవడంతో ఆడపిల్ల సమిధగా మారుతోంది" అన్నారు.

"ఎంతైనా మీరూ మగవారే కదా! అందుకే అలా మాట్లాడుతున్నారు. సంతలో పశువులను బేరం పెట్టినట్టు పెట్టడమేగాక యింకా గొంతెమ్మ కోర్కెలు కూడానా? శిక్షలు కఠినంగా వుంటేనే ఈ వరకట్న భూతానికి అబలలు బలికాకుండా వుంటారు" అన్నా.

"ప్రతి ఆడపిల్ల విద్యావంతురాలై స్వయం ఉపాధితో రాణిస్తే ధైర్యంగా పరిస్థితులను ఎదుర్కోగలదు. అందుకే సర్వేపల్లి రాధాకృష్ణన్ ఒక స్త్రీ విద్యావంతురాలైతే ఆ కుటుంబంవారంతా విద్యావంతుల వుతారన్నారు" చెప్పారాయన కూల్‌గా.

"మీ మగ మహారాజులేగా. ఆడవాళ్ళు మాకు పోటీగా వస్తున్నారు. ఇంట్లో అంట్లు తోముకోక దేనికి ఉద్యోగాలు అంటున్నారు కదా! మరల ఉద్యోగం చేసే అమ్మాయే కావాలని పేచీలు పెడ్తుంటారు. మీలో కూడ మార్పు రావాలి. తప్పంతా మాదే నన్నట్టు మాట్లాడతారే? " అన్నా.

"ఈ రోజుల్లో హాయిగా బతకాలంటే ఉద్యోగం చెయ్యడం తప్పనిసరి పరిస్థితి. ఇద్దరూ సర్దుకుపోవాలి. బడ్జెట్‌ను యిద్దరు కలిసి చర్చించుకోవాలి. అప్పుడే సంసారం సాఫీగా వుంటుంది. భార్యా భర్తల వ్యవహారంలో మూడో మనిషి జోక్యం వుండకూడదు" అన్నారు నన్ను అనునయిస్తూ.

పిల్లలు స్కూలు నుండి రావడంతో మా చర్చ ముగిసింది. వెంటనే వారి పరీక్షలు, ఆ హడావుడిలో పడి ఈ బాధ మరుగున పడిపోయింది. పిల్లలకు సెలవులిచ్చారు. ఎక్కడికైనా వెళ్దామని ఆలోచిస్తున్నంతలో స్వర్ణ నాలుగు రోజులు సెలవు పెట్టి వస్తున్నానంటూ ఫోన్ చేసింది. బోలెడు సంతోషంతో ఎదురుచూస్తున్నా.




"**హా**య్! శాంతీ! నువ్వేమీ మారలేదే? " అంటూ పిల్లలకు స్వీటు ప్యాకెట్లు, మా యిద్దరికి బట్టలు తీసుకుని ఇంట్లో కాలు పెట్టింది స్వర్ణ.

"ఎందుకే? ఇవన్నీ. నీ రాకే మాకెంతో సంతోషం" అన్నా.

"నీ పెళ్లికి రాలేకపోయా. మీ వారిని పిల్లలను కూడ కలుసుకోవడం యిదే మొదటిసారి కదా! ఏదో నా సంతోషం కోసంలే" అంది.

"మీ ఫ్రెండ్ వచ్చేసరికి నన్ను, పిల్లలను మరిచిపోయేటట్టున్నావ్! ఎంతైనా పోలీసు ఆఫీసరు కదా! భయభక్తులతో మెలగాలేమో? లేకపోతే ఏదో ఒక పేరు చెప్పి లాకప్పులో తోయిస్తుందేమో? " అంటూ శ్రీవారు భయం అభినయిస్తూ మాటలు

కలిపారు.

"మీరు చాలా మంచివారని మా శాంతి సర్టిఫికేట్ యిచ్చింది. డోంట్ వర్రీ" అంది స్వర్ణ నవ్వుతూ.

అందరం దగ్గరలోని సముద్ర తీరానికి పిక్నిక్‌కి వెళ్ళాం. ఉదయమంతా సముద్రంలో స్నానం చెయ్యడం, ఫోటోలు తీసుకోవడం, ఆల్చిప్పలు ఏరుకోవడంతో సరిపోయింది. సరుగుడు చెట్ల నీడలో చాప పరుచుకొని భోజనం ముగించగానే ఆయన, పిల్లలు చెస్‌లో లీనమయ్యారు.

ఎంతో ప్రశాంతంగా ఉన్న ఆ వాతావరణంలో మేమిద్దరం కబుర్లలో పడ్డాం.

"స్వర్ణా! నీ ఉద్యోగానుభవాలు చెప్పవే? " అన్నా.

స్వర్ణ చెప్పడం మొదలు పెట్టింది.

"నేను జాయినయిన ఊళ్లో క్వార్టర్సు లేవు. మా ఆఫీసు వాళ్లకు మంచి ఇల్లు చూడమని చెప్పా. సాయంకాలం కొంచెం ఫ్రెష్ అప్ అయినట్టు వుంటుందని, వూరు చూసినట్టవుతుందని సివిల్ డ్రస్‌లో ఒక్కదాన్నే నెమ్మదిగా నడుస్తున్నా. సాయంకాలం కావడం వల్ల, ఆ వూరికి అదే మెయిన్‌బజార్ కావడం వల్ల రద్దీగా వుంది. నేను క్రీగంట గమనిస్తున్నా. నన్ను నలుగురు యువకులు అనుసరిస్తున్నారు. హిప్పీ క్రాపుతో ఒకడు, పాన్ పరాగ్ నములుతూ, కళ్ళు జోకులేస్తూ మరొకడు, చైన్ స్మోకరొకడు, చెవిపోగుతో నున్నవాడొకడు నా వెనుకే చేరి కామెంటరీ మొదలు పెట్టారు.

"అబ్బ! ఏం ఫిగరురా! అదిరింది" అని ఒకడు.

"ఆహా! ఆ నడక చూడు! హైసా!" అని మరొకడు అనడం మిగతా యిద్దరూ పగలబడి నవ్వడం... వాళ్లు నన్ను తాకాలని తెగ ప్రయత్నిస్తున్నారు.

"ఉమెన్స్ కాలేజీ దగ్గర రౌడీ గ్రూపు చేరి అమ్మాయిలను అల్లరి పెడుతున్నారనే రిపోర్టు మీద నేను డ్యూటీలో చేరగానే మొదటి సంతకం పెట్టా. వీళ్లంతా ఆ గ్యాంగ్‌లోని వారేనన్పించింది.

"కొత్త పిట్టలా వుంది గురూ! భలే రంజుగుంది" అన్నాడొకడు.

"సింప్లిసిటీ ఈజ్ ది మదర్ ఆఫ్ బ్యూటీరా. అందుకే అలంకరణ చేసుకోలేదు" అంటూ ఒకడు దగ్గరగా వచ్చాడు. నా పమిటలాగాలని ప్రయత్నించేసరికి వాడి చేతిని ఒక చేత్తో వెనక్కి విరిచిపెట్టి పమిటకొంగు నడుము చుట్టూ దోపుకొని లాగి ఒక్కటిచ్చా. కండ్లు బైర్లు కమ్మాయేమో "అమ్మా!" అంటూ అరిచాడు.

"రాక్షసీ! మా వాడిని ఎంత దెబ్బ గొట్టావే!" అని మరొకడు దగ్గరకు రాబోయేంతలో పిడికిలి బిగించి డొక్కలో ఒక్కటిచ్చా. మిగిలిన యిద్దరూ పలాయనం చిత్తగించేలోపల వారి కాలర్లు కలిపి పట్టుకొని రెండంటించా. కిందపడ్డ యిద్దరూ లేచేసరికి పది నిముషాలైనా పడ్తుంది. ఈ లోపల జనం గుడిగూడారు. ట్రాఫిక్ కానిస్టేబుల్ ఇక్కడేదో కొంప మునిగిపోతున్నట్లు పరుగెత్తుకొచ్చాడు. "ఏమిటీ గలభా? అడకూతురువి. నీ పాటికి నీవు పోక వీళ్ళతో నీ కెందుకు గొడవ? రేటు కుదరలేదా? అంతా కిరణ్ బేడీలైపోయారే? వెళ్ళు వెళ్ళు" అన్నాడు ఈసడింపుగా... ఈ కానిస్టేబిల్‌కి వీళ్ళు మామూళ్ళు బాగా ముట్టచెప్పినట్టున్నారు. అందుకే వారి తరపున వకాల్తా పుచ్చుకున్నాడు. "కర్తవ్యం" సినిమా చూసేసరికి అంతా హీరోయిన్‌లైపోయారు. కొంపలో పడుండక ఎవరు వల్లో పడతారా అని తిరుగుతుంటారు" అంటూ మరొక కానిస్టేబిల్ వచ్చాడు. ఇంతలో సి.ఐ అటు పోతూ నన్ను చూసి గుర్తుపట్టి విష్‌చేసి "ఎనీ ట్రబుల్ మేడమ్? మే ఐ హెల్ప్

యూ? ” అనేసరికి జరిగినదంతా క్లుప్తంగా చెప్పాను. ఊహించని ఈ పరిణామానికి నిలువు గుడ్లేసుకొని కానిస్టేబిల్స్ ఇద్దరూ నిలబడిపో య్యారు. తేరుకొని “తప్పయి పోయిం దమ్మా! పిల్లలున్నవాళ్లం. క్షమించండి” అంటూ కాళ్ళు పట్టుకున్నారు.

“నీ తల్లి, చెల్లి కూడ ఆడవాళ్ళే కదా! ఆడవాళ్ళని హీనంగా మాట్లాడకు. అందుకే పోలీసులంటే ప్రజలకు గౌరవం లేదు. ఈ సారెప్పుడయినా మీ మీద కంప్లయింటు వచ్చిందా! సస్పెండు చేస్తా. పోండి” అంటూ రౌడీ వెధవల్ని సి.ఐ.కి అప్పగించి బయలుదేరా” అంది స్వర్ణ.

“నువ్వు బలే డేరింగ్ స్వర్ణా. ఆడ వాళ్లు ఎవ్వరూ ఎంచుకోని ప్రొఫెషన్ ఎంచుకున్నావు” అన్నా మనస్ఫూర్తిగా.

“నాకెందుకో చిన్నప్పటినుంచి పోలీసు డ్రస్సు అంటే చాలా యిష్టం. ఆ యిష్టమే నన్ను యన్.సి.సి.లో చేరేలా చేసింది. అమ్మా, నాన్నలకు నాకు పెళ్లి సంబంధాలు రావు అని భయం” అంది.

“స్వర్ణా! మరి పెళ్లెప్పుడు? ” అన్నా.

“ఈ పెళ్లి చూపుల వ్యవహారం నాకు నచ్చదే. ఆ కొంచెంసేపు ఎంతో బుద్ధిమం తుడిలా నటిస్తారు. తర్వాత సర్వలక్షణ సంపన్నుడని తెలిసి ఖర్మ అని సరిపెట్టుకో వలసిందే కదా! అందుకే అమ్మవాళ్లు అడు గుతున్నా, నా ఉద్యోగానికి సరిపోయే వ్యక్తి, నన్నర్థం చేసుకొనేవాడూ వుండాలని నా ఆశ, చూద్దాం, తొందరేముంది? ” అంది.

“ఇంకా తొందరేమిటే? నువ్వనుకున్న ఉద్యోగం సాధించావు. మన ఫ్రెండ్స్‌లో పెళ్లి కాకుండా వున్నదానివి నువ్వొక దానివి మాత్రమే. నీ పెళ్లి అయిపోతే మీ అమ్మా, నాన్నలకూ నిశ్చింత కదా” అన్నా.

“దేన్నికైనా టైము రావద్దూ!” అంది నవ్వుతూ.

“స్వర్ణా! ఒక్కపాట పాడవూ!” అన్నా.

“నీకిదేం పిచ్చే!” అంది విసుగ్గా ముఖం పెట్టి.

“నాకు నీపాట వింటే మన హాస్టల్ లైఫ్ కళ్లకు కట్టినట్టు కన్పించి టానిక్‌లా పనిచే స్తుంది” అన్నా.

“తీరని కోరిక తీయతీయగా, హాయిగా మనసులు కలిసి పాడగా, కలసి ప్రయా ణము కలదు వినోదం, హాయిహాయిగా” అని తను పాడుతుంటె సముద్రపుగాలికి ఆ పాట తీగలు తీగలుగా సాగి గాలిలో తేలివస్తూ మనసును ఆహ్లాదపరిచింది. పిల్లలు ఆయన, టపటప చప్పట్లుగొడుతూ

## రాణికి త్రిశంకు స్థితే గతి

విశృంఖల లైంగికత విషయంలో ఆరోపణ లువచ్చి ఆస్కార్‌వైల్డ్ విచారణ ఎదుర్కొ న్నాడు. కాని దురదృష్టమేమంటే కోర్టు తీర్పు అతడికి వ్యతిరేకంగా వచ్చింది. రెండేళ్ల కఠిన కారాగార శిక్ష పడింది. తీర్పు వచ్చిన తర్వాత అతడిని చాలాసేపు వేచివుండేలా చేసి, కుండ పోతగా కురుస్తున్న వర్షంలో నిలబెట్టి, రెండు



చేతులకూ బేడీలువేసి జైలుకు తరలించారు. ఆ సందర్భంలో అతడు విక్టోరియా రాణినుద్దే శించి, 'రాణి విక్టోరియా ఖైదీలపట్ల ఇలాగే ప్రవర్తిస్తే ఆమెకు చనిపోయిన తర్వాత స్వర్గం, నరకం రెండింటిలో ఏదీ దక్కదు. త్రిశంకు స్థితే ప్రాప్తి' అన్నాడు హాస్యంగా.

## కొత్తగాలి...

**ప్రేమొక జలపాతమైతే**
**నా మనసొక నయాగరా**
**ప్రేమొక మంచు ముద్దయితే**
**నా మనసొక హిమాలయా**

–గుడిమెట్ల గోపాలకృష్ణ,
అరసవిల్లి

"సింప్లీ సూపర్బ్" అన్నారు మనస్ఫూర్తిగా.

పిల్లలిద్దరూ "చాలా బాగా పాడారు ఆంటీ" అన్నారు.

"ఆత్మారాముడు గోల పెడుతున్నాడు. మాకేమైనా పెట్టేది వుందా?" అన్నారా యన. స్నాక్స్ తిని, టీ తాగాక మళ్లీ ఆటలో పడ్డారు. సాయంకాలం పిల్లలు, ఆయన ఇసుకలో చెడుగుడు ఆడుతుంటే మేమిద్దరం అస్తమిస్తున్న సూర్యబింబం వెలుగు అలలపైబడి వింతకాంతినిస్తుంటే తన్మయత్వంతో చూస్తూ వున్నాం. స్వర్ణ వున్న నాలుగు రోజులు నిముషాల్లా గడి చిపొయ్యాయి. ఇది జరిగి పది సంవత్స రాలయినా నాకు నిన్నమొన్న విషయం లాగానే అన్పిస్తుంది. స్వర్ణ వాళ్ల కేడర్ ఆఫీసర్‌నే తను పెళ్లి చేసుకుంటున్నట్టు శుభలేఖ పంపింది. కాని మా అత్తగారికి బాగా లేక వెళ్ళలేకపోయాం. తర్వాత మహారాష్ట్ర ట్రాన్స్‌ఫరయ్యిందని, యిద్దరు మగ పిల్లలని, వాళ్ల అమ్మానాన్న తన దగ్గరే వుండటంవల్ల యిబ్బందేమి లేదు అని రాసింది. పిల్లలకు, మాకు కూడ వేసవి సెలవులు కావడం వల్ల హైదరా బాద్‌లో మావారి మేనకోడలి పెళ్లికి వెళ్లాం... పిల్లలకు కూడ హైదరాబాద్ చూపించవచ్చని. పెండ్లికొడుకు వాళ్లు బాగా డబ్బున్నవాళ్లు. పైగా ఆ అబ్బాయి అమెరికాలో ఇంజనీరు. 'అమ్మాయి చక్క నిది. కంప్యూటర్ ఇంజనీర్ కాబట్టి కట్నం అక్కరలేదు. పెళ్లి గ్రాండ్‌గా చెయ్యండి' అన్నారట. అందుకే ఏర్పాట్లన్నీ భారీగా ఉన్నాయి. పెళ్లికొడుకు తరపున వచ్చిన వాళ్లలో ఎత్తుకు తగ్గ లావుతో నెమలి పించం పట్టుచీరలో రవ్వల నెక్లెస్‌తో మెరి సిపోతున్న ఆమె ముఖం పరిచయము న్నట్టు అన్పించింది. కాని ఎంత బుర్ర బద్దలు కొట్టుకున్నా గుర్తుకు రావడం లేదు. ఇంతలో ఆమె నా వైపు వస్తూ "ఏయ్ శాంతీ! ఎన్నాళ్లకు చూశానే నిన్ను. నీ దగ్గరనుండి ఉత్తరాలు రాకపోయేసరికి ట్రాన్స్‌ఫర్ అయిందేమోననుకున్నా. స్వర్ణ కన్పించి మీరక్కడే ఉన్నారని చెప్పింది" అంటూ గుక్క తిప్పుకోకుండా మాట్లా డింది. ఆమె ఎవరో కాదు లత.

"నేనూ ఇందాకటి నుండి ఎక్కడో బాగా పరిచయం ఉన్న మొహమేనే అని గుర్తుకు తెచ్చుకుందామని ప్రయత్నిస్తున్నా. అమె రికా నీళ్లు బాగా ఒంటబట్టినట్టున్నాయి. తెల్లగా, బొద్దుగా ఉన్నావు. అందుకేనేమో గుర్తుపట్టలేకపోయా" అన్నా ఆశ్చర్యం నుండి తేరుకుంటూ.

"ఈ హడావుడి ఎప్పుడూ ఉండేదే లేవే. మనం అలా గార్డెన్‌లోకి పోయి మాట్లాడు కుందాం రా!" అంది లత.

పిల్లలను, ఆయనను లతకు పరిచయం చేశా.

"ఇక ఈ దీనుణ్ణి మరిచిపోతావేమో? పిల్లలనైనా గుర్తుపెట్టుకో" అంటూ వెళ్లారా యన.

"భలే మాట్లాడతారండీ మీరు. పిల్లలు ఇక్కడే ఆడుకుంటూ ఉంటారులెండి. అదో అక్కడ ఇద్దరబ్బాయిలున్నారు చూడండి. వాళ్లు మా అబ్బాయిలే. వాళ్లు నిమిషంలో కలిసిపోతారులెండి" అంది లత.

"ఏమిటి విశేషాలు? అమెరికానుండి ఎప్పుడొచ్చావు? ఎన్నాళ్లుంటావు? మీ శ్రీవారిని పరిచయం చెయ్యవా? హాస్ట

ల్ కు వచ్చినప్పుడు చూడటమే కాని పెళ్లికి రాలేకపోయా" అన్నా.

"అన్ని ప్రశ్నలకు ఒక్కసారి జవాబులు చెప్పలేను. నిన్ను చూసిన సంతోషంలోంచి నన్ను తేరుకోనీ ముందు" అంది లత ముద్దుగా విసుక్కుంటూ.

ఇంతలో ట్రేలో టిఫిన్, కాఫీ తెచ్చారు. "ముందు ఆత్మారాముడిని తృప్తిపరచు. తర్వాత మనిద్దరం ప్రోగ్రామ్ నిర్ణయించుకుందాం" అంది తను.

"పెళ్లికాగానే మీరంతా మా ఇంటికి రండి. మా టాటాసుమోలో పిల్లలతో కలిసి మీకు కావలసిన ప్రదేశాలన్నీ చూపిస్తా. చాలా రోజుల తర్వాత నీతో గడిపానన్న తృప్తి ఉంటుంది. మా అమ్మా, నాన్న కూడా నాతోనే ఇక్కడే ఉన్నారు. మీవారిని ఒప్పించు. ఇక ఏమీ ఆలోచించవద్దు" అంది ఆజ్ఞ జారీ చేసినట్టుగా.

"మీ వారిని పరిచయం చెయ్యవా? " అన్నా ఉండబట్టలేక.

"అందుకే కదా నిన్ను మా ఇంటికి ఆహ్వానించడం" అంది. అనుకున్నట్టుగానే అందరం గండిపేట వెళ్లాం. రామదాసు జైలు.. ఆ ప్రాంతమంతా తిరుగుతూ పిల్లలు బాగా ఉత్సాహంగా ఉన్నారు. మధ్యాహ్నం అక్కడే భోజనాలయ్యాక అందరూ ఆటలలో పడ్డారు.

మేమిద్దరం చెట్టు కింద చల్లటి నీడలో కూర్చున్నాం.

"ఆ.. సస్పెన్స్ ఏమిటి? అమెరికా వెళ్లినా తెలుగు కథే పునరావృతమయ్యింది. మా బావ నామీద ఎంతో ప్రేమ వున్నట్టు నటించి పెళ్లాడి అమెరికా తీసుకెళ్లాడు. ఏడాదిదాక ఏ ఒడిదుడుకులు లేకుండా హాయిగా గడిచింది. పెద్దబాబు కూడా అక్కడే పుట్టాడు. నేను ఇక్కడికి వస్తే అక్కడి విషయాలు ఏమి చెబుతానో అని ఆయన భయం. అందుకే పురిటికి ఇండియా రానీయలేదని తర్వాత తెలుసు

## కొత్తగాలి...

**నీలాకాశం ఫలకం మీద**
**నిశా సుందరి**
**రేరాజుకు రాసిన**
**ప్రేమ సందేశంలోని అక్షరాలు**
**నక్షత్రాలు**

–చారి, హైదరాబాద్

కున్నా. రెండో వాడిని కడుపుతో ఉన్నప్పటినుండీ ఆయన ఇంటికి ఆలస్యంగా రావడం, తాగి రావడం, దొరసానినొకదాన్ని కూడా వెంబడి పెట్టుకురావడం సాధారణమైపోయింది. ఏమైనా అంటే 'నా ఇష్టం. నోర్మూసుకు పడుండు' అనేవారు. 'అలాటప్పుడు నన్నెందుకు చేసుకున్నారు' అంటే, 'అబ్బో! నీవు అందెకత్తెవని కాదు. మీ నాయనకు నువ్వొక్కతే కూతురువి కదా! ఆస్తి వస్తుంటే ఎవరు కాదంటారు' అంటూ మనసులో విషయాన్ని బైట పెట్టాడు. ఇంతదూరం వచ్చింది కదా అని నేను కూడా గట్టిగా "ఆ దొరసానితో ఇక ఇకలు పకపక లేమిటి? పైగా ఆమెను ఇంటికి తీసుకువచ్చి నా ముందు అలా ప్రవర్తించడం ఏమిటి? " అన్నా.

ప్రశ్నించేసరికి ఆయనలో పురుషహంకారం బుసలు కొట్టింది. "ఏదో పోనీలే అని చూస్తుంటే మితిమీరుతున్నావు. నీకంటే ముందు ఆ దొరసానిని చేసుకున్నాను. దిక్కున్నచోట చెప్పుకో! రేపటి నుంచి ఆమె తన పిల్లలను కూడా యిక్కడికే తెస్తుంది. మాకు సేవ చేసే భాగ్యం నీకు కల్పిస్తున్నా" అంటూ ఆమెను తీసుకుని బయటికి వెళ్ళారు.

రెండోవాడు పుట్టినప్పటి నుండి సమస్యలింకా ఎక్కువయ్యాయి. ఆమె పిల్లలకు చాకిరీయేగాక వాళ్లకు డ్రింకులు సర్వ్

సంతోషపడుతుంటే వాళ్లను బాధపెట్టడం యిష్టంలేక బాగున్నాను అంటూ పిల్లల ఆటలు చెప్తూ మాట్లాడేదాన్ని. నేను యిక్కడకు వచ్చిన కొత్తలో తెలుగు సభలకు వెళ్తుండేదాన్ని. పరిచయమైన వాళ్ళ పిల్లలకు భరతనాట్యం నేర్పేదాన్ని. వాళ్ళెవ



చేయించేవాడు. లేదంటే పిల్లలెదురుగానే బెల్టు దెబ్బలు... ఒక్కోసారి వాళ్ళిద్దరితో కలిసి డాన్స్ చెయ్యమనేవారు. ఒకరోజు బలవంతంగా నా చేత తాగించి, నేను తూలుతుంటే యిద్దరూ ఎగతాళిగా నవ్వుకుంటూ అమెరికన్ యాసలో మాట్లాడుకోవడం విన్నాను 'సాటి ఆడది' అని లేకుండా ఆ దొరసాని కూడా డబ్బు పిచ్చిదే అన్పించింది. నేనిక్కడ అమెరికాలో చాలా సుఖపడిపోతున్నానని అమ్మావాళ్లు

రికైనా ఏమైనా చెబుతానేమోనని "ఆమె ఆరోగ్యం బాగాలేదు. భరతనాట్యం నేర్పించదు" అని రెండోవాడు కడుపులో వున్నప్పుడు మాన్పించేసాడు. ఇక అప్పటి నుండి తలుపు లాక్ వేసుకొని వెళ్ళిపోయేవాడు. ఒకరోజు దొరసాని, ఆయన పిల్లలతో కలిసి వచ్చి బోలెడు స్వీట్లు, పిల్లలకు కొత్త డ్రస్సులు, నాకూ ఏవో ప్యాకెట్లు తెచ్చి యిచ్చారు. నాకప్పుడే అనుమానమొచ్చింది. వీళ్ళిద్దరూ కలిసి ఏదో పెద్ద ప్లానులో వున్నారని. మా బెడ్‌రూమ్స్ కూడా ఎప్పుడో వేరయ్యాయి. ఆమెతోనే



కూడా ఈ అవకాశాన్ని సద్వి నియోగపరచుకోవాలనే నిర్ణ యంతో సరేనన్నా.

నేను ఇండియా వచ్చాక అమ్మా, నాన్న పిల్లలను చూసి చాలా ఆనందపడిపోయారు. నెమ్మదిగా జరిగిందంతా చెప్పా. వాళ్ళిద్దరు మనసు సర్దుకున్నాక "నేను అమెరికా వెళ్ళను. ఇక్కడే వుంటాను. పిల్లలు కూడా నాతోనే వుంటారు. నేను రేపే లాయరును కలుసుకొని విడాకు లకు అప్లై చేస్తాను" అని చెప్పా.

ఆ రోజంతా అమ్మా, నాన్న మంచి నీళ్ళు కూడా ముట్టకుండా ఏడ్చారు. మా లాయరు కూడా వచ్చి చెప్పాక నేను కళ్ల ముందుంటాను, మరల బలవంతంగా అమెరికా వెళితే చంపేస్తాడేమోనని భయ పడి ఒప్పుకొన్నారు. మా నాన్న వెంటనే ఆస్తి మనమలిద్దరిపేర రిజిస్టరు చేయించి లాయరునే గార్డియన్‌గా పెట్టాడు. పిల్లలు ఆయనకు లంపటం. పిల్లలకోసం ఏమీ పేచీ పెట్టలేదు. ఆస్తి నాన్న స్వార్జితం కాబట్టి ఆయనకు అవకాశం లేకపో యింది. నా వంటిమీద బెల్టు దెబ్బలు, సిగరెట్ వాతలు, టేప్‌చేసి నేను విన్పిం చిన దొరసానివి, ఆయనవి సంభాషణలు నాకు విడాకులు తొందరగా రావడానికి కారణమయ్యాయి. పీడా వదిలింది అని ప్రశాంతంగా వున్నా" అంది లత.

ఆయన. నాకు ఎంగిలి వస్తువును ముట్టు కున్నంత అసహ్యం వేసి కించిత్తు కూడా బాధపడలేదు. నా బాధ అమ్మావాళ్లను మోసం చేస్తున్నాననే తప్ప మరేంలేదు.

"మీ అమ్మ వాళ్లు పిల్లలను అసలు చూడలేదు కదా! అందుకని నీవు పిల్లలను తీసుకొని ఇండియా వెళ్ళి ఆస్తి నీపేర రాయించుకురా! ఇక్కడ మంచి ఇల్లు వుంది. కొందాం. ఒక నెలరోజులుండి రా! ఇవిగో టిక్కెట్స్ అన్నీ రిజర్వేషన్ చేయిం చాను. నేను వచ్చే సంవత్సరం వస్తానని చెప్పు. మన కొత్త యింటి గృహప్రవేశానికి మీ అమ్మా, నాన్నను కూడా అమెరికా రప్పిద్దాంలే. వారం రోజులే వుంది టైం. నీ లగేజి సరిచూసుకో. ఎక్కువ తీసుకెళ్ళకు. మరల వస్తావు కదా! ఇక్కడి విషయా లేమి ఆముసలి వాళ్లకు చెప్పకు జాగ్రత్త!" అంటూ తర్జనితో బెదిరించారు.

"మా పిల్లలిద్దరిని చిన్నప్పుడే బోర్డింగు స్కూలులో చేర్పించారు, వాళ్ళిద్దరి రాసక్రీడ లకు అడ్డమని. అందుకని తెలుగు అర్థం కాదు. బిత్తర చూపులు చూస్తారు. ఆ దొరసాని సరేసరి. పగలబడి నవ్వడం. నా ఎదురుగానే ఆయనను కావలించుకుని ముద్దులు పెట్టుకోవడం మామూలే. నేను

"మరి నీకు తోచేదెలా? ఇక్కడికెందుకొ చ్చారు? " అన్నా.

"మా బంధువులాయనకు హైద రాబాదులో పెద్ద షాపింగ్ కాంప్లెక్సు వుంది. అది అమ్ముతుంటే నాన్న వూళ్ళో వున్న యిల్లు, పొలం కొంత అమ్మి కొన్నారు. పిల్లలు చదువులకు యిక్కడకు

రావాలి కదా అనే వుద్దేశంతో చిన్న యిల్లు కొనుక్కొని పూర్తిగా యిక్కడికే వచ్చేశాం. షాప్ నిర్వహణ అంతా నేనే చూస్తుంటా. ఇంకో కొత్త బ్రాంచ్ కూడా ఓపెన్ చేయ బోతున్నా. అది నా సొంతమే. బ్యాంకు లోనుతో ప్రారంభిస్తున్నా" అంది ఎంతో ఆత్మవిశ్వాసం నిండిన గొంతుతో.

"లత ఎవరైనా ఏమైనా అంటారని నీవ నుకోలేదా? తొందరపడి తెగతెంపులు చేసుకున్నావేమో? " అన్నా సందేహంగా.

"శాంతీ! నీవు కూడా మా అమ్మలాగ ముసలమ్మలా ఆలోచిస్తావేమిటే? ఆ దేశం కాని దేశంలో చస్తూ, బతుకుతూ, బాంచను కాల్మొక్తానంటూ వుండటం నా వల్లకాదు. అనుభవించిన సుఖం చాలు. నాకింతే రాసిపెట్టి వుందనుకున్నా. నా పిల్లలకు మంచి చదువు చెప్పించి స్థిరపర్చ వలసిన బాధ్యత నాదే. అంతకంటే నేనేమీ ఆలోచించడంలే" అంది.

"మీ అత్త, మామ వచ్చి గలభా చెయ్యలేదా? " అన్నా.

"ఎందుకులే? బరి తెగించినదానివి. నీకు మిడిసిపాటు ఎక్కువ. మగవాడు తిరిగితే తప్పేమిటని నేనే తప్పు చేసిన ట్టుగా ఒక రోజంతా తిట్టి వెళ్ళారు. మను మలను చూడటం అదే మొదటిసారయినా సరిగా పలకరించలేదు. అప్పనంగా వచ్చే ఆస్తిపోయిందని, కోర్టుకెక్కి వాళ్లబ్బాయి పరువు తీశానని వాళ్ళ దుగ్ధ. అంతేకాని ఆడపిల్ల జీవితం అన్యాయమయిందని ఏమాత్రం లేదు" అంది లత.

"జీవితమన్నాక ఒడిదొడుకులుంటాయి. ఆయన అలవాట్లను నెమ్మదిగా చెప్పి మాన్పించడానికి ప్రయత్నించావా!" అన్నా.

"ఆయన డబ్బుపిచ్చి పట్టి వున్నాడు. అమెరికాలో డాలర్లకే విలువకాని మనుష లకు, మనసులకు వుండదు. ఆయనకు ఆ సంస్కృతి బాగా ఒంటపట్టింది. నేను తప్పు చెయ్యనప్పుడు ఎవ్వరికీ భయపడవ లసిన అవసరం లేదు. నా విషయమంతా వివరంగా స్వర్ణకు ఉత్తరం రాస్తే ధైర్యంగా వ్యవహరించావంటూ అభినందనలు తెలి పింది. మనం మాట్లాడనంతవరకు మన వెనక కుక్కల్లా మొరుగుతుంటారు. ఒక్క సారి వెనక్కి తిరిగి జవాబు చెప్పామో ఇక మన జోలికి రారు. అదే ఈ మనుషుల తత్వం" అంది జీవితాన్ని కాచివడబోసిన ఆరిందాలా.

ఇంతలో పిల్లలు, ఆయన బిలబిలా వచ్చారు. "అయ్యాయా మీ కబుర్లు, చీకటి పడిపోయేలా వుంది" అంటూ.

"రేపు ఉదయాన్నే సాలార్జంగ్ మ్యూజియం వెళ్దాం. సాయంకాలం దాక సరిపోతుంది. పిల్లలకు బాగుంటుంది" అంది లత. మరుసటి రోజు సాలార్‌జంగ్ మ్యూజియం వెళ్ళాం. రాత్రి లత వాళ్లింట్లో డిన్నర్ చేసి బయలుదేరాం.

అందరి దగ్గర సెలవు తీసుకున్నాం. వద్దంటున్నా లత పిల్లలను తీసుకొని స్టేష నుదాక వచ్చి సాగనంపింది. "సెలవులకు పిల్లలను తీసుకొనిరా. మన ఫ్రెండ్స్ అంద రికీ కూడా రాస్తాను అందరం కలుసుకుం దాం. మా ఇల్లే వేదిక" అన్నా.

"ఏమండోయ్! మీరు మా శాంతి మాటలు నమ్మారంటే మా షష్టి పూర్తికే కలుసుకొనేది. ఈలోపునే రండి" అన్నారు మావారు నవ్వుతూ. పిల్లలు కూడా ఒకరికొకకు బై చెప్పుకుంటుంటే, లత నవ్వుతూ చెయ్యూపుతుంటే రైలు నెమ్మ దిగా కదిలింది.

నాలుగురోజుల నుండి తిరగడం వలన, రిజర్వేషను కంపార్ట్‌మెంట్ కాబట్టి రైలు కదలగానే బెడ్ సర్దుకొని పిల్లలు, ఆయన నిద్రలోకి జారుకున్నారు. నన్ను నిద్రా దేవత అంత తొందరగా కరుణించలేదు. స్నేహితురాలిని కలుసుకున్నానన్న ఆనం

దంలో నా మనసు ఉత్సాహంగా వుంది. కార్పొరేట్ రంగం విస్తరించాక బిజీ బిజీ ఎవరిని కదిలించినా. మంచి గంధంలా స్నేహం ఎప్పటికీ తన పరిమళాన్ని వెదజల్లుతుందన్న కవి మాటలు గుర్తుకొస్తున్నాయి. పడుకొన్నానే కాని నా ఆలోచనలన్నీ మేము గడిపిన హాస్టలు జీవితాన్ని కళ్ళముందుకు తెచ్చాయి.

★ ★ ★

హాస్టలులో ఉన్నప్పుడు మాకందరికీ సినిమా పిచ్చి బాగుండేది. మొదటి సంవత్సరం కాస్త భయంగా నెట్టుకొచ్చాం. రెండో సంవత్సరం వచ్చేసరికి కిటుకులు ఒంటబట్టాయి. మా కాలేజీకి దగ్గరలోనే ఒక సినిమా హాలుండేది. అందులో ఎప్పుడూ హిందీ సినిమాలే ఆడేవి. తెలుగు సినిమా అయితే ఎక్కువ టైమ్. హిందీ సినిమా మధ్యాహ్నం రెండున్నరకు మొదలు పెట్టి 4.30 కల్లా ముగిస్తారు. మాకు చాలా సౌకర్యంగా వుండేది. కెమిస్ట్రీ ప్రాక్టికల్స్ మధ్యాహ్నం వుండేవి. ఆ కెమిస్ట్రీ అటెండరు తాగుబోతు. వాణ్ణి ట్రాన్స్‌ఫరు చెయ్యడానికి ఎవరికీ ధైర్యం లేదు. వాడు మినిస్టరు చుట్టం. పైగా నోటి దురుసు. వాడెప్పుడూ లాబ్‌లో గ్యాస్ బర్నర్స్‌కు కావలసిన గ్యాస్ నిల్వచేయకపోవడమో, తప్పతాగి పడిపోవడమో చేస్తుండేవాడు. అలాంటి రోజు మాకు క్లాస్ కాన్సిల్. ఇంటికెళ్ళండనేవారు. మాకు కాలేజి టయిమ్ అయిపోతేకానీ హాస్టలు గేట్ తెరవరు. గార్డెన్‌లోనో, లైబ్రరీలోనో వుండాలి. అందుకని మేము ఎప్పుడూ పుస్తకాలలో డబ్బులు పెట్టుకొని, ఒకరికొకరు సర్దుకొనైనా సినిమాకెళ్ళి టైముకు హాస్టలు కొచ్చేసేవాళ్ళం. అలా ఎన్ని హిందీ సినిమాలు చూశామో లెక్క లేదు. బాగు ఓగుతో పనిలేదు.

మా హాస్టలులో కూడ సినిమాకు తీసుకెళ్ళారు. ఎలా వెళ్ళామో తల్చుకుంటే నవ్వు

**కొత్తగాలి...**

**ఆకాశంలో మేఘాల్లేవు**
**భూమ్మీద చెట్లు లేవు**
**రైతుల ఆత్మహత్యలున్నాయి**

– మోపూరు రామశేషు,
ఎర్రగడ్డ, హైదరాబాద్

వస్తుంది. సిటీబస్సు హాస్టలులోకి వస్తుంది. ఆరోజు ఉదయమే బాల్కనీ మొత్తం మాకు రిజర్వేషను చేయిస్తారు. డిప్యూటీ వార్డెను, నలుగురు లెక్చరర్స్ వస్తారు. గొర్రెల మందను తోలుకెళ్ళినట్టు తోలుకెళ్ళేవారు. మాకప్పుడు షేక్‌స్పియర్ డ్రామా 'ఒథెల్లో' వుండేది. ఆ సినిమా వస్తే దానికి తీసుకెళ్ళారు. మళ్ళీ చాలా రోజుల తర్వాత అలాగే 'మై ఫైయిర్ లేడీ' వస్తే దానికి కూడా వెళ్ళాం. ఆ రెండు అనుభవాలు మాకు జైలు పక్షులనే గుర్తుకు తెచ్చాయి. అందుకని ఎప్పుడూ ఇక పోగూడదని నిర్ణయించుకొని స్వేచ్ఛగా సినిమా చూడాలని తాపత్రయ పడుతుంటాం. చిప్సో, వేరుశనగ పప్పో, పాప్ కార్నో తింటూ కబుర్లు చెప్పుకుంటూ, సినిమా చూసి వచ్చేటప్పుడు ఐస్‌క్రీమ్ తిని వస్తే అప్పుడు మాకు సినిమా చూసిన తృప్తి వుండేది.

ఆదివారం వస్తే మా హాస్టలు పెళ్ళిల్లు లాగ కళకళలాడుతూ సందడిగా వుండేది. క్రిస్టియన్లకు చర్చికి వెళ్లేందుకు పర్మిషన్ ఉదయం 9 నుండి మధ్యాహ్నం 12 దాకా యిస్తారు. అందుకని వాళ్ళంతా మేచింగ్ సరిచూసుకుని, ఒకరిబట్టలు మరొకరు మార్చుకొని సూట్ అవుతాయా లేదా అని సరిచూసుకుంటారు. ఆదివారం ఉదయం స్పెషల్‌గా పులిహోర, పాయసం చేస్తారు. సాయంత్రం టిఫిను, స్వీటు, హాటు పెట్టే

వారు. ఉదయం 8 గంటలకే చెట్లకింద గాజులబండి, ఫ్యాన్సీ సామాన్లు, చీరలు, మొదలైనవన్నీ షాపులవాళ్ళు అమ్ముతుండే వారు. అమ్మాయిలంతా బేరసారాలు చేసి వాయిదా పద్ధతులలో తెచ్చుకుంటుండే వారు. మాకు ఎప్పుడూ మా సినిమాల గోలేకాని వాటి జోలికి పోయేవాళ్ళం కాదు. సాయంకాలం నాలుగు గంటల నుండి ఆరు గంటల వరకు విజిటర్స్ని రానిస్తారు. వార్డెను హాలులో కూర్చొని వారు ఎవరి కోసం వచ్చారో, ఎందుకోసం వచ్చారో కనుక్కొని, అప్పుడు పిలిపించి ఒక అరగంట మాత్రం మాట్లాడటానికి పర్మిషనిచ్చేది. ఆరు గంటలకు బెల్ మోగ గానే విజిటర్స్ వెళ్ళాలి. గేట్ లాక్ చేసే వారు. కొంతమంది దగ్గరివాళ్లు పిల్లల కోసం పచ్చళ్ళు, తినుబండారాలు తెస్తుండే వారు. రుచీ, పచీలేని హాస్టలు భోజనంతో మొహం వాచి, వాటికోసం ఎదురు చూస్తూ అందరూ పంచుకొని తినేవారు. వచ్చిన కొత్తలో ఈ వాతావరణం నాకు చాలా వింతగా వుండేది. తర్వాత నేను కూడా అలవాటు పడిపోయా.

ఒకసారి నేను వచ్చిన కొత్తలో మా అమ్మ అరిసెలు పంపి రోజుకొక్కటి తిన మని ఉత్తరం రాసిచ్చింది. నేను ఆ సమ యానికి బాత్‌రూమ్‌లో వుండేసరికి మా రూమ్మేట్స్ అందరూ నాలుగు అరిసెలు చొప్పున పంచేసి నా వాటా నాలుగు అని టేబిల్‌మీద నేనొచ్చేసరికి పెట్టివుంచారు. ఎవరింటి నుండి ఏమీ తెచ్చుకున్నా అందరం సమానంగా పంచుకుతినే వాళ్ళం. మాకెప్పుడూ కులమత భేదం కాని, ధనిక బీద తారతమ్యం కాని లేవు. ఎవరికి అవసరం వచ్చినా అందరం కలిసి తీర్చడానికి ప్రయత్నించేవాళ్ళం. మేం ఏడుగురం ఎప్పుడూ కలిసికట్టుగా వుండే వాళ్ళం. కాలేజీలో మా గ్రూపులు వేరైనా, చదువుకునేటప్పుడు ఒకరికి తెలియని సబ్జెక్టు మరొకరు చెప్పడం చేసేవాళ్ళం. మమ్మల్ని హాస్టలులో అందరూ 'విబ్జి యార్' అని, 'సరిగమపదనిస గ్రూపు వస్తున్నదని పిలుస్తుండేవాళ్ళు. మేం నవ్వుతూ పలికేవాళ్ళం. కాని ఈ రోజు లలో అవసరానికే స్నేహాలు, చాటయితే చాడీలు, స్నేహం విలువ ఎంత మందికి తెలుసనిపిస్తుంది. స్వచ్ఛమైన స్నేహంలోని మాధుర్యాన్ని అనుభవించిన వారికే తెలు స్తుంది దాని విలువ.

మేము చూసిన సినిమాలోకెల్లా 'మనసే మందిరం' సినిమా అనుభవం నేనెప్పటికీ మరిచిపోలేను. ఆ సినిమా చూసొచ్చి 'డే స్కాలర్స్' అందరూ రకరకాలుగా కామెంట్సు చేస్తుండేవారు.

అబ్బ సావిత్రి యాక్షను అద్భుతం అని ఒకరు, అబ్బ నేను ఏడవలేను బాబూ.. నాలుగు కర్చీఫ్‌లు తీసుకెళ్ళాలని ఒకరు.. ఇలా వుండేవి. దాంతో మాకు ఎప్పుడె ప్పుడూ ఆ సినిమా చూద్దామని వుండేది. ఆదివారం రానే వచ్చింది.

"మీకో గుడ్ న్యూస్ చెప్పనా? " అంటూ వచ్చింది సుధ. అప్పుడే హడావుడిగా హాస్ట లంతా సుడిగాలి పర్యటన చేసి వచ్చింది.

"తొందరగా చెప్పి తగలడవే.. సస్పె న్సుతో చంపక" అంది రమ.

"ఆరో నెంబరు రూమ్‌లో వున్న మేరీకి జ్వరంగా వుందట. మేరీకి తోడుగా విక్టో రియా, గ్రేస్ కూడ చర్చికి వెళ్ళరట" అన్నా అయోమయంగా. "నువ్వో ట్యూబ్‌లైట్‌వి. నోరు మూసుకొని మా తోరా" అన్నారు.

"ఇంతకీ మీరు పర్మిషన్ ఎలా సంపాది స్తారో నాకు అంతుపట్టడం లేదు" అన్నా సందేహంగా సుజాతతో.

"ఆ... ఏముంది మేరీ వాళ్లు చర్చికి పోతున్నట్టుగా వాళ్లచేత పర్మిషన్లు పెట్టించి, ఆ లెటర్లు తీసుకొని గూర్ఖాకి

# తాడేపల్లివారి దురద గీతి

అనగనగా నిజం

ప్రముఖ అష్టావధాని గాడేపల్లి కుక్కుటేశ్వరరావు నర్సరావు పేట కళాశాలలో బి.ఎ. విద్యార్థి. ఆయనతో మరో ఇద్దరు విద్యార్థులు గదిలో అద్దెకుంటున్నారు. రోజూ వారిగదికి మృత్యుంజయుడనే మిత్రుడు వచ్చిపోతూ ఉండేవాడు. అతనికి దురదల రూపమైన అంటువ్యాధి ఉండేది. రాత్రింబవళ్లూ ఆయన విద్యార్థుల పక్కల మీదే గడిపేవాడట. చూసి చూసి ఓ రోజు గాడేపల్లివారు 'నీవు రోజూ మా గదికి వస్తూపోతూ ఉండడంవల్ల మా వస్తువులు కొన్ని పోతున్నాయిరా!' అన్నారట. వెంటనే ఆ మిత్రుడు తెల్లబోయి 'ఏం పోయాయి? నిజంగా నాకేం తెలియదు' అన్నాడట. అప్పుడు గాడేపల్లి వారు తమాషాగా



'గోకి గోకియు మాశ్రేళ్ల గోళ్లు పోయె
జేబులన్నియు వరుసగా చినిగిపోయె
తెగ బరుకుచుంట నిద్దుర ఎగిరిపోయె
నాడు నాదు చదువు చంకనాకిపోయె'

అని పద్యం ఆశువుగా చెప్పారట. వెంటనే సరసుడైన ఆ మిత్రుడు అమాంతంగా కౌగిలించుకోబోయి సందేహించాడట.

స్తారు. లెటరిస్తే గూర్ఖా బయటకు పంపుతాడు. ఇప్పటికి నాలుగు లెటర్లు సంపాదించారు. ఈ మూడుతో సరిపోతాయి. మన మొచ్చేసరికి గూర్ఖా డ్యూటీ మారి వుంటాడు. మామూలుగా లోపలికి వచ్చేయవచ్చు" అంది సుజాత అర్జునునికి గీతోపదేశం చేస్తున్నరీతిలో.

మేమంతా బయలుదేరి హాలు దగ్గరకు వెళ్ళేసరికి టైటిల్సు వేస్తున్నారు. హడావుడిగా టిక్కెట్లు తీసుకొని టార్చిలైటు వెలుగులో చూపించిన సీట్లలో కూలబడ్డాం. అందరికి వరుసగా సీట్లు దొరికాయిగదా అని సంబరపడ్డాం.

"అయ్యో! న్యూస్‌రీల్ మిస్ అయ్యామే! పేర్లు వేసేశారే!" అనుకుంటూ సినిమా చూడటంలో లీనమయ్యాం.

"అబ్బా! సావిత్రి లావుగా వున్నా ముఖంలో భావాలు పలికించడంలో ఆమెకు ఆమే సాటి" అంది లత.

"చలం హాస్యం ఈ సినిమాకు ప్రత్యేక ఆకర్షణ" అంది సుధ.

"ఆ చిన్న పాప యాక్షన్ బలే ముద్దొస్తుందే" అంది రమ.

"పక్కన మీ వెధవ గోల వలన నాకు ఒక్క డైలాగ్ వినబడి చావడం లేదు" అంది స్వర్ణ విసుక్కుంటూ.

"రేపు బజారెళ్ళి ఓ చెవిటి మిషను కొనుక్కోరాదూ!" అంది సుమ.

"నాగేశ్వరరావు నటన ఈ సినిమాకు ప్రాణం" అంది సుజాత.

"నువ్వేమి మాట్లాడవేమిటి? " అంటూ నన్ను మోచేత్తో పొడిచారు. నాకు నవల చదివినా, సినిమా చూసినా అందులో నా మనసును తాకి కదిలించే సంఘటనలొస్తే తెలీకుండానే కళ్ల నీరు నిశ్శబ్దంగా కారిపోతుంటాయి. ఇంకొంచెం ఎక్కువయితే

## కొత్తగాలి...

**హైటెక్కీకరణం**
**ప్రయివేటీకరణం**
**గ్లోబలీకరణం**
**ఏమిటో ఈ వ్యాకరణం**

—వీధుల రాంబాబు,
భద్రాచలం

వెక్కిళ్ళు వస్తుంటాయి.

నన్ను చూసిన స్వర్ణ "ఇదేమిటే? మొద్దూ! నువ్వేమైనా చిన్నపిల్లవా? వాళ్ళంతా లక్షలు తీసుకొని గ్లిజరిన్ పూసుకొని ఏడుస్తూంటే నువ్వేమో డబ్బులిచ్చి ఏడుస్తావేమిటే? సెంటిమెంటల్ ఫూల్! ఎవరైనా చూస్తే మేమంతా నిన్నేమైనా అన్నామేమో అనుకుంటారు. కళ్లు తుడుచుకో. ఇంటర్వెల్ టైమవుతోంది" అంది. ఇంటర్వెల్‌లో లైట్లు వెలగగానే చుట్టూ ఒక్కసారి కలయ చూశాం. తేలు కుట్టినట్టు ఒక్కసారి ఎగిరిపడ్డాం. మా ముందు వరుసలోనే మా ప్రిన్సిపాల్ చుట్టాలతో సహా వచ్చింది. మమ్మల్ని గుర్తు పడ్తుందేమోనని ఒక్కొక్కరం నిశ్శబ్దంగా బైటకు వచ్చి కూల్‌డ్రింక్ తాగితేకాని మా గుండె దడ, చెమటలు తగ్గలేదు.

"నాకు భయంగా వుంది. వెళ్ళిపోదాం" అన్నా.

"అబ్బ! నువ్వొట్టి పిరికిదానివే. ఆమె చుట్టాలకు మర్యాద చెయ్యడంలో మునిగిపోయింది. మనల్ని గమనించదులే. ఇక నోర్మూసుకొని సినిమా చూడండి" అంది సుధ.

లైట్లారిపోయే దాకా బయటే ఉండి చీకటిలో తడుముకుంటూ సీట్లలో వచ్చి కూలబడ్డాం. ఎవ్వరి నోటినుండయినా శబ్దం వస్తే ఒట్టు. నాకు కళ్ల నీరు కారుతూ మధ్యలో వెక్కిళ్ళు మొదలయ్యేసరికి నోరు మూసి "కంట్రోల్ యువర్ సెల్ఫ్ శాంతీ! ఆమెవి డేగ కళ్ళు. ఏ మాత్రం అనుమానం వచ్చినా మన పెట్టే, బేడా రేపొద్దున బజార్లో గిరాటేస్తుంది" అంది రమ.

సినిమాకు వచ్చామన్న ఉత్సాహంలేదు. అందరం సినిమా కళ్ళప్పగించి చూస్తున్నాం. ఇంకా సినిమా ముగింపు పదినిముషాలుందనగానే చెయ్యిపట్టుకొని బైటికి లాక్కొచ్చారు. 'జనగణమన' అయ్యిందాక కదలని వీళ్ళు హడావుడిగా బైటకు వస్తుంటే నాకు నవ్వు వచ్చింది. ఎప్పుడూ గీచి గీచి బేరమాడి రిక్షా ఎక్కేవాళ్లం, హడావుడిగా రిక్షాలో హాస్టలుకి వచ్చేదాకా గుండెదడ తగ్గలేదు. ప్రిన్సిపాల్ ఎవ్వరు చెప్పినా వినదు. అందుకే అందరికీ ఆమె అంటే హడల్. ఇక ఎప్పుడూ సినిమా చూడకూడదని నిర్ణయించుకున్నాం. చిన్నప్పుడు దొంగతనంగా చెట్టెక్కి కోసుకున్న జామకాయల రుచే వేరుకదా అన్పించింది. "నువొట్టి పిరికిదానివి. నీతో ఎట్లా వేగాలో" అంటారు నా నేస్తాలు నాటకీయంగా.

'క్రిస్టమస్' సెలవులకు అందరం వూళ్ళకు వెళ్ళి వచ్చాం. ఇండ్ల దగ్గరి కబుర్లు చెప్పుకుంటూ, తమ్ముడు చెల్లెళ్ళతో సెలవులు ఎలా ఎంజాయ్ చేశామో, ఎన్ని రకాల పిండివంటలు తిన్నామో రకరకాలుగా చెప్పుకుంటూ, ఇంటి దగ్గర నుంచి తెచ్చిన పచ్చళ్ళు, ఊరగాయలు, పిండివంటలు పంచుకొని తింటూ హాయిగా ఒక పదిరోజులు అయిపోయాయి. అంతా హడావుడిగా రికార్డు వర్కు మొదలెట్టాం. ఇంతలో ఎవరో నాయకుడు చనిపోయాడని రెండు రోజులు సెలవులిచ్చారు. దగ్గర ఊరివాళ్ళంతా ఆదివారం కలిసిరావడంతో వెళ్ళిపోయారు. నేను, స్వర్ణ మాత్రమే రూమ్‌లో మిగిలాం. మా ఇద్దరికీ లైబ్ర

రీలో పుస్తకాలు తెచ్చుకొని చదివే అలవాటుంది. మా ఇంగ్లీషు మేడమ్ అప్పుడప్పుడు ఇంగ్లీషు నావెల్సు చదువుతుంటే ఇంగ్లీష్ బాగా వస్తుందని చెప్పింది. అలా తెచ్చుకుని చదివిన వాటిలో బాగా నచ్చినవి 'గాన్ విత్ ది విండ్', 'వార్ అండ్ పీస్', 'కాంతాపుర', 'కూలీ', 'గైడ్' వున్నాయి. 'గైడ్' సినిమాగా వచ్చిందని, పాటలు చాలా బాగున్నాయని చూసివచ్చిన వాళ్ళంతా చెప్పారు. స్వర్ణ దేవానంద్ ఫాన్. ఇంకేముంది? ఇద్దరం ఎలాగైనా ఆ సినిమా చూడాలని ప్లాన్‌వేసి చివరికి ఓ నిర్ణయానికి వచ్చాం.

ఇద్దరం కలిసి ఊరెళ్ళుతున్నట్టు పర్మిషన్ లెటర్ పెట్టి ఎవరికీ అనుమానం రాకుండా ఒక జతబట్టలు బ్యాగ్‌లో పెట్టుకొని గేటుదాటి దగ్గరగానున్న మా ఫ్రెండ్ యింటికి వెళ్ళి ముగ్గురం కలిసి 'గైడ్' సినిమా చూసి ఎంజాయ్ చేసి, వాళ్ళింట్లో భోజనం చేసి ఆ రాత్రికి అక్కడే వుండి మరుసటిరోజు ఉదయమే హాస్టలుకు వచ్చాం.

ఉదయాన్నే వార్డెను దగ్గరకెళ్ళి "మేడమ్ రైలు తప్పిపోయింది. అర్ధరాత్రి హాస్టలుకు రాలేక రైల్వేస్టేషన్‌లో వుండి పొద్దున్నే హాస్టలుకు వచ్చాం. ఇక "ఊరికి వెళ్ళం. చదువుకుంటాం" అన్నాం ముక్తకంఠంతో.

"గుడ్ గర్ల్స్! కొంచెం ముందుగా పోవాలని తెలీదూ? పోయి చదువుకోండి.. పోండి" అంది వార్డెన్ ప్రేమగా.

"అబ్బ! ఈ హిడింబికి అనుమానం రాకుండా బయటపడ్డాం. థ్యాంక్ గాడ్" అంది స్వర్ణ. మిగతావాళ్లు ఊరినుండి వచ్చాక మా సినిమా అనుభవం ఎలా చెప్పి ఊరించాలా అని ఆలోచిస్తూ గడిపాం. ఆ ఆలోచనలతో ఎప్పుడు నిద్రలోకి జారానో?

"శాంతీ! మన ఊరొస్తున్నది. సామాన్లవి సర్ది పిల్లలను లేపు. తొందరగా అన్నీ లెక్క చూడు. ఇక్కడ ట్రయిను ఎక్కువసేపు ఆగదు. లే" అనే శ్రీవారి హడావుడికి హఠాత్తుగా మేల్కొన్నా.




తాళం తీసి తలుపు తెరవగానే ఇంట్లో పెద్ద కవరు కనబడింది. అది చూడగానే ఆయన "ఎవరో నీ ఫ్రెండు తన జీవిత గాధను రాసినట్టుంది. మా వెధవలెక్కడైనా కన్పిస్తే కాఫీ యిస్తావా.. టీ యిస్తావా అంటూ అడుగుతారు. పోనీలే.. మీ వల్ల పోస్టల్ వాళ్లు బతికిపోతున్నారు" అన్నారు సరదాగా.

ఇంకొకప్పుడు అయితే ఆయన ఎగతాళికి జవాబు ఇచ్చేదాన్నేకానీ ప్రయాణంలో అలసివుండటం వల్ల మాట్లాడలేదు. వారం రోజులనాడు వదిలి వెళ్ళిన ఇల్లు బాగుచేసుకోవడంలో మునిగిపోయి కవరు దిండు కింద పెట్టా. తర్వాత తీరికగా చదువుకోవచ్చనుకున్నా. వసంతా ముగించుకొని కవరు మీద రాతను బట్టి అది 'సుమ' దస్తూరి అని గుర్తించా. సుమ వాళ్ల ఊరు చాలాదూరం కావడం వల్ల ఆమె సంగతులెక్కువగా తెలియలేదు. అందుకనే ఆత్రంగా ఉత్తరం చింపా...

శాంతీ!

చాలారోజుల తర్వాత చాలా పెద్ద ఉత్తరం రాస్తున్నాను. మనవాళ్ళ

అడ్రసులెవరివీ తెలీదు. మారిపోయాయి. నీకు రాస్తే మన వాళ్లకు తెలుస్తుందని రాస్తున్నాను. నా జీవితమే పెద్ద కథ అయ్యింది. దీనికి ముగింపు ఇన్ని రోజులు పట్టింది. నాపక్కన ధైర్యం చెప్పటానికి మీరెవరూ లేరు. నాకు నేనే ధైర్యం చెప్పు కొని అడుగు ముందుకేశా.

మనందరం ఒకసారి మెడికల్ కాలేజికి ఎగ్జిబిషన్‌కు వెళ్ళాం గుర్తుందా? ఆ రోజు ఒక్కొక్క బ్లాకు చూసుకుంటూ వెళ్తున్నాం. ఒక బ్లాకులో వింత వింత జబ్బులున్న శవాలను భద్రపరచివుంచారు మెడికోస్. ఒక్కొక్కరు వాటి గురించి వివరిస్తున్నారు. 'నాకు భయం. ఆ బ్లాకులోకి రాను' అంటే మీరందరూ బలవంతంగా తీసికెళ్ళారు. ఒకచోట సీసాలో 'హైడ్రోఫోబియా' వచ్చిన చిన్నపిల్లవాడి శవాన్ని చూడగానే స్పృహ తప్పి కిందపడిపోయా. వెంటనే ఒక మెడికో బల్లపై పడుకోబెట్టి వాళ్ళ మేడ మ్‌ను పిలుచుకొచ్చి నేను కోలుకునేదాక పక్కనే వున్నాడు. అతని పేరు రమణ అని, మెడిసన్ మూడో సంవత్సరం చదువు తున్నాడని తెలిసింది. నేను కోలుకున్నాక వాళ్లకు థ్యాంక్స్ చెప్పి వచ్చేశా. గుర్తుంది కదూ?

'జాగ్‌తే రహో' సినిమా బెనిఫిట్ షో టిక్కెట్లు అమ్మడానికి హాస్టలు సెక్రటరీ దగ్గరకు వచ్చాడతను. నేను అప్పుడు అక్కడే వుండటంవల్ల మనవాళ్ళందరి చేత టిక్కెట్లు కొనిపించా. తర్వాత కాలేజీలో కూడా అందరి చేత కొనిపించా. మనం సినిమా నుండి బైటికి వచ్చాక "సుమ గారూ మీవల్ల మేం అనుకున్న దానికంటే ఎక్కువ మొత్తం వచ్చింది. చాలా థ్యాంక్సండీ" అన్నాడు. అప్పటికే అది చూసి మన వాళ్ళు 'అమ్మో! లైనేసినట్టు న్నాడే' అంటూ చెవులు కొరుక్కోడం చూశా. అసలు మాకా ఉద్దేశాలే లేవు.

మన కాలేజీ తరపున బాడ్మింటన్ పోటీలు జరిగాయి కదా! మెడికల్ కాలేజీ అమ్మాయిలకు, మనకు పడింది. ఆ పోటీలు వాళ్ళ గ్రౌండులోనే జరిగాయి. మీరు కూడా వచ్చారు, నేను పార్టిసిపేట్ చేస్తున్నానని ఉత్సాహపరచడానికి. అతను కూడా ప్లేయరే. అందుకని తను నన్ను ఉత్సాహపరుస్తూ నా గెలుపుకు కారణమ య్యాడు. నా మనసంతా అతని పట్ల కృత జ్ఞతా భావంతో నిండిపోయింది. తర్వాత ఇద్దరి మనసులు కలిశాయి. అప్పటి నుండి అప్పుడప్పుడు కలుసుకునేవాళ్ళం. ఉత్తరాలు రాసుకునే వాళ్లం. కాని ఎప్పు డూ హద్దులు మీరలేదు. రమణ చాలా పిరికివాడు. స్వంతంగా నిర్ణయాలు తీసుకో లేడని గ్రహించడానికి ఎన్నో రోజులు పట్ట లేదు. అయితే అతని చదువు అయిపో వడంతో పై చదువులకు వాళ్ళ నాన్న స్టేట్స్ పంపిస్తున్నారని, మూడు సంవత్స రాలదాక రానని, అక్కడికి వెళ్ళాక ఉత్తరం వ్రాస్తానని అన్నాడు. అక్కడికి వెళ్ళాక అన్నట్లే కొన్ని రోజులు ఉత్తరాలు వచ్చాయి. తర్వాత రాలేదు. మన పరీక్షలై పోయి అందరం వెళ్ళిపోయాం. రమ వెళ్లే టప్పుడు నేను చెప్పాను కదా ఎమ్మెస్సీ. జాయిన్ అవుతున్నానని. అలాగే చేరా. చదవను అంటే మా నాన్న పెళ్లి సంబం ధాలు చూస్తాడని భయం. ఎమ్మెస్సీలో రమణ వాళ్ల చుట్టాలమ్మాయి వుండేది. తనవల్ల నాకు రమణ విషయాలు తెలు స్తుండేవి. చదువు అయిపోవడంతోటే మా నాన్న బిజినెస్ పనులు నేను చూడటం నేర్చుకున్నా. నాన్న పెళ్ళి సంబంధాలు చూస్తున్నారు. రమణ ఇండియా వస్తున్నా డని తెలిసింది. తర్వాత అమ్మాయి రమణ వెడ్డింగ్ కార్డ్ పంపింది. సరే ఏమయినా కాని చివరి ప్రయత్నం చేద్దామని నేను ఆ పెళ్ళికి బయలుదేరా. అక్కడి సంగతంతా

పూస గుచ్చినట్లు రాస్తున్నా. చదువు నీకే తెలుస్తుంది.

★ ★ ★

విద్యుత్ బల్బులతో ఆకాశంలో తారలే కిందికి దిగి వచ్చాయేమోనన్నంత ఆర్భాటంగా అలంకరణలతో 'సుస్వాగతం' అనే బోర్డు. 'శిరీష వెడ్స్ రమణ' అనే అక్షరాలు దూరానికి కూడ మెరుస్తూ కనువిందు చేస్తున్నాయి. ఆ ప్రాంతమంతా ఆహ్లాదకరంగా వుంది. పట్టుచీరల రెపరెపలు, సెంటు వాసనల గుబాళింపు, వేసవికాలం వచ్చిందన్నట్టుగా మత్తెక్కించే మల్లెల పరిమళం మనసుకెంతో ఉల్లాసాన్నిస్తున్నాయి. కన్నెపిల్లల బుగ్గల్లోని ఎరుపుదనాన్ని చూడటానికన్నట్లు కుర్రకారు జీన్స్ ప్యాంట్లలో నీటుగా ముస్తాబై పోజులు గొడుతున్నారు. మరికొందరు నల్లకళ్ళద్దాల మాటున దొంగచూపులు చూస్తున్నారు. ఊడిపోయిన గోచీ సవరించికుంటున్నాడు పురోహితుడు. 'చూడముచ్చటైన జంట. ఏర్చి కూర్చినట్టున్నారు' అంటున్నారు ఆహూతులు వధూవరుల్ని చూసి. తర్వాతి కార్యక్రమంకోసం పెళ్ళికూతురి తండ్రిని రమ్మని హడావుడి పెడుతున్నాడు పురోహితుడు.

"ఇదేమిటి రమణా! పెండ్లికూతురి బదులు నువ్వు సిగ్గుపడుతున్నావేమిటోయ్" అంటూ స్నేహితులు వరుడ్ని ఆటపట్టిస్తున్నారు. ప్రెజంటేషన్స్ పట్టుకొని మరికొందరు నిలబడి వున్నారు.

"ఆపండి ఈ పెళ్ళి" అనే నా కేక మంగళ వాయిద్యాల ఘోషలో కూడా గట్టిగానే విన్పించింది. ఈ హఠాత్ పరిణామానికి అందరూ వులిక్కిపడి నాకేసి చూశారు. పెళ్లికొడుకు మొహం వివర్ణమైంది. పెళ్ళికొడుకు తండ్రి కాబోలు హడావుడిగా నా దగ్గరకు వచ్చి "ఎవరమ్మా? ఎందుకొచ్చావ్? ఏమిటీ రభస?" అన్నారు కోపంగా నన్ను చూస్తూ.

## తొలి నవల ఇదే



**సిహెచ్.సుబ్బరత్నమ్మ**

అడపా దడపా పత్రికలకు కథలు రాస్తున్నా నవల రాయడం ఇదే తొలిసారి. నా ప్రతి రచనను ఓపికగా చదివి, ప్రోత్సహించే భర్త లభించడం నా అదృష్టం. 'కదంబమాల' నవల కూడా అలా ఆయన ప్రోత్సాహంతో రాసిందే. నా ఈ తొలినవలను ప్రచురణకు స్వీకరించి ప్రోత్సహిస్తున్న 'చతుర' సంపాదక వర్గానికి కృతజ్ఞతలు. ఈ సమాచారం తెలియగానే అంతులేని ఆనందం కలిగింది. ఇప్పటివరకూ రాసిన ఐదుకథల్లో నాలుగింటికి బహుమతులు రావడం కూడా నాకో గొప్ప సంతృప్తి, ఆనందం! వృత్తిరీత్యా నేను, మా శ్రీవారు ఉపాధ్యాయులమే. ఒంగోలు ప్రభుత్వ బాలికోన్నత పాఠశాలలో భౌతిక శాస్త్ర ఉపాధ్యాయినిగా, మైనంపాడులోని ఉపాధ్యాయ శిక్షణా సంస్థలో సైకాలజీ అధ్యాపకురాలిగా పనిచేసి పదవీవిరమణ చేశాను. ఇక నా ప్రధాన వ్యాపకం మంచి పుస్తకాలు చదవడం.. మనసు స్పందించినప్పుడు రచనలు చేయడం.

**చిరునామా:** సిహెచ్ సుబ్బరత్నమ్మ
హౌస్ నెం. 10-2-23,
రంగారాయుడి చెరువు దగ్గర,
ఒంగోలు-523002

నేను ఏమైనాకానీ అనే తెగింపుతో వచ్చాను. పైగా నా జీవితానికి సంబంధించిన సమస్య కాబట్టి నేనే పరిష్కరించుకో

వాలి అనే ధృఢ నిశ్చయంతో ఉన్నా. అందుకని ఆయన మాటలకు బెదరలేదు. ఇంతలో కంచిపట్టుచీర రెపరెపలాడించు కుంటూ రవ్వల దుద్దులు మెరిసిపోతుం డగా, జారిపోతున్న వడ్డాణాన్ని పైకి తోసు కుంటూ ఒకామె "ఏందమ్మాయి నువ్వ నేది? పెళ్లి ఆపమంటే ఆపమనటానికి మేం వాజమ్మలమా? గుడ్డొచ్చి పిల్లనెక్కి రించినట్టు నువ్వేమిటి మాకు చెప్పేది? " అంటూ వచ్చింది. పెళ్ళికుమారుని తల్లి కాబోలు. వాళ్లంతా నా చుట్టూ చేరేసరికి ఒక్కసారి రమణవైపు చూశా. బెల్లం కొట్టిన రాయిలా నిలబడ్డాడు కాని పెదవి విప్పి ఒక్కమాట మాట్లాడలా. పెండ్లి కూతురివైపు చూడగానే ఆ అమ్మాయి మొహంలో ఏదో రిలీఫ్ కన్పించింది.

"ఒక్కగ్లాసు మంచి నీళ్లిప్పించండి. వివ రంగా చెప్తాను. మీకేది న్యాయమని తోస్తే అది చేయండి" అన్నా. వినాలనే కుతూహ లంతో అక్కడక్కడ ఉన్న జనాలంతా దగ్గ రికి చేరారు. అవతలివారి రహస్యం వినా లని ఈ జనానికి ఎంత కుతూహలమో కదా అనుకున్నా. నాకు నేనే ధైర్యం చెప్పు కొని గొంతు విప్పా.

"మా నాన్న పొగాకు బిజినెస్ చేస్తు న్నారు. ఆస్తిపాస్తులు బాగానే ఉన్నాయి. అమ్మ లేకపోవడం వలన నాన్న ఎంతో గారాబంగా పెంచారు. నేను కోరినట్టుగానే ఉమెన్స్ కాలేజీలో చేర్పించి హాస్టలులో పెట్టి చదివించారు. నాకు పూర్తి స్వేచ్ఛని చ్చారు. ఏది అడిగితే అది క్షణాలమీద ఇప్పటికీ తెస్తారు. నేనెప్పుడూ నా హద్దులు తెలిసే మసలుకున్నా. కాలేజీ స్పోర్ట్సు సందర్భంలోను, మరి రెండు మూడు సందర్భాలలోను రమణతో ఏర్ప డిన పరిచయం మా యిద్దరికి క్రమంగా ప్రణయంగా మారింది. కాని ఆ విష యాన్ని తెలుసుకోవడానికి మాకు ఎక్కువ కాలమే పట్టింది. ఈలోపు పరీక్షల హడా వుడి, చివరి ఏడాది కావడంతో విడిపోవల సిన పరిస్థితి వచ్చింది. అందుకని మాటల సందర్భంలో ఒకసారి రమణనడిగా.

"మా నాన్న నేను చెబితే కాదనరు. మీరు కూడ మీ ఇంట్లోవాళ్ళకు మన పెళ్లి సంగతి చెప్పి నాకు తెలియచేయండి. నాన్న వచ్చి పెద్దలతో మాట్లాడుతారు" అన్నా.

"అమ్మో! ఇంకేమైనా ఉందా? మా నాన్న చండశాసనుడు. ఆయన చెప్పింది తు.చ. తప్పకుండ ఆచరించడమే కాని ఎదురు చెప్పేదిలేదు. ఆయన ముందు నేను మాట్లాడగలనా? " అన్నారు.

"పోనీ! మీ అమ్మగారి ద్వారా మీ నాన్నకు చెప్పకూడదా? " అన్నా.

"ఆమె ఎప్పుడూ పూజా పునస్కారాలు, గుళ్ళు గోపురాలు, పేరంటాలు అంటూ ఆమె లోకంలో ఆమె ఉంటుందే కాని మమ్మల్నసలు పట్టించుకోదు" అన్నారు.

నాకు ఒళ్లు మండిపోయింది. "అయితే మీరు కాలక్షేపానికి నన్ను ప్రేమించారా? అసలు మీ ఉద్దేశమేమిటి? మోసం చేద్దా మనా? " అన్నా.

"సుమా! కోపం తెచ్చుకోకు. నాకు మా నాన్నంటే భయమని చెప్పా. నన్నొక మని షిగా నా వ్యక్తిత్వాన్ని గౌరవించిన మొదటి వ్యక్తివి నువ్వే. నేను స్థిరపడగానే రిజిస్టరు మ్యారేజి చేసుకుందాం. అంతవరకు ఓపిక పట్టు. ఇక వాళ్లెవ్వరూ మనల్ని ఏమి చెయ్యలేరు" అన్నారు.

"కని పెంచిన తల్లిదండ్రులను మోసం చేసి దొంగతనంగా పెళ్లి చేసుకోవడం నాకిష్టం లేదు. వాళ్ల అనుమతితో జరి గితేనే మనకు శుభమవుతుంది. వాళ్లె ప్పుడూ మన శ్రేయోభిలాషులే. ఒకవేళ వాళ్లు అంగీకరించకపోతే ఎవరికి వారమే. అంతేకాని పిరికిదానిలా ఆత్మహత్య చేసు

కోను" అన్నా స్థిరంగా.

"అమ్మో! అంత మాట అనకు సుమా! నిన్ను వదులుకోవటం నాకు మాత్రం ఇష్టమా? ఈ లోపల ఆలోచిస్తాను" అన్నారు.

తర్వాత ఆయన స్టేట్స్‌కు వెళ్ళడం జరిగింది. స్టేట్స్ నుంచి రాగానే నన్ను కలుసుకుంటా అని రాశారు. నేను ఎంతో ఎదురు చూస్తున్నా. ఇదుగో ఆ కలుసుకోవడం మా ఫ్రెండ్ నాకిచ్చిన ఈ శుభలేఖ దయ వల్ల.. ఇప్పుడు మీ ముందున్నా. నేను మా నాన్నకు కూడ చెప్పకుండా టైం అయిపోతోందని అడ్రసు వెతుక్కుంటూ ఒక్కదాన్నే డ్రైవ్ చేసుకుంటూ వచ్చా" అంటూ గుక్క తిప్పుకోకుండా చెప్పి భారం తీరినట్టయి ఊపిరి పీల్చుకున్నా.

ఇంతలో వాకిట్లో కారాగిన చప్పుడవడం, 'సుమా! సుమా!' అంటూ ఆత్రుతతో నాన్న గొంతు. వెనకాలే మా పక్కింటివాళ్లు పెళ్లి మండపంలోకి ప్రవేశించారు.

"సుమా! ఏమిటమ్మా ఇదంతా? నా కంతా అయోమయంగా వుంది మీ ఫ్రెండు చెప్పేసరికి. మన పక్కింటి వాళ్లను తోడు తీసుకొని నువ్వేం అఘాయిత్యం చేస్తావోనని భయపడుతూ వచ్చానమ్మా. నిన్ను చూసేక నాకు ధైర్యం వచ్చింది" అంటూ బిడ్డ దొరికిన ఆనందంలో మాట్లాడుతున్నారు నాన్న.

ఇంతలో రమణ తండ్రి వచ్చి "లోపలికి రండి. మాట్లాడుకుందాం. మిమ్మల్నెక్కడో చూసినట్టుందే? మీరేమి కంగారుపడ వద్దు. ఎలా జరగవలసి వుంటే అలా జరుగుతుంది. మనం నిమిత్తమాత్రులం" అన్నాడు.

"మా సుమ గారాబంవల్ల ఏం చేసిందో ఏమోనని హడలిపోతూ వచ్చాను. కొంచెం పెంకితనం కూడ వుంది. పొగాకు బోర్డు మీటింగులో చూసి వుంటారనుకుంటా" అన్నారు నాన్న.

## కొత్తగాలి...

**ఇంతమందిలో ఒంటరితనం**
**అంటరానివాడిలా శాపమా?**
**నో సార్!**
**'నా' అనే స్వార్థం**

–పెరుకరాజు,
నర్సింగాపూర్, కరీంనగర్ జిల్లా

"ఇంత రాత్రిపూట ఒక్కతే నిర్భయంగా కారు నడుపుకుంటూ వచ్చి తన సమస్యను తానే పరిష్కరించుకోవాలన్న తెగువ చూపినందుకు మీ అమ్మాయిని అభినందిస్తున్నా. నేను పిల్లలను గారాబం చేస్తే ఎక్కడ చెడిపోతారోనని, వాళ్లకు లోకం తెలీదు కాబట్టి మన నిర్ణయాలకు వారు కట్టుబడివుంటారని భావించా. క్రమశిక్షణ పేరుతో వారితో చనువుగా మెలగలేక పోయా. అందుకనే మేమంతా ఒక ఇంట్లోనే వున్నా కూడ నన్నేదో పులిగానో, సింహంలాగో భావించి అజ్ఞలు పాటిస్తున్నారేకాని వారి మనసులోని మాట చెప్పలేకపోతున్నారని ఇప్పుడే గ్రహించా. మా ఆవిడ చాదస్తపు మనిషి. ఎప్పుడూ గుళ్లు గోపురాలు, ఉపవాసాలు తన లోకంలో తనుంటుంది. మావాడు నాతో ఒక్కమాట చెప్పివుంటే ఇంత దూరం వచ్చేదికాదు. పిల్లలు సుఖంగా కలసి కాపురం చెయ్యాడమేకదా మనకు కావలసింది. కాలంతోటే మనమూ మారాలి. వెంటనే ముహూర్తం వుంది. సరేనా అమ్మా? " అంటూ నావైపు, నాన్నగారి వైపు చూశారు.

రమణ చెప్పినంత కఠినంగా లేరే ఈయన అని నేను అనుకొంటుండగానే నాన్న లేచి, ఆయన రెండు చేతులు పట్టుకొని "బావగారు! మీరు పెద్ద మనసు చేసుకొని మా అమ్మాయిని మీ యింటి కోడ

లిగా చేసుకుంటున్నందుకు మీకు రుణపడి వుంటాను. పిల్లల తప్పులు సరిదిద్దడమే పెద్దవారి పని. నాకు ఒక్కతే కూతురు. ఆమె పేరున బిజినెస్ అంతా జరుగుతోంది. ఆమె మా కంపెనీకి మేనేజింగ్ డైరక్టరు కూడ. ఇక బాధ్యతంతా మీదే" అన్నారు.

ఇదేదో సినిమా సీను ఇక్కడ జరుగుతున్నదేమిటా? ఇదేమైనా షూటింగా అన్నట్లు చూస్తున్నారు జనం. ఇంత శుభప్రదంగా ముగుస్తుందని ఊహించినట్టు లేదు. 'ఏదో రసాభాస జరుగుతుంది. తలా ఓ రాయేద్దాం' అన్నట్లున్నాయి హావభావాలు.

వెంటనే నేను తేరుకొని "మామయ్యగారు! అందరూ మీలాంటి విశాల భావాలు గల తండ్రులుంటే పిల్లల భవిష్యత్తు నందనవనం అవుతుంది. లైలా మజ్నూలు, సలీం అనార్కలీలు, పార్వతీ దేవదాసులు వునరావృతం కారు" అంటూ పాదాభివందనం చేశా.

"నాకు ఒక్కటే దిగులుగా వుందమ్మా. పీటలమీద పెండ్లి ఆగిపోయిన అమ్మాయిని ఎవరు చేసుకుంటారు? ఆయనకు నా మొహం ఎలా చూపించేదా అని ఆలోచిస్తున్నా" అన్నారు.

ఇంతలో "బాబాయ్ శిరీష వాళ్ల నాన్నను మీరు ఒప్పిస్తే నేను ఈ క్షణంలో శిరీషను చేసుకోవడానికి సిద్ధమే" అన్నాడు ఆవేశంలో బంధువర్గంలోని ఓ అబ్బాయి.

"మీరు, మీరు బంధువులేకదా? మరి ఆయన ఎందుకు వద్దంటాడు. నీవు సాఫ్ట్‌వేర్ ఇంజినీరుగా బాగా సంపాదిస్తున్నావుగా" అన్నాడు అర్థం కానట్లు.

"అంతస్తుల తేడా. ఆయనతో పోలిస్తే మా ఆస్తి తక్కువ కదా. స్టేటస్ చూస్తున్నాడాయన" అన్నాడు.

"మరి శిరీషకు ఇష్టమో కాదో కనుక్కున్నావా? " అన్నారు ఆరాగా.

"శిరీషకు ఇష్టమేనని వాళ్ల చెల్లిద్వారా కబురంపింది" అన్నాడు.

"మరి ఇందాకనే చెప్పావు కాదేమి? నేను ఆయనతో మాట్లాడుతాను. నీవు కూడ మీ వాళ్లతో చెప్పు" అన్నారు.

అందరూ సమావేశమై చర్చించుకొని ఒప్పుకున్నారు.

'మేరేజస్ ఆర్ మేడ్ ఇన్ హెవెన్' అని పూర్కే అనలేదని కొందరు, 'శిరీష అదృష్టవంతురాలు. నిముషంలో డాక్టరుగారి శ్రీమతి కాబోయి, ఇంజనీరు శ్రీమతి అయింది' అని కొందరు, 'శిరీష, ఆ అబ్బాయి ప్రేమించుకున్నారు' అని కొందరు అంటున్నారు. నాకు ఇవేమి పట్టలేదు. నా జీవితం చివరి క్షణంలో గాడిన పడిందని తృప్తిపడ్డా. ఎంత గందరగోళమవుతుందో, ఏమి తిడతారో, నాన్న ఏమంటారోనని ఒకటే టెన్షన్.. టెన్షన్.. టెన్షన్... కాదంటే అని ఆలోచించలేక పోయా. 'ఒక పెళ్లి చూద్దామని వచ్చి రెండు పెండ్లిళ్లు చూస్తున్నాం' అని కొందరు, 'అమ్మో! ఈమె గడుసుదే' అని కొందరు అంటున్నారు.

ఈ లోపల రమణ పిల్లిలా వచ్చి "సుమా! ఆ శుభలేఖ పోస్ట్‌చేయించింది నేనే. ఆ అమ్మాయి చేత నిన్ను యిక్కడకు రప్పించడానికే అలా చేశా. నాకు దిక్కుతోచలేదు. నేను అమెరికానుండి వచ్చిన నాలుగోరోజే పెండ్లి. భగవంతుని దయ వల్ల మనం కలిశాం. తర్వాత శిక్షిద్దువులే" అంటూ చెవిలో నెమ్మదిగా చెప్పి జారుకున్నాడు.

నేను ఈ మాత్రం ధైర్యం చెయ్యకపోతే రమణ దక్కేవాడు కాదేమో? మేం స్టేట్స్‌కు వెళ్తున్నాం. నేను ఉద్యోగానికి రిజైను చేశాను. మరల రెండు మూడు సంవత్సరాల తర్వాత వస్తానేమో. అక్కడికి వెళ్ళాక విశేషాలతో ఉత్తరం రాస్తాలే.

## కొత్తగాలి...

### ఆమె నవ్వింది వెన్నెల వాన కురిసింది!!

-ఎస్.శివనాగేశ్వరరావు,
తెనాలి

మీ శ్రీవారిని, పిల్లలను అడిగినట్లు చెప్తావు కదూ! ఉండనా మరి!

నీ సుమ

ఆ ఉత్తరం చదివాక 'మా ఫ్రెండ్స్ అందరూ ఫరవాలేదు.. జీవితంలో స్థిరపడ్డట్టే' అనుకున్నా.

★ ★ ★

పిల్లలకు సంక్రాంతి సెలవులిచ్చారు. ఎక్కడికైనా వెళ్దామని ఒకటే గోల. పిల్లలు పుట్టాక అమ్మమ్మ, తాతయ్య పల్లెటూరి నుండి రావడమేగాని, మేం ఎప్పుడూ పోలేదు. వాళ్లు ఎప్పుడూ పిలుస్తూనే ఉంటారు. చిన్నప్పుడూ నేను ఎలిమెంటరీ స్కూలు నుండి ఏడో తరగతి వరకు తాతయ్య దగ్గరే ఉండి చదువుకోవడం వల్ల ఆ ఊరితో నాకు అనుబంధమెక్కువ. ఆయన పట్నంలోనే పుట్టి పెరగడం వలన పల్లెలను సినిమాల్లోనూ, టి.విలోను చూడటం తప్పితే పల్లెటూరు గురించి తెలియదు. అందుకని వస్తారో రారోననో సందేహం. చివరకు పిల్లల గోల పడలేక తాతయ్య వాళ్ల ఊరు వెళతామనేసరికి ఆయన "నేను ఎప్పుడూ పల్లెటూరు చూడలేదు. ఆఫీసు పనిలో రొటీన్ లైఫ్ విసుగ్గా ఉంది. ఒకవారం సెలవు పెట్టి నేనూ వస్తాను" అన్నారు.

ఇంకేముంది? నాకు ఏనుగెక్కినంత సంతోషమై తాతయ్యకు రోడ్డు దగ్గరకు బండి పంపమని, మేం వస్తున్న తేదీ అన్నీ వివరంగా ఉత్తరం రాశాను. ఇక మరుసటి రోజునుండి షాపింగుతో నేను బిజీ. తాతయ్యకు ఖద్దరు పంచెలు, అమ్మమ్మకు గద్వాలు చీర, పూజా మందిరంలో అమర్చడానికి సిరీస్ బల్బుల సెట్టు తీసుకున్నా. నేను చాలారోజుల తర్వాత వెళ్తున్నా కాబట్టి కొన్ని వాడిన మధ్య రకమైన చీరలు, పిల్లల గుడ్డలు ఆయనవి కలిపి ఒక సూట్ కేస్‌కు సర్ది పెట్టా, అక్కడ పనివారికి వ్వడానికి.

"మీ తాతగారి ఊరికి ప్రయాణమంటే మీ పుట్టింటికంటే ఎక్కువ సంబరపడుతున్నావే" అంటూ పరిహాసమాడారు ఆయన.

"నేను పెండ్లయి పిల్లలు పుట్టాక ఇప్పటిదాక వెళ్ళలేదు. చిన్నప్పుడు నాతో ఆడుకున్నవాళ్లు, అక్కడ పరిచయస్తులు, అత్తయ్యలు, మామయ్యలు అందరినీ చూస్తాను.. నేను పెరిగిన ఆ పరిసరాల పల్లె సౌందర్యాన్ని మీకు చూపాలి" అన్నా.

పిల్లలు కూడ ఎప్పుడెప్పుడు వెళ్దామని ఎదురు చూస్తున్నారు. ఆరోజు రానే వచ్చింది.

అగ్రహారం దగ్గర బస్సు దిగి బండి కోసం ఎదురుచూస్తున్నాం. ఎద్దుల మువ్వల చప్పుడు, 'హేయ్, హేయ్' అనే తాతయ్య అదిలింపు విన్పించింది. ఆగగానే ఎద్దులను, బండి అలంకరణను పిల్లలు ఆశ్చర్యంగా చూస్తున్నారు.

"బాబూ! మీరొచ్చి చాలా సేపయిందా? " అంటూ ఆయనను, "అమ్మడూ! చిక్కిపోయావే? పిల్లలు బాగా అల్లరి చేస్తున్నారా? మీ అమ్మమ్మ చేతివంటతో నీవు మారిపోతావులే" అని నన్నూ అన్నారు.

"అమ్మాయిగోరూ! సాన్నాళ్ళకి మిమ్మల్ని సూత్తున్నానండి. తాతయ్యగార్కి మీరొస్తున్నారని కబురందినకాడి నుండి బండికి గూడు కట్టి, మెత్తలాగ బండిలో గడ్డి పరిచి, తిరునాళ్ళలో కొన్న పూసల పేర్లు

తగిలించారండి. రాముణ్ని, లక్ష్మణుడిని చూడండి! మువ్వల పట్టీలు మైలుదూరం వినిపిత్తాయి" అంటూ పాలెగాడు తాతయ్య హడావుడి గురించి చెప్తున్నాడు.

"ఒరే నారిగా! కబుర్లు యిప్పుడే అన్నీ చెప్పేస్తే, వూరికి బొయ్యాక అమ్మాయిగారికి చెప్పడానికి ఏం మిగలవు. పదరా.." అంటూ పిల్లలను, సామాను బండిలోకెక్కించి "అమ్మడూ! ఈ స్టూలుమీద కాలు బెట్టి బండెక్కు. చక్రం మీదుగా బండెక్కడం మరిచిపొయ్యవేమోనని మీ అమ్మమ్మ నేను వద్దనేకొద్ది స్టూలు బండిలో పెట్టింది" అన్నాడు తాతయ్య!

బండి సాగుతుంటే గోధూళివేళ అస్తమిస్తున్న ఎర్రని సూర్యబింబం నీడ చెరువులో పడి వింతకాంతినిస్తోంది. పశువుల కాపరులు పశువులను తోలుకుపోతూ పాడుకునే పల్లెపదాలు గాలిలో తేలివస్తూ చెవికి సోకుతున్నాయి. మరొకవైపు ఆహారాన్వేషణ పూర్తయి తమ పిల్లల కోసం గూటికి వెళ్లే పక్షుల కిలకిలారావాలు, అక్కడక్కడ విరగబూసిన పచ్చని తంగేడు పూలు వింత అందాన్నిస్తున్నాయి ఆ పరిసరాలకు. తాతయ్య గుక్క తిప్పుకోకుండా కబుర్లు చెపుతూనే వున్నాడు.

"కర్రావు ఈనింది. కోడెదూడ పుట్టింది. బుజ్జిముండ ఎంత ముద్దొస్తోందో. నీవు చూద్దూలే"

ఊర్లోకి బండి ప్రవేశిస్తుండగానే.

"శాంతమ్మా! బాగున్నావా? చాలా రోజుల తర్వాత తాతయ్యగారి ఊరిమీద మనసు పోయిందే" అని ఒకరు.

"పిల్లలు కడిగిన ముత్యాల్లా వున్నారు. మా శాంతమ్మ అదృష్టవంతురాలు" అని మరొకరు.

"శాంతమ్మా! పది రోజులయినా వుండాలి. ఇటొచ్చి అటుపోతానంటే ఊరుకోనేది లేదు" అంటూ దారి పొడుగునా ఇల్లు చేరేదాక పల్లెటూరి ఆప్యాయతతో కూడిన పలకరింపులు మనసునెంతో తేలిక పరిచినట్టయ్యింది.

"శాంతమ్మా! నీకు ఈ ఊళ్లో చాలా పలుకుబడి వుందే. ఈ దీనుణ్ణి మాత్రం మరిచిపోవాకు. అసలే నోరులేని పిల్లలు" అంటూ ఆయన నాటకీయంగా అంటుంటే పిల్లలూ, మిగిలిన వాళ్లూ నవ్వారు.

నేరేడు పండురంగు మాధవరం జరీచీరలో, పసుపు పూసిన ముఖంలో నుదుట ఎర్రనబొట్టు, కొప్పులో కస్తూరి పట్టెలు, మరువం, బంతిపూలు కట్టిన దండ తురుముకొని అమ్మమ్మ హడావుడిగా "చాలా రోజులయిన్నట్టుందే నిన్ను చూసి" అంటూ కాళ్ళు కడుక్కోగానే అందరికీ కంచుగ్లాసులో చిక్కటి మీగడ పాలిచ్చింది.

"అబ్బ! ఇలాంటి మీగడపాలు తాగి ఎంతకాలంమయిందో" అని శ్రీవారు లొట్టలేస్తూ పాలు తాగుతుంటే పిల్లలు నవ్వుతున్నారు. హాలులో ఉయ్యాల బల్ల చూడగానే ప్రయాణ బడలిక ఎగిరిపోయింది.

"డాడీ! మీరు కూడా రండి. మధ్యలో కూర్చోండి ఊగుదాం" అంటూ ఆయన్ను బలవంతంగా లాక్కెళ్లారు పిల్లలు.

"అమ్మాయి! దొడ్లో కాగులో నీళ్లు కాగుతున్నాయి. మంగమ్మ తోడిస్తుంది స్నానాలు చెయ్యండి" అంది అమ్మమ్మ.

మెల్లగా పిల్లలకు నచ్చజెప్పి స్నానానికి పిలుచుకు వస్తే- "మమ్మీ! బాత్‌రూమ్ ఏది? ఎక్కడా కన్పించదేం? " అంది పాప.

"ఇదే బాత్‌రూమ్" అంటూ తడికలతో కట్టిన దడి దగ్గరకు తీసుకువస్తే "ఇదేంటి? పైన అంతా కన్పిస్తుంటే ఆరుబయట స్నానంలా వుందే" అని నసపెడ్తూనే ఎలాగో పూర్తికానిచ్చింది. ఇప్పుడిప్పుడే ఆ ఊర్లో పట్నం వాసనలు వస్తున్నాయనేందుకు గుర్తుగా కరెంటు దీపాలు,

ప్రతి ఇంట్లో టీవి డిష్‌లు, నైటీలేసే అమ్మాయిలు కన్పిస్తున్నారు.

కుమ్ములో కాల్చిన వంకాయ పచ్చడి, లేత చిక్కుడు కాయల కూర, మునక్కాయల సాంబార్, వెన్నకాచిన నెయ్యి, మీగడ పెరుగుతో భోజనం చేసి ఆరుబయట మంచాలేసుకొని కబుర్లు చెప్పుకుంటుంటే ఎప్పుడు నిద్రపట్టిందో తెలియలేదు. ఇంటి దగ్గర టీ.వీ. చూస్తూ ఛానల్స్ పెట్టుకోవడంలో ఇద్దరు పోటీపడుతూ పదకొండు గంటలకు కాని పడుకోని పిల్లలు ఆ చల్లగాలికి తాతయ్యా కబుర్లు వింటూ ఊ కొడుతూనే జోల పాడినట్టుగా నిద్రపోయారు.

తెల్లవారుజామున లేగదూడలు పాలకోసం అంబా అంబా అనే అరుపులు, వాటిని పట్టుకోవడానికి పాలెగాండ్ర అరుపులు, మంగమ్మ కసువు ఊడుస్తున్న చప్పుడు, అమ్మమ్మ మజ్జిగ చేస్తున్న కవ్వం చప్పుడు విన్పిస్తుంటే, చల్లని చిరుగాలి ఒంటికి తగులుతోంది. ఇంకొంచెం సేపు ఆ శబ్దాలను వీనుల విందుగా వింటూ దుప్పటి ముసుగు పెట్టి పడుకుందామనుకున్నా. మా పిల్లలు ఎప్పుడు లేచారో ఏమో కోడెదూడ చిక్కకుండా పరుగెత్తుతుంటే దాని వెంబడి వీళ్ళూ పరుగెడుతున్నారు. ఇంటి దగ్గర స్కూలుకు టైమయిపోతుంది, బస్సు వస్తుంది అని ఎంత అరచి గీపెట్టినా మంచం దిగని పిల్లలు తూర్పు తెల్లారకముందే లేచారు. తాతయ్యా పూజ అయిపోయిందన్నట్టు గుర్తుగా సాంబ్రాణి కడ్డీల వాసన వచ్చింది. కర్పూర హారతి ఇస్తున్నప్పుడు గంట మోగే శబ్దం విన్పిస్తుంది. తీసిన పాలను దేవుడికి నైవేద్యం పెట్టనిదే వాడకకు తీసుకోనివ్వరు. ఆయన ఊరెళ్ళినప్పుడు ఆ డ్యూటీ అమ్మమ్మది.

"అమ్మో! అమ్మమ్మ వస్తే అరుస్తుంది" అనుకుంటూ మంచం దిగా. ఉదయం అందరం పాలు తాగి తాతయ్యతోపాటే మామిడి తోపుకు వెళ్ళాం. తోపుకు పక్కనే దిగుడుబావి వుంది. ఆ బావి నుండి ఏతాముతో నీళ్ల తోడుతుంటే పిల్లలు ఆశ్చర్యంగా చూస్తూ యక్షప్రశ్నలు వేస్తున్నారు. మామిడి చెట్టుకొమ్మ ఒకటి పెద్దది కొంచెం క్రిందకి వంగి వుండేది చిన్నప్పుడు. దానిని పట్టుకొని ఉయ్యాలూగుతూ వుండేవాళ్ళం. పిల్లలు ఆ చెట్టు చూపిస్తే వాళ్ళు కొద్దిసేపు ఉయ్యాలలూగారు. 'కోతి కొమ్మచ్చి' ఆడిన చెట్టు చూపిస్తూ చిన్న చెరువు దగ్గరకు వచ్చేసరికి పిల్లలు ఈత కొడుతున్నారు.

"మాకు ఈత నేర్పండి తాతయ్యా" అన్నారు.

"రేపు ఉదయమే దానికి కావలసినవి తెచ్చి నేర్పుతా"నంటూ తాతయ్య వాళ్ళని బుజ్జగించి తీసుకొచ్చాడు. చేలో పిల్లిపెసర కాయలు కనిపిస్తే తాతయ్య వలిచి పిల్లలకు పెడితే "అబ్బ! భలే వున్నా"యంటూ యింకొన్ని కోశారు.

"ఒరేయ్ అది మన చేనుగాదు, రెడ్డిగారిది. కోయగూడదు" అని తాతయ్య చెబుతుంటే అప్పుడే పనిలోకి వస్తున్న వాళ్ళ పనివాడు "సామి వాల్లకేం తెల్సు? కూసినే గదా! పోనీలేండి" అన్నాడు.

మేము చిన్నప్పుడు వినాయకచవితికి ఈ చెరువు బంకమట్టి తెచ్చి రాళ్లు ఏరి నానబెట్టి మూడు ముద్దలుగా చేసే వాళ్ళం. అన్నింటికన్న పెద్ద ముద్ద వినాయకుని బొజ్జ. దానికో రంధ్రం మధ్యలో పెట్టి బొడ్డులో పావలా కాసు పెట్టేవాళ్ళం. తర్వాతది వినాయకుడి తల, తొండము చేసి అతికించే వాళ్ళం. చివరిది కాళ్ళు చేతులు. ఎంతో కష్టపడి మొత్తంమీద వినాయకుడి ఆకారం రప్పించేవాళ్ళం. రెండు రోజుల ముందే మోవి తాటాకు

తెచ్చి బండకింద పెట్టి మరుసటిరోజు గొడుగు తయారుచేసేవాళ్ళం. సాయంత్రం అందరం పొలాల వెంబడి తిరిగి ఎవరికి చిక్కినంత వాళ్ళు గరిక, జిల్లేడు ఆకులు, పూలు, కాయలు, వెలగకాయలు, పేము పండ్లు, తుమ్మిపూలు, పొగడపూలు, మామి డాకులు పెద్ద గంపనిండా సేకరించే వాళ్ళం. అందుకే మా ఎలిమెంటరీ స్కూలుకి వినాయక చవితికి రెండు రోజులు సెలవులిచ్చేవారు. మా పిల్లలకు చేతినిండా పనే. స్వంతంగా తయారు చేసుకున్నవి చూసుకుంటే వుండే తృప్తి వేరు. ఆ సరదానే వేరు" అని చెప్తుంటే,

"మీరేం అనుకున్నారు? మీ అమ్మ చాలా అసాధ్యురాలు. ఆమె సాహస కృత్యాలు, గొప్పదనం చూపటానికే మనల్నిక్కడికి తెచ్చింది" అన్నారు ఆయన పరిహాసంగా.

అప్పుడే వేడివేడిగా చేస్తున్న పెసరట్లతో, మినప పచ్చడిలో... నెయ్యి వేసుకుని తింటుంటే ఎంత బావున్నాయో!

"భోషాణంలో బొమ్మలన్నీ మట్టికొట్టు కొని వున్నాయి. తీసి ఎన్నాళ్ళయిందో? మీరు వచ్చారు కదా! బొమ్మల కొలువు పెట్టండి. పిల్లలకు సరదాగా వుంటుంది. కాలక్షేపం కూడా" అంది అమ్మమ్మ.

ఆమె అనడమే తడవు పిల్లలు మంగ మ్మను పిలిచి భోషాణం తెరిపించి బొమ్మ లను తుడవడం మొదలుపెట్టారు. నేను, ఆయన కలిసి పాత బెంచీలను, పెట్టెలను వరుసలో పెట్టి అంతస్తులుగా చేసి పాతవి తెల్లటి పంచెలను పరచి బొమ్మలను ఒక్కొక్క అంతస్తులో ఒక్కోరకం వచ్చేట్టు పెట్టాం. సీతా స్వయంవర ఘట్టం బొమ్మ లన్నీ మొదటి అంతస్తులో ముక్కోటి దేవ తలు హాజరయినట్లు దేవతల బొమ్మలన్నీ రెండో అంతస్తులో పెట్టాం. ఒక 'బొమ్మ' ను చూసి పిల్లలు నవ్వుతూ "దీని పేరే మిటి? " అన్నారు. "సుబ్బిశెట్టి" అని

## కొత్తగాలి...

**మందమతులు చతురోక్తుల**
**అందాలను తెలుసుకోరు**
**చతురమతులు మధురోక్తుల**
**అందాలను వదులుకోరు**

-రేగులపాటి కిషన్‌రావు,
సంతోష్‌నగర్, కరీంనగర్

చెపుతూ, "పల్లెల్లో చిన్న కొట్లో శెట్టి ఉప్పు, చింతపండు, మిరపకాయలు మొదలైన సామాన్లు అమ్మేవాడు. దానికి గుర్తుగా దీనిని బొమ్మల కొలువులో పెట్టి అతని దగ్గర త్రాసు, చుట్టూ ఈ వస్తువులు పేర్చు తారు" అన్నా. వెంటనే ఆ ఏర్పాటులో మునిగిపోయారు. గోడకు పక్కగా ఇసుక పోసి వెడల్పుగా చేసి చుట్టూ ఆవాలు చల్లాం. అవి నాలుగు రోజులకు మొలక లొచ్చి అందంగా తయారయ్యాయి. పులి, సింహం, ఏనుగు మొదలైన జంతువులన్నీ ఒక పక్కగా పెట్టి చీపురు పుల్లలను బెట్టి బోనులాగా చేసి 'జూ' అనే బోర్డు తగిలిం చారు. స్టీలు పళ్ళెంలో నీళ్ళుపోసి బాతులు, చేపలు, తాబేలు బొమ్మలు వేశారు. ఒక చిన్న పడవను తెచ్చి మా పాప అందులో పెట్టి 'బోట్‌షికార్' అని పెట్టింది. బొమ్మ లకు రోజుకోరకమైన వస్త్రధారణ చేస్తూ, మధ్యలో అమ్మమ్మను సలహా అడుగుతూ మా అమ్మాయి బిజీ అయిపోయింది. మావాడు పార్కులో రోజుకో కొత్తరకం బొమ్మ పెట్టాలని వాళ్ల నాన్న సలహాతో కాగితంతో బొమ్మలు చేసి వాటికి రంగులు వేసి పుల్లలకు గుచ్చి పార్కులో నిలబెడు తున్నాడు. ఎప్పుడూ టీ.వీల కతుక్కు పోయి, ఏ పని చెప్పినా పరధ్యాసగా, విసుగ్గా వుండే పిల్లలేనా వీళ్ళు అని నా కన్పించింది. ఆయన కూడా పిల్లల్లో ఒక డిగా కలిసిపోయి ఎంజాయ్ చేస్తూ ఉత్సా

## కొత్తగాలి...

**లెక్క కలిస్తే**
**పనితనం**
**పక్క తడిస్తే**
**పసితనం**

-గరిపుర్తి రాజేంద్ర,
భికనూర్, నిజామాబాద్

హాపరుస్తున్నారు. పిల్లలలో యిన్ని ఆలోచనలు, సృజనాత్మకత వుందా? అని నాకన్పించింది. మన సిటీలైఫ్‌లో వాటిని మనమే అణగదొక్కుతున్నామేమో నన్పించింది. ఇంత ఉత్సాహంగా పిల్లలను ఈ మధ్యకాలంలో చూడలేదు. అందుకే ప్రతి వేసవి సెలవులకయినా నాలుగు రోజులు వచ్చి తాతయ్య దగ్గర వుండాలని నిర్ణయించుకున్నా. రోజూ ఊళ్లో అందరినీ పేరంటానికి పిలిచి రావడం మా అమ్మాయి డ్యూటీ. యిలా రోజుకోరకం ప్రసాదం తయారు చెయ్యడం అమ్మమ్మ పని. ఆయన, పిల్లవాడు ప్రసాదాలను పొట్లాలు కట్టేవారు. నా పని వచ్చిన వారందరిని పలకరించడమే. బొట్టు పెట్టి, తాంబూలం ఇవ్వడం అమ్మాయి పనే. పెద్దలు 'బొమ్మల కొలువులో' ఏర్పాటు చేసిన ఈ సంప్రదాయం మన తరువాతి తరమైన మన పిల్లలకు మన ఆచారాలను, సంస్కృతిని తెలియచెబుతుంది. సమాజంలో నలుగురితో కలుపుగోలుగా ఎలా ప్రవర్తించాలో నేర్పుతుంది. నేటి నాగరికత జీవన శైలిలో 'బొమ్మల కొలువు' అదృశ్యమై, బొమ్మలు అలంకారప్రాయమై 'స్టాటస్ సింబల్‌గా' షోకేసుల్లో దర్శనమిస్తున్నాయి. అమ్మమ్మ చేసిన ప్రతి పిండి వంటా మా పిల్లలకు, ఆయనకు ఆశ్చర్యమే. ఎందుకంటే రెడీమేడ్‌గా తెచ్చిచేసే పిండి వంటల రుచే వేరుకదా.

మా బంధువులింటికి భోగి పండ్ల పేరంటానికి వెళితే మా పిల్లలు "అమ్మా! అలా చిన్న పిల్లాడి నెత్తిమీద రేగుకాయలు, డబ్బులు, చెరుకు ముక్కలు పోస్తే నొప్పి పుట్టదా? " అని ఒకరు.

"ఎందుకమ్మా? అలా పోస్తారు? " అని మరొకరు ప్రశ్నలపై ప్రశ్నలు.

"చిన్న పిల్లలుండటం యింట్లో అందరికీ సంబరం. ఆ ఆనందాన్ని నలుగురితో కలిసి పంచుకోవాలి, పదిమంది ముత్తైదువలు ఆశీర్వచనాలు పిల్లలకు బాలారిష్ట దోషాలు తొలగించి 'దిష్టి' తగలకుండా చేస్తాయని పెద్దల నమ్మకం" అన్నా.

"అమ్మా! తాతయ్య వసారాలో మామిడి ఆకుల తోరణాలతో పాటు మంగమ్మతో కట్టించాడే వాటినేమంటారు? " అన్నాడు మా అబ్బాయి కుతూహలంగా.

"సంక్రాంతికి పంట పండి ఇంటికి వస్తుంది. పొలాల్లో ఉన్నప్పుడు పక్షులకు అక్కడున్న కంకులు ఆహారంగా వుండేవి. వాటిని కోసుకొచ్చాక వాటికి ఆహారం లభించదు. మనకు పంట పండినందుకు కృతజ్ఞతగా పశు పక్ష్యాదులకు ఆహారం అందించడం, వాటిని పూజించడం ఈ పండుగలో ప్రత్యేకత. అందుకే తోరణాల్లా ధాన్యపు కంకులను వసారాలో కడితే వాటికై వచ్చే పక్షుల కిలకిలారావాలు మనస్సుకు ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. సాటి ప్రాణుల పట్ల ప్రేమతో మెలగండి అని చెప్పడం కూడా పండుగ ఉద్దేశం" అన్నా.

పెద్ద పండుగ రోజు అందరము తలస్నానం చేసి గుడికి వెళ్లి వచ్చాము. మేము వచ్చేసరికి అమ్మమ్మ నేను తెచ్చిన కొత్త చీరకట్టుకొని వాకిట్లో అరుగుమీద గంపెడు అరిశలు పక్కన పెట్టుకొని సేద్యగాండ్లకు కొత్తబట్టలు, అరిసెలు యిస్తున్నది. దారిన పోయేవాళ్ళను కూడా పిలిచి అరిసెలు యిచ్చింది.

మా అమ్మాయికి రానే వచ్చింది అనుమానం. "అమ్మా! మన ఊళ్ళో బిక్షగాళ్లను కసిరి పంపిస్తాం కదా! వీళ్ళు పిలిచి పాత గుడ్డలు, అరిసెలిస్తున్నారే? ఈరోజే ఇట్లా యిస్తారా? రోజూనా? " అంది.

"పెద్ద పండుగరోజు మనకున్నదానిలో కొంత ధర్మం చేస్తే పుణ్యలోకాలు ప్రాప్తిస్తాయని నమ్మకం. అందుకని కొత్తగా పండిన బియ్యం, బెల్లం కలిపి అరిశెలు చేసి శక్తికొద్ది పంచిపెడతారు. మన దగ్గర పనిచేసినందుకు కృతజ్ఞతగా సేద్యగాండ్లకు, పనివాళ్లకు బట్టలు, వడ్లు యిస్తారు" అన్నా.

చాలా సేపటినుండి నేను పిల్లలకు వివరిస్తున్నవన్నీ వింటున్న ఆయన "మీ అమ్మకు పల్లెను చూసేసరికి 'బి' కాంప్లెక్సు టానిక్ తాగినంత ఉత్సాహమొచ్చి మనందరినీ ఉపన్యాసాలతో చంపేస్తున్నది. అమ్మో! శాంతీ! యిక్కడికి వచ్చాక గడగడా వాగేస్తున్నావ్. ఇలా అయితే మన ఊరు వెళ్ళాక నా పని గోవిందో? గోవింద" అంటూ అభినయించి చెప్తుంటే అమ్మమ్మ, తాతయ్య నవ్వులే నవ్వులు!

"అమ్మడూ! సాయంకాలం అందరం పెద్ద వేపచెట్టు దగ్గర గ్రామ చావిడి దగ్గరకు వెళ్దాం. మీరు కొత్త బట్టలు కట్టుకొని తయారుగా వుండండి. పోదాం" అన్నారు తాతయ్య.

"అయ్యో! నా మతి మండిపోనూ!" అంటూ అమ్మమ్మ.

"అమ్మడూ! నువ్వూ, పిల్లలు, ఆయన దేవుడి గది దగ్గరకు రండి" అంటూ పిల్చుకుపోయింది.

"దేవుడికి దణ్ణం పెట్టుకోండి" అంటూ పెద్ద పళ్లెంలో నాకు కంచిపట్టు చీర, పాపకు కంచిపట్టు పావడా, బాబుకు, ఆయనకు ప్యాంటు, షర్టు యిచ్చి, "సాయంత్రం కట్టుకోండి" అంది.

"ఎందుకు అమ్మమ్మా యిప్పుడివన్నీ? ఈ వూరికి వచ్చి చాలారోజులయ్యిందని, ఆయనకు సెలవు దొరికిందిగదా అని వచ్చాం" అన్నా.

"మీ మామయ్యలంతా సప్తసముద్రాల ఆవల వున్నారు. ఎప్పుడొస్తారో తెలియదు. ఎన్నాళ్ళుంటారో తెలియదు. మీరే గదా మాకు దగ్గరగా వున్న పిల్లలు. పిల్లల్ని, నిన్ను కనుల పండువగా చూసుకున్నాం. మీ అమ్మావాళ్ళు వేరే రాష్ట్రంలో వుండి రాలేకపోతుండిరి. మావి చాదస్తాలు అని కొట్టిపారేయకండి" అంది ఆవేదనగా అమ్మమ్మ.

సాయంత్రం అందరం కొత్తబట్టలు కట్టుకొని అమ్మమ్మ, తాతయ్య కాళ్ళకు దణ్ణం పెడుతుంటే వారి కళ్ళల్లో ఎంతో తృప్తి కన్పించింది. పాపాయికి పట్టు పావడా అతికినట్టు సరిపోయింది. నెమలిపింఛం పట్టుపావడాపై, రాణీకలరు జాకెట్టుతో, అమ్మమ్మ వడ్డాణం కూడా పెట్టింది. మా అమ్మాయేనా అని నా కన్పించింది. డ్రస్సు లేకాని నేనసలు పావడా కుట్టించలేదు. తను కూడా అద్దంలో చూసుకుని బోలెడు సంబరపడిపోయింది. ఆయన కూడా తన కూతురిని అలా చూసుకుని మురిసిపోతున్నారని ఆయన చూపే నాకు చెప్పింది.

"అమ్మాయిగోరూ యిటురండి" అంటూ మంగమ్మ పెద్ద యినుప గరిటెలో కణకణలాడే నిప్పులతో వచ్చింది.

"ఇదేమిటే..? " అన్నా.

"పెద్దమ్మగోరు అమ్మాయిగారికి దిష్టి తీయమన్నారమ్మా" అంటూ అమ్మాయి ముందు గరిటెలో మిరపకాయలు వెయ్యడంతో 'టపటప'మని తుమ్ములతో హాలంతా దద్దరిల్లింది.

"దీని చాదస్తంతో చస్తున్నానమ్మాయ్" అన్నారు తాతయ్య.

"పిల్ల కుందనపు బొమ్మలా వుందండి.

మీరేమో గ్రామ చావడి దగ్గరకు తీసుకెళ్తుంటిరి- అక్కడ అమ్మలక్కల కళ్ళు మన పాప మీదే వుంటాయ్" అంది వివరంగా అమ్మమ్మ.

"చాదస్తపు మొగుడు చెబితే వినడు గిల్లితే ఏడుస్తాడు అన్నట్టుంది మీ అమ్మమ్మ వరస" అంటూ తాతయ్య మమ్మల్ని వెంటరమ్మన్నట్టుగా బయలుదేరాడు.

మేము వెళ్ళేటప్పటికే గ్రామచావడి దగ్గర గ్రామమునసబు, కరణం యింకా చాలామంది పెద్దలు, వూరి ప్రజలు గుమికూడినారు.

"రండి అయ్యగారు! అంటూ తాతయ్యను ఆహ్వానించి అందరిని కూర్చోబెట్టారు. మేం కూర్చోగానే మధ్యనున్న ఖాళీ ప్రదేశంలో రెండు పందెం కోడిపుంజులను వదిలారు. అవి వదలడమే ఆలస్యం అయినట్టు ప్రత్యర్థులవలే తలపడ్డాయి. వాటిలో పౌరుషం రాజుకునేటట్టు వాటిని రెచ్చగొడ్తూ వ్యాఖ్యలు చేస్తున్నారు. ఓ గంటయ్యాక ఎవరి కోడిని వాళ్ళు తీసికెళ్ళారు. కుర్చీలు అన్నీ దూరంగా జరిపి, రెండు పొట్టేళ్ళను ఖాళీస్థలంలో తెచ్చివదిలారు. ఆ పొట్టేళ్ళు వదలడంతోనే నేలమీద కాలు దువ్వుతూ ఒకదాని కొకటి కొమ్ములతో 'ఢీ' 'ఢీ' అంటూ కొట్టుకుంటున్నాయి. వీటికి భయపడి కొంతమంది గోడలమీద మిద్దెల మీద నిల్చొని చూస్తున్నారు. భయంకరంగా పోరుసాగుతున్నది. ఒకదానికొకటి నేలనంతా కాళ్ళతో తంతూ భీకరంగా వున్నాయి.

మా పిల్లలకు యివి చూపడానికే తాతయ్య గ్రామ చావడికి రమ్మన్నాడనుకున్నా. మా పిల్లలు, ఆయన యిలాంటివన్నీ, సినిమాలోనో, టీవీలోనో చూడటం తప్ప ప్రత్యక్షంగా ఎప్పుడూ చూడలేదు. అందుకే ఎంతో ఆసక్తిగా చూస్తున్నారు. మా అబ్బాయికి అనుమానమొచ్చింది.

"జంతువులను హింసించడం మంచిది కాదని జంతుబలులు కూడా నిషేధించాలని చెప్తున్నారు కదా తాతయ్యా. మరేమిటి పాపం ఆ నోరులేని జంతువులకు శత్రుత్వమేమి వుంటుంది అలా పోట్లాడుకోవడానికి? పాపంకదా!" అన్నాడు.

"పూర్వకాలంలో ఈ కోడిపందేలు, పొట్టేలు పందాలు ఒకటి చచ్చేదాక వదిలిపెట్టేవారు కాదు. కాని యిప్పుడు పల్లెల్లో సంప్రదాయాన్ని నిలబెట్టడం కోసం కొద్ది సేపు సరదాగా ఆడుతున్నారు. అంతే, పందేలేమి లేవు" అంటూ తాతయ్య చెప్పాడు. సంక్రాంతి పండుగ విశిష్టత గురించి, ఊరి కట్టుబాట్ల గురించి కరణంగారు కొద్దిసేపు మాట్లాడి మరుసటి రోజు 'కనుమ' సందర్భంగా పశువులను పూజించి అలంకరించాలని, వాటికి కడుపు నిండా దాణా పెట్టాలని చెప్పి ముగించారు.

మేము ఇంటికి రాగానే అమ్మమ్మ ఎర్ర నీళ్ళతో దిష్టితీసి లోపలికి రానిచ్చింది. మా పిల్లలు అక్కడి విషయాలు అమ్మమ్మకు చెపుతూ గారెలు, చక్కెర పొంగలి తిని నిద్రలోకి జారుకున్నారు. మేం యిక్కడకు వచ్చిన తర్వాత మళ్ళా వూరికి వెళ్ళాలి అనే విషయం మరిచిపోయినట్టున్నారు పిల్లలు, శ్రీవారు.

మరుసటి రోజు నేను లేచేసరికి మా పిల్లలు ఆవులకు పసుపు రాస్తూ, కుంకుమ పెడుతూ, కుడితి పడుతూ కనిపించారు. రామలక్ష్మణుల మెడలోని మువ్వల చప్పుడు ఆ చల్లటి గాలిలో తేలియాడుతూ వినిపిస్తున్నాయి. అప్పటికే ఎద్దుల కొమ్ములకు రంగులు పూసి అలచంద గుగ్గిళ్ళు తినిపిస్తున్నారు. గోమాత మెడలో పూలదండ వేసి పిల్లలు, అమ్మమ్మ కూడ ప్రదక్షిణాలు చేస్తున్నారు.

సాయంత్రం పిల్లలను తీసుకొని అందరం ఊరి చివరన ఆనుకొని ప్రవహిస్తున్న పాలేటి ఒడ్డుకు వెళ్ళాం. ఏటిలో స్వచ్ఛంగా ప్రవహిస్తున్న నీరు, ధాన్యపు కంకులు గాలికి వింత శబ్దంతో వూగుతుంటే, ఆ వాతావరణం నయన మనోహరంగా వుంది. పిల్లలు ఇసుకలో పిచ్చుక గూళ్ళు కట్టి గవ్వలతోను, వివిధరంగుల పూలతోను అలంకరించి మురిసిపోతున్నారు, మధ్య మధ్యలో ఏటిలోకెళ్ళి కాళ్ళు కడుక్కుంటూ గులకరాళ్ళను ఏరుకుంటూ పోటీపడుతున్నారు. ఆయన ఇసుకలో తలకింద చేతులు పెట్టుకొని, ఆకాశం వంక చూస్తూ "శాంతీ! పల్లె జీవనం ఇంత ప్రశాంతంగా ఆహ్లాదకరంగా వుంటే చాలా మంది ఎందుకు పట్టణాలవైపు ఆకర్షితులై వెళుతున్నారు? " అన్నారు.

"మనమేదో చుట్టంచూపుగా వచ్చాం కాబట్టి పట్టణంలోని బిజీ వాతావరణానికి మనకు పల్లె ఆహ్లాదకరంగా కన్పించింది. ఎవరెన్ని విద్యలు నేర్చినా, పాట్లు పడినా పొట్టకూటికే కదా? ఆ కూడు యిక్కడ దొరకక పట్టణాలకు పోతున్నారు" అన్నా.

"శాంతమ్మా! ఎప్పుడొచ్చిండవు. మీతో మాట్లాడుదామని నేను పెద్దమ్మగారినడిగితే ఏటి ఒడ్డుకెళ్ళారని చెప్పారు. బేగి మాట్లాడిపోదామని లగెత్తుకొచ్చా" నంది మంగమ్మ చివరి కూతురు రంగి పదునాలుగేళ్ళది" అంది.

"నాతో ఏందే నీకు? ఏం పనిచెప్పు? నీకేం భయంలేదులే" అన్నా, దానికి ధైర్యం చెబుతూ.

"మనూరి యిస్కూల్లో నేను తొమ్మిది దాక చదివా. మా కులపెద్దలంతా నేను పెద్దమనిషినయ్యాక నీకు చదువొద్దు.. ఈసారి పోలేరమ్మ కొలువులకు నిన్ను 'మాతంగి'ని చేస్తామంటున్నారు. నా ముందోళ్ళంతా మగపిల్లలు కదా. మా అమ్మ, అన్నలు కులపెద్దలకు ఎదురు చెప్పడం

## అనేకసార్లు కనుగొన్నారు

అమెరికాలో పర్యటిస్తున్న ఆస్కార్‌వైల్డ్‌ను ఓ అమెరికన్ ఎలాగైనా సరే మాటల్లో పెట్టాలని, 'మీకు తెలుసా? కొలంబస్! ఓహ్.. చాలా అద్భుతమైన మనిషి!' అన్నాడు.

'ఎందుకు?' అడిగాడు ఆస్కార్‌వైల్డ్.



'ఎందుకేమిటి..? అతడు అమెరికాను కనుగొన్నాడు కదా?'

'ఓహ్.. అది అబద్ధం. అతడికంటే ముందుగానే దాన్ని తరచుగా అనేకమంది కనుగొంటూ వచ్చారు. కానీ ప్రతిసారీ బలవంతంగా వారి నోరు మూయించబడేది' అన్నాడు వైల్డ్.

లేదు. ఎదురు చెబితే వెలివేస్తారని అమ్మ భయం. మీరొచ్చారని తెలిసి మీకాడకు వచ్చా. పట్నంలో పాచి పనిచేసి బతుకతా. నన్ను మీతో తోడుకెళ్ళండమ్మా!" అంటూ రంగి వెక్కి వెక్కి ఏడుస్తున్నది.

పిల్లలకు, ఆయనకు అర్థంకాక బిక్కమొహాలేసుకొని చూస్తున్నారు. "నేను నిన్ను నావెంట తీసుకెళితే వాండ్లకు అనుమానమొస్తుంది. తాతయ్య ఒక వారంరోజుల్లో పనివుంది వస్తానన్నాడు. అప్పుడు ఆయనతోరా. అక్కడ నిన్ను బడిలో చేరుస్తాను బాగా చదువుకుందువుగాని" అన్నా.

"అమ్మా! మరి అన్నం ఎవరు పెడ్తారు? ఎక్కడ ఉండాలి? మా వాళ్ళు నన్ను వెతుక్కుంటూ వచ్చి లాక్కెళతారేమో.

భయంగా ఉంది" అంది.

"నీవు భయపడాల్సిన అవసరంలేదు. నాకు తెలిసిన వాళ్ళు వున్నారు. అన్నీ వాళ్ళే చూసుకుంటారు. తాతయ్యకు, మీ అమ్మకు కూడ చెబుతాలే" అన్నా.

"దండాలమ్మగారో! ఈ గండం గట్టెక్కి చ్చారంటే నా బతుకంతా మిమ్మల్నే తల్చుకుంటా" అంది రంగి దణ్ణం పెడుతూ.

"అయ్యగారూ! చీకటి పడితే పురుగూ పుట్ర తిరుగుతుంటాయి. పొలాల గట్టెం బడి పోవాల. కూసింత జారితే అంతే. లెగండి అమ్మా పోదాం" అంటూ తొందర చేసి ముందు దారి చూపింది రంగి.

"ఇంకా పోలేరమ్మ కొలుపులు, జంతు బలులు జరుగుతున్నాయా? మన ఊరిలో" అన్నా రంగితో.

"సరేలే! పోయినేడు బోలెడు మంది పోలీసోళ్ళు వచ్చారు. పొట్టేళ్ళ తలలు తెగాయి. మా సచ్చినోళ్ళంతా తప్పతాగి గెంతులేశారు. 'వీరిగాడు' తెగతాగి 'అమ్మోరు' పూనిదంటూ అవాకులు చెవా కులు పేలుతుండేసరికి, నాసామి రంగా.. వాడిని వూరోళ్ళంతా కలిసి సున్నంలోకి ఎముక లేకుండా వుతికేసిన్రు" అంది పక పక నవ్వుతూ రంగి.

"నీకెందుకే! వీరిగాడి మీద కోపం" అన్నా.

"వీరిగాడికి అచ్చరం ముక్కరాదు, వేలి ముద్రగాడు. నే చదువుకున్నా గదా! మా అమ్మ దగ్గరకొచ్చి, "అత్తమ్మో! నీ పిల్లని నే లగ్గమాడుతా.. పనికి పట్నం తీసికెళ్తా.. మాతంగిని చెయ్యడం తప్పుతుందంటూ రోజూ సొద పెడుతుండాడు" అంది రంగి.

"మరి నీకేమిటి? మీ కులపోడేగా! చేసు కోకూడదా!" అన్నా ఏం చెప్తుందో వినాల ని కుతుహలంగా.

"వాడుట్టి ఎదవమ్మా. మిర్రిమిర్రి సూపులు సూస్తుంటడు ఆడోళ్ళు కండ్ల పడితే. పనిపాటు లేదు. ఎప్పుడూ తాగి తందానాలాడతాడు. వాళ్ళ అమ్మ వీణ్ణి ఆంబోతులాగ మేపలేక సత్తున్నది. మా అమ్మతోనే తెగేసి సెప్పా. సదూకుంటా నని. రోజు మా యింట్లో గొడవే. అన్న, వదినలకేమో రొక్కం వస్తది కదా! 'మాతంగి'ని చేస్తామని వూరి పెద్దలకు మాటిచ్చారట. నాకివ్వేమి తెలవదు. అమ్మ ఒకరోజు ఏడుస్తూ పెద్దమ్మ గోరితో చెబు తుంటే తెలిసింది" అంది దీనంగా, నన్ను చూస్తూ- నువ్వే రక్షించాలి అన్నట్టు.

మాటలలో పడి ఎంత దూరము నడి చామో తెలీదు ఇంటికి వచ్చేశాం.

మరుసటిరోజు ఉదయమే మేం నిద్రలే చేసరికి డప్పుల మోతలు, యింకేవో రకర కాల కొత్త వాయిద్యాలు, కేకలు, రంకెలు వినపడుతున్నాయి.

"అమ్మోరికి సల్లులు తీసికెళ్తున్నార టమ్మా! పట్నం నుండి పేరున్న భూత వైద్యుడిని పిలిపించారట. వాడు ఏవో మంత్రాలు చదువుతూ భీకరంగా వున్నాడు. బేగి రండమ్మా వూరేగింపు సూద్దురు" అంటూ మంగమ్మ చెప్పింది.

మంగళ వాయిద్యాలు, డప్పులు, కొమ్ము బూరలు మోగుతుండగా కొందరాడవాళ్ళు పసుపు, కుంకుమ పెట్టిన కొత్త గిన్నెలు నెత్తిన పెట్టుకొని నడుస్తున్నారు. అందరి చేతుల్లోను కుంకుమ పూసిన నిమ్మకా యలు, వేపమండలు వున్నాయి. వారి ముందు కొంతమంది మగవాళ్ళు నడు ముకు వేపమండలు కట్టుకొని, నిమ్మకా యలు గుచ్చి దండలు చేసి పట్టుకొని బాగా తాగివున్నారేమో ఎగురుతున్నారు. వీళ్ళందరి మధ్యలో ఒడ్డూ పొడవు వున్న మనిషి, ముఖమంత కుంకుమ బొట్టుతో, నిమ్మకాయల దండతో, నడుం నుండి కిందకు ఆచ్ఛాదనగా వేపమండలను వేలా

డదీసుకొని, వేపమండలున్న రెండు చేతులను గాలిలో తిప్పుతూ, భయంకరంగా కనుగుడ్లూ తిప్పుతూ "ఆ... తల్లీ... వస్తున్నా..." నంటూ కేకలు వేస్తున్నాడు. వూరి వాళ్ళంతా వాణ్ణి దేవుడిని చూసినట్టు చూస్తున్నారు. గుంపు మా ఇంటిని సమీపించాక వాడిని బాగా దగ్గర చూశా. మొహం బాగా పరిచయమైనట్టుగా ఉంది. చాలా సేపు వూరేగింపు వెళ్ళాక కూడ ఆలోచిస్తూనే వున్నా. అప్పుడు బుర్రలో తళుక్కున మెరుపులా మెరిసింది వాడి అసలు బొమ్మ. 'ఓరి! నీ అమ్మ కడుపు బంగారం కానూ పీరుసాహెబూ!' అనుకున్నా. ఇత్తడి, రాగి సామాన్లు మాట్లు వేసే పీరు సాహెబు వీడు. ఈ సీజనులో ఈ అవతారమెత్తితే తినడానికి కోడి, తాగడానికి కావలసినంత దొరుకుతుందని ఈ కొత్త అవతారమెత్తాడనుకొని తాతయ్యతో చెప్పా.

"శతకోటి దరిద్రాలకి అనంతకోటి ఉపాయాలమ్మా! సులభంగా డబ్బు సంపాదించటమెలా అని వెతుకుతారే తప్ప కష్టపడి పని చేద్దామని వాళ్ళకుండదు. అంతే" అన్నారాయన.

మా తిరుగు ప్రయాణపు రోజులు దగ్గర పడుతున్నాయి. మా తాతయ్య "అమ్మా! మన కులదైవం లక్ష్మీనరసింహస్వామిని అందరం వెళ్ళి దర్శించుకొని వద్దాం. మీరు నడవగలరా? బండి కట్టించుకెళ్దామా? రేపు శనివారం కదా! మళ్ళా శనివారానికి మీరుండరు కదా!" అన్నారు.

"అదేమిటి తాతయ్యా! రోజూ గుడి తలుపులు తెరవరా? ఒక్క శనివారమే ఎందుకు?" మావాడు ప్రశ్నించాడు.

"ఒకానొకప్పుడు ఈ ప్రాంతమంతా నల్లమల అడవి. కీకారణ్యం. పులులు, సింహాలు కూడ సంచరించేవని మా తాతయ్య చెప్పగా విన్నాం. లక్ష్మీనరసింహస్వామి కొండమీద వెలిశాడు. ఆ అరణ్యంలో ఆ కొండ మీదకు చేరాలంటే డప్పులమోతతో, దివిటీలు వెలిగించుకొని, చాలామంది జనం కోలాహలంగా కొండ నెక్కి దేవుడిని పూజించి వచ్చేవారు. శనివారం లక్ష్మీ నృసింహస్వామికి ఇష్టం కాబట్టి ఆ రోజునే కలుసుకునేటట్టు, వెళ్ళేటట్టు దగ్గర పల్లెలవాళ్ళు నిర్ణయించుకున్నారు. డప్పులమోత, జనం కోలాహలం లేకపోతే ఏ క్షణం, ఎటునుండైనా పులో, సింహమో వచ్చి మీద పడుతుందని భయం. అవి ఊళ్ళోకి వచ్చి రాత్రిపూట నిశ్శబ్దంగా పశువులను లాక్కెళ్ళుతుండేవని చెప్పేవాడు మా తాతయ్య. అందుకే రాత్రి పూట వంతులవారీగా కుర్రవాళ్లు దివిటీలు వెలిగించుకొని గస్తీ తిరిగేవారట" అన్నారు తాతయ్య.

## సంపాదకుడి విందు

సాటర్ డే రివ్యూ పత్రిక సంపాదకుడు ఫ్రాంక్ హారిస్ హోటల్ రాయల్ కేఫ్‌లో భారీవిందు ఏర్పాటు చేసి లండన్‌లోని గొప్ప హాస్య చతురత కలవారిని ఆహ్వానించాడు. ఎంతోమంది అతిథులు మంచి చతుర సంభాషణలు చెబుతున్నా మొత్తంగా చూస్తే ఆ పార్టీలో ఇతరులపై ఆధిక్యం చూపుతూ ప్రముఖంగా నిలిచాడు ఆతిథ్యమిచ్చిన ఫ్రాంక్.



చివరిగా అతడు, 'లండన్‌లో నేనెంతో మంది ప్రముఖుల ఇళ్లకు ఆహ్వానితుడిగా వెళ్లాను' అని గొప్పగా చెప్పాడు.

దానికి ఆస్కార్‌వైల్డ్ అడ్డుకట్టవేస్తూ, 'ఔను, తమరు భోజనం చేయని ఇల్లంటూ ఈ మహా నగరంలో ఏదీ మిగలలేదు కదూ?' అన్నాడు ఆటపట్టిస్తూ.



"మరిప్పుడు అలాంటి భయం లేదా? " అన్నారు శ్రీవారు.

"ఇప్పుడెక్కడ బాబూ! జనాభా పెరగడం వల్ల అరణ్యాలన్నీ అదృశ్యమైపొయ్యాయి. పులులకు కూడ నీడలేక అవి కూడ ఎటో పారిపోయాయి. ఇప్పుడు గుడికి మెట్లు బాగా ఏర్పరిచారు. ఘాట్ రోడ్డు కూడ వేశారు. అయితే పల్లె జనమంతా నడిచి వెళ్ళి, నడిచే వస్తారు. మా పిల్లల పెళ్లిళ్లు అన్నీ ఆస్వామి సన్నిధిలో జరిపించడం మా ఆనవాయితీ!" అన్నాడు తాతయ్య.

"మరి మ్యారేజ్ హాల్స్ వున్నాయాండీ! అన్ని వసతులు వుంటాయా? " అంటూ ఆత్రంగా ప్రశ్నించారు ఆయన.

"బాబూ! తినబోతూ రుచులెందుకు? నువ్వే చూద్దువుగాని పద" అని నవ్వుతూ చెప్పారు తాతయ్య.

మమ్మల్నందరిని తెల్లవారుజామున



నాలుగు గంటలకే లేపి, స్నానం చేసి రడీ కమ్మన్నారు. మాకంటే ముందే బండిలో వంట సామానుతో మా బంధువులావిడ, అమ్మమ్మ కూడ వెళ్ళారు. మేం ఊరు దాటేసరికి తూర్పు తెల్లవారుతున్నది. పట్నంలో సూర్యోదయం చూడని మాకు వెలుగురేకలు విచ్చుకుంటూ మబ్బులలో నుండి సూర్యుడు ప్రత్యక్షం కావడం అద్భుత దృశ్యమన్పించింది. ఇంకా చేలపై నుండి వస్తున్న గాలి చెవిదగ్గర చేరి ఏదో గుసగుసలు చెబుతున్నట్టుగా అన్పించింది. కాలిబాటలో కన్పించిన రేగుపండ్లు కోసుకుని తింటూ తాతయ్య చెప్పే కబుర్లకు ఊ కొడుతూ మెట్ల దగ్గరకు వచ్చాం. అక్కడే ఒక సత్రంలో సామాను అంతా వుంది. అమ్మమ్మ అందించిన వేడిపాలు తాగి, చిన్న చిన్న బంకుల్లో అమ్ముతున్న పూజా ద్రవ్యాలు తాతయ్య తీసుకురాగా మెల్లిగా కొండ ఎక్కాం. కొండమీద నుంచి చూస్తే తివాచీలా పరుచుకున్న పచ్చగడ్డి, సుక్షేత్రమైన పంట పొలాలు, చిన్న నీటిమడుగులా కన్పించే చెరువు, బొమ్మరిండ్లలాంటి ఇళ్లు కన్పిస్తాయి. ఇంత రమణీయమైన ప్రకృతిని సృష్టించిన భగవంతునికి కోటి దండాలు పెట్టాలి అన్పించింది. దేవుడి దర్శనం చేసుకుంటుండగానే అమ్మమ్మ పొంగలి తీసుకొని వచ్చి నైవేద్యం సమర్పించింది. తాతయ్య స్వామికి పట్టుబట్టలు సమర్పించారు.

అమ్మమ్మ అందరికీ ప్రసాదం ఆకులలో పెట్టి ఇచ్చింది. తిని అక్కడే వున్న నీళ్లు తాగి నెమ్మదిగా మెట్లు దిగడం ఆరంభించాం. వచ్చిన దారినే వెళ్ళబోతున్న మా అమ్మాయిని వెనక్కి పిలిచి తాతయ్య "అటుగాదు. ఇటురా!" అంటూ ఆరంభించారు.

"లక్ష్మి నరసింహస్వామి ఉగ్రరూపాన్ని చూడలేని అమ్మవారు, తనను స్వామి గుర్తించలేదని కోపించి అలిగి, కొండదిగి ఒక బిలంలో వెలిసింది. పూర్వం ఈ ప్రాంతంలో ఎక్కువగా చెంచులు నివసించేవారు. అడవిలో దొరికే తేనె, జిగురు, కుంకుడుకాయలు, ఇప్పపూవులు మొదలైనవి అమ్ముకుంటూ బతికేవారు. వారు మొదటగా ఈ అమ్మవారిని కొలిచారు. అప్పటినుండి ఆమెను 'చెంచులక్ష్మి' అని పిలుస్తారు. ఆమె వారి కులదైవం" అని

చెప్తుండగానే అమ్మవారి గుడి వచ్చింది. 'గుడి' అనేకంటే బిలం అంటేనే బాగుంటుంది. అరమోడ్పు కనులతో అమ్మవారు అభయముద్రతో దీవిస్తున్నట్లుగా వుంది.

పిల్లలు సంతోషంగా చుట్టూ చూస్తూ కలియ తిరుగుతున్నారు. కొన్ని మెట్లు దిగాక ఒక పెద్ద మర్రిచెట్టు కొండను తొలిచినట్టున్న గుహ దగ్గరకు వచ్చాం. కొండపై నుండి జలధార అక్కడ వున్న శివలింగంపైబడి నిర్విరామంగా ప్రకృతికాంత శివుడికి అభిషేకం చేస్తున్నదా అన్నట్టుంది. ప్రక్కనే వున్న రావిచెట్టు ఆకుల గలగలలు, సెలయేటి సవ్వడి తప్ప ఆ వాతావరణం చాలా ప్రశాంతంగా వుంది. అంత ఎండలో ఆ గుహ దగ్గర చలిపుడుతోంది. శంకరాచార్యులవారు ఇక్కడ తపస్సు చేసినందుకు గుర్తుగా ఆయన విగ్రహాన్ని శివునకెదురుగా ధ్యాన ముద్రలో నెలకొల్పారు.

కొండదిగి వచ్చి సత్రంలో చెట్లకింద భోంచేసి, చాపలు పరుచుకొని కొంచెంసేపు సేదతీరాం. తర్వాత రోడ్డుకిరువైపుల సంతలాగ దుకాణాలు చూశాం. ఈ ప్రాంతమంతా తిరుణాళ్లలాగ వుంటుంది. తలనీలాలు యిచ్చే వాళ్లు కొందరు, పసుపు బట్టలతో కొండనెక్కేవాళ్లు, వధూవరులు, ఎక్కడ చూసినా జనమే! మా పిల్లలు బెలూన్లు, ఇంకేవో కొన్నారు. తిరిగి సాయంకాలం బయలుదేరి ఊరు చేరారు.

"అమ్మమ్మా! రాధీ ఎక్కడుందో ఏమైనా తెలిసిందా? " అన్నా.

"రాధీ ఎవరు? " అన్నారాయన.

"కరణంగారి అమ్మాయి, నా కంటే రెండేళ్లు పెద్దది. ఇద్దరం కలిసి ఒకటో తరగతి నుండి ఏడో తరగతిదాక చదువుకున్నాం. తర్వాత ఇక్కడ చదువు బాగాలేదని నేను మా నాన్నవాళ్ల దగ్గరకు వెళ్లిపోయాను. రాధీ ఎక్కడికి వెళ్లిందీ తెలీదు" అన్నా వివరంగా.

"రాధీ సంగతి ఏమీ తెలియలేదు. కాని కరణంగారు ఆ అవమానాన్ని తట్టుకోలేక ఆస్తులన్నీ అమ్మి ఎటో వెళ్లిపోయారు. పొలాన్ని మీ తాతయ్య కొన్నారు. వాళ్ల చుట్టాలెవరో తాతయ్యకు కన్పించి రాధీవాళ్ల అమ్మా, నాన్న ఇద్దరూ చనిపోయారని చెప్పారు. బంగారంలాంటి పిల్ల చేజేతులా జీవితాన్ని పాడుచేసుకొంది" అంది అమ్మమ్మ విచారంగా.

"అదేమిటి శాంతీ అమ్మమ్మ అలా అంటున్నది? " అన్నారు ఆయన కుతూహలంగా వినడానికి తాను సిద్ధమేనన్నట్టుగా.

"రాధిక కరణంగారికి ఒక్కతే అమ్మాయి. బాగా పలుకుబడి, డబ్బు కూడా వుంది. రోజూ పట్టుపావడా, నాగరం, చేమంతిబిళ్ళ, జడకుచ్చులు పెట్టి జడ వేసుకొని జడ తిప్పుకుంటూ అందరినీ ఆటపట్టిస్తూ ఉండేది. చాలా మంచి అమ్మాయి. అయితే పట్టిన పట్టు వదిలేది కాదు. తండ్రి గారాబంవల్ల పంతం నెరవేర్చుకొనేది. మేమిద్దరం అచ్చనగాయలు, వామనగుంటలు దగ్గర నుండి అన్ని రకాల ఆటలు ఆడుతుండేవాళ్ళం. అట్లతద్ది వస్తే పిల్లలందరికీ వాళ్ల తోటలోనే భోజనాలు, ఉయ్యాల ఊగటాలు. మేం ఆరో తరగతికి రాగానే మా స్కూలుకు కొత్త ఇంగ్లీషు మాస్టారు వచ్చాడు. అదివరకు మాకున్న మాస్టర్లందరూ పెద్దవారు. ఈయన వయసులో ఉన్నాడు. టిప్‌టాప్‌గా తయారయి వచ్చేవాడు. నవ్వుతూ మాట్లాడేవాడు. ఇంగ్లీషు స్టైలిష్‌గా మాట్లాడేవాడు. చివరకు పిల్లలందరం ఆయన మాతో రెండు నిమిషాలు మాట్లాడితే చాలు జీవితం ధన్యమైపోతుందనుకునే వాళ్ళం. రాధీ ప్రతి శుక్రవారం తలంటు పోసుకుని, నగలన్నీ అలంకరించుకొని మువ్వల పట్టీలు ఘల్లుఘల్లు మంటుం

డగా, జడ తిప్పుకుంటూ వయ్యారంగా వచ్చేది స్కూలుకు. కుర్ర మేస్టారుకి పల్లె టూరులో వుండటానికి ఇల్లు దొరకలేదు. కరణంగారి ఇంట్లోనే ముందున్న రూమ్ ఆయనకిచ్చేటట్టు, రాధికకు ఆయన ఇంగ్లీషు చెప్పేట్టు ఏర్పాటైంది. అప్పటి నుండి వాళ్ళిద్దరి మధ్య పరిచయం ఎక్కు వైంది. అప్పటికే రాధిక పుష్పవతి అయి వుండటం వల్ల పచ్చని ఆమె మేనిఛాయ, ఎత్తుకు తగ్గ బరువు, సిరిసంపదలు అన్నీ కుర్రమాస్టార్ని ఆకర్షించాయి. రాధిక కూడా మాస్టారి స్టైలిష్ బిహేవియర్‌కు, సూటు బూటు దర్పానికి ఆకర్షితురాలైంది. అప్పుడే వూరిలో గుసగుసలు ఆరంభమయ్యాయి. తర్వాత కొన్నాళ్ళకు ఒంటిమీద నగలు, కొంత డబ్బుతో రాధిక, మాస్టారు మాయ మయ్యారు. నేను అప్పటికే టౌనుకు వచ్చేశా. తర్వాత సంగతులేమీ నాకు తెలి యవు" అన్నా దీర్ఘంగా నిట్టూరుస్తూ.

అమ్మమ్మ పిల్లలు తినడానికంటూ ఒక క్యారియర్ నిండా కజ్జికాయలు, శెనగవుం డలు, చక్రాలు చేసిచ్చింది. ఒక వేరుశనగ కాయలబస్తా, కొన్ని చెరుకు గడలు, రేగి వడలు కూడా ఇచ్చింది. వదలలేక, వదల లేక వదిలి మా ఊరు తిరుగు ప్రయాణం అయ్యాం. ఆయన తల్లిదండ్రులు చిన్న ప్పుడే పోయారు. మేనమామ పెంచి పెద్ద చేశారు. వారి దగ్గర లోపించిన ఆప్యా యత, అనురాగాలు వీరి దగ్గర లభ్యమ యినట్టున్నాయి. నాకంటే ఆయనకే చాలా బాధగా వుంది పల్లె వదిలి రావడానికి.

"పల్లె బాగుంటుందని ఇప్పుడే తెలిసింది. ఈ ప్రయాణం, మీ ఆప్యాయతానురాగాలు మధురమైన అనుభూతినిచ్చాయి" అంటూ తాతగారికాళ్ళకు వంగి నమస్కరించారు.

ఆయన ఆప్యాయంగా గుండెలకు హత్తు కొని "బాబూ! ఎప్పుడన్నా వస్తుపోతూ వుంటే బాంధవ్యాలు బలపడతాయి. మేం ముసలివాళ్ళమయ్యాం. తిరగలేం. మీకు బుద్ధి పుట్టినప్పుడల్లా వచ్చిపోతూ ఉండండి" అన్నారు తాతయ్య.

"అమ్మాయీ! పిల్లలు, నువ్వూ జాగ్రత్త. వెళ్ళగానే ఉత్తరం రాయి" అంటూ అమ్మమ్మ కళ్ళనీరు క్రమ్మగా మా బండి కనుచూపు మేర దాటేదాక చేయి ఊపుతూనే ఉంది. చాలా రోజుల తర్వాత మనసంతా ఎంతో ప్రశాంతంగా వుండి, పిల్లల మొహంలో కూడా స్వేచ్ఛగా గడిపా మన్న తృప్తి కన్పించింది.




**ఇం**టికి రాగానే ఇన్‌లాండ్ కవర్ కన్పించింది. అది చూడగానే "శాంతీ! మీ ఫ్రెండ్స్ పోస్టల్ శాఖ మీద దయతలచిన ట్టున్నారు. ఇంత చిన్న ఉత్తరం వ్రాశారు" అన్నారు శ్రీవారు హాస్యంగా. ఉత్తరం మీద దస్తూరిని బట్టి అది రమ ఉత్తర మని అర్ధమైంది. పనంతా అయ్యాక చద వడం మొదలెట్టా.

శాంతీ!

చాలా రోజుల తర్వాత ఉత్తరం రాస్తు న్నాను. నన్ను ప్రమోషను మీద ఈ ఊరికి బదిలీ చేశారు. పాపను ఇంజనీరిం గులో చేర్పించా. ఇంకా బాబు అంత దూరం రాలేదు. వేసవి సెలవులకు నువ్వు, పిల్లలు, మీవారు రండి. ఎదురు చూస్తూంటా. మీరు వచ్చేది ముందుగా



తెలియపరిస్తే నేను బస్టాండుకో, రైల్వేస్టేష నుకో వచ్చి రిసీవు చేసుకుంటా. తప్పక వస్తావు కదూ!

రమ

సెలవులలో తప్పక వెళ్ళాలి అనుకుంటూ ఉత్తరం లోపల పెట్టా.

మరల రొటీన్ హడావుడిలో పడిపోయాం. ఈ ప్రవాహం వెంబడి కొట్టుకుపోవడమే కాని ఎదురీదడం అసాధ్యమన్పిస్తుంది. మా పిల్లల స్కూల్లో 'పేరెంట్స్‌డే' కి రమ్మని ఆహ్వానమొచ్చింది. మా పిల్లల డాన్సు, డ్రామా కూడా వుంది. అందుకే ఇద్దరం తొందరగా తయారయి ముందుగా వెళ్లాం ముందుసీట్లలో కూర్చోవచ్చని. మినిస్టరుని ముఖ్య అతిథిగా పిలిచినట్టున్నారు. మైకు కన్పించేసరికి వీరావేశమొచ్చి పిల్లల ఫంక్షనుకు వచ్చానన్న విషయాన్ని మరిచిపోయి తలాతోకలేని ఉపన్యాసమిస్తున్నాడు. ఈ వీరబాదుడు భరించలేక శ్రీవారు ఫ్రెండ్సు కనిపిస్తే దూరంగా పోయి వారితో బాతాఖానీలో పడ్డారు. నేను కళ్ళు మూసుకున్నా.. తల వెనక్కు వాల్చి.

ఫైనల్ ఇయర్‌లో మా 'హాస్టల్ డే సెలబ్రేషన్'కు మేం ఎంత హడావుడి చేసి




అందరి మెప్పు పొందామో కళ్ళముందు కదలాడింది. ఏటా ఫైనల్ ఇయర్ వాళ్ళకు వీడ్కోలు చెబుతున్నట్టుగా హాస్టల్‌లోని మిగతా అందరూ కలిసి మూన్‌లైట్ డిన్నరు యిస్తారు. దానికి కృతజ్ఞతగా అన్నట్టు హాస్టల్‌లోని ఆఖరి సంవత్సరం విద్యార్థులందరూ కలిసి నాటికలు, డాన్సులు, ఏకపాత్రాభినయం, యిలా ఎన్నో వినోద కార్యక్రమాలు నిర్వహిస్తారు. ప్రత్యేక ఆహ్వానితులుగా కలెక్టరు సతీమణి, పోలీసు సూపర్నెంటు సతీమణిని ఆహ్వానించాం. కాలేజీ హాస్టలులో వున్న లెక్చరర్సూ ప్రత్యేక ఆహ్వానితులే. ఇక బయటివారినెవ్వరిని ఆహ్వానించరు.

ప్రధాన ఆహ్వానితులు మా మెదడు ఎక్కువసేపు తినకుండా క్లుప్తంగా ఉపన్యాసాలు ముగించారు. స్వర్ణ ప్రత్యేకంగా యన్.సి.సి. క్యాడెట్లతో చేయించిన విన్యాసాలు పోలీసు సూపర్నెంటు భార్యను ఆకర్షించాయి. ఆమె స్వర్ణను స్టేజిపైకి ఆహ్వానించి పోలీస్ ఆఫీసరువి కమ్మని దీవెన లందించింది. సుజాత భరతనాట్యం అందరినీ మైమరపింపచేసింది. రమ చక్కని పరిణతి చెందిన నటిగా 'పల్నాటి నాగమ్మ' ఏకపాత్రాభినయాన్ని రౌద్రరసంతో చక్కగా అభినయించి అందరి మన్ననలు పొందింది. ఫ్యాన్సీ డ్రస్సు కాంపిటీషన్‌లో భాగంగా సుధ సోది చెప్పే ఎరుకలసాని వేషంతో అందరినీ నవ్వించింది. మా ప్రిన్సిపాల్‌కి బియస్సీలో ఈ సంవత్సరం 95 శాతం ఫలితాలు వస్తాయని చెప్పింది. గర్భిణిగా వున్న కెమిస్ట్రీ మేడమ్‌కు కొడుకు పుడతాడని, లత చెయ్యి చూసినప్పుడు త్వరలో బావను పెండ్లి చేసుకొని అమెరికా వెళ్తావని చెప్పింది. దాని బుగ్గల్లో కెంపులు పూయించింది. రమ చెయ్యి చూసి నీవు మంచి గృహిణిగా పేరు తెచ్చుకుంటావు అంది. సుమ, కొంత మంది అమ్మాయిలు స్త్రీవిద్య ప్రాముఖ్యతపై నృత్య నాటిక ప్రదర్శించారు.

నేను ఫుడ్ మినిష్టరును కావడం వల్ల డిషెష్ తయారీలో ప్రత్యేకత, మూన్‌లైట్ డిన్నరు స్పెషల్‌గా వుండాలనే ఆరాటంలో మా హాస్టలులోని ప్రతి చెట్టుకు రంగురంగుల బల్బులు అమర్చాను. ప్రతి టేబిల్ మీద హోంసైన్సు స్టూడెంటు సుధచేత వివిధరకాల ఫ్లవర్ వాజ్‌లు చేయించి మా గార్డెన్‌లోని పూలతో అలంకరించి అతిథులను ఆహ్వానించాం. కలెక్టరు సతీమణి ఆ అలంకరణకు ముగ్ధులయ్యారు. మైక్‌లో సన్నగా విన్పిస్తున్న హిందీ పాటలు అతిథులను అలరించాయి. స్వర్ణ తీయని కంఠంతో 'బహుత్ షుక్రియా, బడే మెహర్‌భానీ' అనే పాట 'హే నీల్ గగన్ కే చలే' మొదలైన పాటలు డిన్నర్ అయిందాక పాడుతూనే ఉంది. మొత్తంమీద మేమను

కున్న దానికంటే మా ప్రోగ్రాం ఎంతో తృప్తినిచ్చి మాకెప్పటకీ తీపి గురుతుగా నిల్చిపోయింది.

థియరీ పరీక్షలు దగ్గర పడటంతో అందరం ముఖ పరిచయంలేని వ్యక్తుల్లా మునిగిపోయాం. పరీక్షలు మొదలవ్వడమే ఆలస్యం నిముషంలో అయిపోయాయన్పించింది. వెంటనే ప్రాక్టికల్సు! సెలవులిచ్చి పంపుతారు. హాస్టలులో వంటవాళ్ళకి ఒక నెలరోజులు సెలవులిచ్చి పంపుతారు. హాస్టలుకు దగ్గరి ఊరివాళ్ళు కూడా ఇంటికి వెళ్ళి ప్రాక్టికల్ పరీక్షకు వస్తుంటారు. రెండు మూడు రోజులు ఖాళీ వస్తుంటుంది. అయితే మేము మాత్రం వెళితే మరల యిప్పటిలా కలవడం కుదరదని పనిమనిషి చేత హోటలు నుండి భోజనం తెప్పించుకుని హాస్టలులో వుండటానికే నిర్ణయించుకున్నాం. ప్రాక్టికల్స్‌కు చదవడం ఎక్కువ వుండదు కాబట్టి సరదాగా మాట్లాడుకుంటూండే వాళ్ళం. భవిష్యత్తులో ఎవరి ఆశలేమిటో, ఎలా వుండాలని కోరుకుంటున్నామో ఒక్కొక్కరం చెప్పుకునే వాళ్ళం.

"నేను ఐ.పి.ఎస్. ఆఫీసరు కావాలి. అదే నా లక్ష్యం" అనేది స్వర్ణ.

"దీనికి మొన్న పోలీసు సూపర్నెంటూ భార్య మెచ్చుకున్నప్పటి నుండి తిక్క ఎక్కువయ్యిందే" అంది లత.

"నువ్వు ఒక్కతివే కూతురివి కదా! మీ అమ్మావాళ్లు ఒప్పుకుంటారు" అంది సుజాత.

"వాళ్లు ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా నేను పరీక్షలు రాస్తాను" అంది స్వర్ణ.

"లతా! నీకు రెడీమేడ్ హజ్బెండ్ వున్నాడుకదా! అమెరికా నుండి వచ్చి రాగానే కట్టిపడేస్తావ్ కాబోలు. నీకేం పెట్టిపుట్టిన దానవు" అన్నా.

"నువ్వేం చేస్తావు?" అంది లత.

"మా నాన్న పోస్టుగ్రాడ్యుయేషన్ చేయమంటున్నాడు. కానీ మాది మధ్యతరగతి కుటుంబం కావడంవల్ల యిప్పటికే నా చదువుకు చాలా ఖర్చు పెట్టారు. నా తర్వాత తమ్ముళ్ళు, చెల్లెలు వున్నారు చదువులకు. అందుకే బి.ఇడికి అప్లై చేద్దామనుకుంటున్నా" అన్నా.

"మరి పెళ్ళెప్పుడే? ముసలమ్మవయ్యాకనా!" అంది రమ.

"అమ్మో! తల్లీ నువ్వంటే ప్రాణం పెట్టే బావ ఉన్నాడు. హాస్టలుకు తిరిగి నీకు పిండి వంటలు అందించడంతో ఆయన కాళ్ళు అరిగి పోయుంటాయి. పాపం ఆ మానవుణ్ణి దయ తలచవే" అంది సుధ.

"ఆ.. చెప్పడం మరిచానే.. మీరు ఎగతాళి చేస్తారని చెప్పలేదు. మేలో పెండ్లి ముహూర్తాలు పెట్టుకున్నారు. శుభలేఖలు వేస్తాను. మీరందరూ ఎక్కడున్నా రావాలి. నాతోనే వుండాలి" అంది రమ.

"మేమెందుకే? పానకంలో పుడకల్లాగ. పెండ్లయ్యాక మేమసలు గుర్తుంటామా? సంసారసాగరంలో మునిగిపోతావు గదా!" అంది లత.

"పోండే! మన స్నేహం నాకు జీవితాంతం గుర్తుంటుంది. మా బావ కూడా మిమ్మల్నందరినీ మెచ్చుకున్నాడు" అంది రమ సిగ్గు పడుతూ.

"అయితే మనందరం కలిసేది రమ పెళ్ళిలోనే. మనందరిలోకి మొదట పెళ్ళి కూతురయ్యేది రమనే" అంది సుజాత.

"సుజాత నీ సంగతేమిటే!" అన్నారు ముక్తకంఠంతో.

"మా వాళ్ళు వరాన్వేషణలో వున్నారు. చిక్కాలి గదా!" అంది నవ్వుతూ.

"అబ్బబ్బ! ఈ సోది ఎప్పుడూ వుండేదే లేవే? స్వర్ణా! ఒక్కపాట పాడవా?" అన్నా.

"మనసున మల్లెల మాలలూగెనే"

అంటూ స్వర్ణ గొంతు విప్పి పాడేసరికి ప్రకృతి నిశ్శబ్దంగా మారిపోయింది. ఆ గొంతులోని మార్దవానికి అందరం ముగ్ధులమయాం.

విడిపోయే రోజు రానే వచ్చింది. ఎవ్వరం సరిగా భోజనం చెయ్యలేకపోయాం. ఉత్తరాలు రాసుకుంటుండాలనుకున్నాం. వార్డెను కూడా వచ్చి మమ్మల్ని అనునయించింది. పెళ్ళిండ్లకు తప్పక కలుసుకోవాలని ప్రామిస్ చేసుకున్నాం. నాకు ఎక్కడ ప్రోగ్రామ్ జరుగుతున్నా మా కాలేజీ రోజులే గుర్తుకు వస్తుంటాయి. నాకు ఉత్సాహాన్నిస్తుంటాయి కూడ.

"ఏయ్! శాంతీ! మన పిల్లల ప్రోగ్రాం అనౌన్స్ చేశారు. నిద్రపోతున్నావా? కలల లోకంలో విహరిస్తున్నావా?" అంటూ శ్రీవారు భుజంమీద చెయ్యేసి పక్కన వచ్చి కూర్చున్నాక ఉలిక్కిపడి తేరుకొని, స్టేజి వైపు చూపులు తిప్పి ప్రోగ్రాం చూడటంలో మునిగిపొయ్యా.

★ ★ ★

పిల్లల పరీక్షల హడావుడి అయిపోయింది. వేసవి సెలవులిచ్చారు. ఎక్కడికన్నా తీసికెళ్ళమని రోజూ ఆయనను పిల్లలు అడుగుతున్నారు.

"పని ఒత్తిడిగా వుంది. పైవారంలో నేను వారం రోజులు క్యాంపు పోవాలి. బట్టలు సర్దిపెట్టు. నేను ఫైల్సు తయారు చేసుకోవడంలో బిజీగా వున్నా" అన్నారు.

ఆయన బట్టలు యిస్త్రీకి పంపిద్దామని బీరువా తీస్తుంటే అందులో నుండి రమ ఉత్తరం కిందపడ్డది. ఆయన వూరెళ్ళిన ఈ వారం రోజులు రమ దగ్గరకు వెళ్ళి వస్తే పిల్లలకు కొత్త ప్రదేశం చూపినట్టు, నేను తనను కలుసుకున్నట్టు అవుతుందని మేం వచ్చేరోజూ అన్నీ తెలియపరుస్తూ ఉత్తరం రాశాను. ఆయన కూడా వీళ్ళగోల పడలేక వెళ్ళి రమ్మన్నారు. రమను కలిసి కూడా సుమారు పదిహేనేళ్ళవుతుంది. బస్సులో కిటికీ పక్క చోటు దొరకగానే పిల్లలిద్దరూ బైటికి చూస్తూ మాటల్లో పడ్డారు. నా మనసంతా రమ ఆలోచనలతో నిండి తన జీవితం 'ఒక గాడి'లో పడినందుకు సంతోషిస్తూ జరిగిన సంఘటన స్మృతిపథంలో మెదులుతూనే వుంది.

మొదటగా అందరం అనుకున్న ప్రకారమే రమ పెళ్లిలో కలుసుకున్నాం. రమ బావ మమ్మల్నందరినీ పేరుపేరునా పలకరించాడు. ఆయన గవర్నమెంటు కాలేజీలో లెక్చరరుగా చేస్తున్నాడు. వాళ్ల వాళ్లందరూ మమ్మల్ని ఆప్యాయంగా చూశారు. కోరుకున్నవాణ్ణి చేసుకుంటున్నానన్న తృప్తి, పెండ్లి అలంకరణతో రమ అందం ఇనుమడించింది. మాకందరికీ చీరలు పెట్టి, అందరినీ అప్పుడప్పుడు వస్తుండండని చెప్పారు. మేం డిన్నర్ సెట్ యిచ్చి, భోంచేసేటప్పుడన్నా మమ్మల్ని తలచుకోవాలని చెప్పి వచ్చాం.

అందరి దగ్గరనుండి అప్పుడప్పుడు ఉత్తరాలు వస్తున్నాయి. సంవత్సరం తర్వాత 'రమ' తనకు కూతురు పుట్టిందని బారసాలకు రమ్మని రాసింది. ఉద్యోగాన్వేషణలో ఉండి నేను పోలేకపోయా. అప్పుడే లత పెళ్లి శుభలేఖ కూడ ఇచ్చింది. గ్రీటింగ్సు పంపించా. నెమ్మదిగా ఉత్తరాల సంఖ్య తగ్గింది కాని విషయాలు ఎవరిద్వారానో ఒకరి ద్వారా తెలుస్తుండేవి. కొద్ది నెలల తేడాతో సుధ, సుజాతల శుభలేఖలు కూడ వచ్చాయి. దూరం కావడం వల్ల పోలేకపోయా. సుమ సంగతులేమీ తెలియవు. తర్వాత రెండు సంవత్సరాలకు నాకు ఉద్యోగం రావడం, పెండ్లి కుదరడంతో బందీనైపోయాను. నేను పనిచేసే స్కూలులోనే రమ వాళ్ల చుట్టాలబ్బాయి కూడా వున్నాడు. ఒకరోజు హడావుడిగా

వచ్చాడు. "రమ భర్త ఒళ్ళుకాలి చనిపో యాడటండి. టెలిగ్రామ్ వచ్చింది. మా అమ్మా వాళ్ళు బయలుదేరి వెళుతున్నారు. ఈ మధ్యనే ఆయనకు ప్రమోషనుపై ఆ ఊరు ట్రాన్స్‌ఫరు అయిందట. మీరూ వస్తారా? " అన్నాడు.

నాకు ఆ మాటలతో ఒక్కసారి షాక్ తిన్నట్టయి సెలవు రాసిచ్చి, ఇంట్లో చెప్పి వెంటనే వాళ్ళతో బయలుదేరి వెళ్ళా. ఇల్లంతా చుట్టాలతో, స్నేహితులతో నిండి వుంది. రమ, అత్తామామలకు ఒక్కడే కొడుకు. ఆశలన్నీ ఆయన మీదే పెట్టుకు న్నారు. వారినెవరూ ఓదార్చలేక పోతు న్నారు. రమ శోకదేవతలా ఒళ్ళంతా బ్యాండేజీలతో గుర్తుపట్టలేని తన బావ ముందు కూర్చొని 'నేనే చంపేశానంటూ' హిస్టీరికల్‌గా ఏడుస్తోంది. రమ అమ్మా నాన్న సముదాయించలేక పోతున్నారు. రెండున్నరేళ్ల పాప జనాలను బిక్క మొహంతో చూస్తోంది.

"అమ్మాయీ! నువ్వు ఒట్టి మనిషివి కాదు. ఈ పాలు తాగు" అంటూ వాళ్ళ అత్తగారు తన దుఃఖాన్ని దిగమ్రింగి బతి మాలుతోంది. కడుపు మీద రెండు చేతులు పెట్టి గుద్దుకుంటూ "దీనివలనే నా బావ నాకు దూరమయ్యాడు. రమా.. రమా.. అంటూ పిలుస్తూనే వున్నాడు. మేం అన్యోన్యంగా వుండటం దేవుడికి యిష్టం లేదు శాంతీ! ఆయన కచ్చ తీర్చు కున్నాడు. నేనెప్పుడూ పూజలు చేస్తుంటానే నాకెందుకే అన్యాయం చేశాడు. చెప్పు శాంతీ!" అంటూ ఏడుస్తోంది.

"పాపను చూసి నీవు దుఃఖాన్ని దిగ మింగుకోవాలి. పాప ఎలా బెదిరిపోయి చూస్తున్నదో చూడు" అన్నా.

"నా బావలేని నాకు ఎవ్వరూ అక్కర లేదు" అంటూ యింకా తల్చుకొని ఏడు స్తోంది.

శవాన్ని ఎక్కువసేపు వుంచేకొద్ది దుఃఖం పెరిగేదేకాని తరిగేదికాదని పెద్ద లంతా ఆ కార్యక్రమాలు తొందరగా ముగించడంలో లీనమయ్యారు. నాల్గురో జులుండి పాప్మని వాళ్ళు బలవంతం చెయ్యడం వల్ల రమకు ధైర్యం చెపుతూ వున్నా. ఒకరోజు "ఏక్సిడెంటు ఎలా జరి గింది రమా? " అన్నా.

"నాకు వేవిళ్ళు ఎక్కువగా వుండి లేవలే కపోయా. అత్తయ్యా వాళ్లు మీరు ఇల్లు తీసుకొని సామాను సర్దుకొండి. ఈ లోపల మేం పొలం కౌలుకిచ్చి అన్నీ సెటిలు చేసుకొని వస్తాం అన్నారు. వాళ్ళు వుంటే యిలా జరిగేది కాదు. గ్యాస్ అయి పోయింది. స్టౌ మీద కాఫీ కలుపుకుందా మని పాలు పెట్టారు. నేను మంచం మీద పడుకునే వున్నా. కిరోసిన్ అయిపోయి మంట సరిగా రావడం లేదని కిరోసిన్ స్టౌలో పోస్తున్నారు. ఇంతలో వున్నట్టుండి మంటలు పైకి రావడం. రమా! రమా! అని కేకలేస్తూ కిరోసిన్ డబ్బా వదిలేశారు ఆ సెగకు. ఇంకా మంటలు పైకెగసి వేసు కున్నవి టెర్లిన్ బట్టలు కావడంవల్ల కేకలు వేస్తూనే వున్నారు. నేను యిరుగు పొరు గును పిల్చుకు వచ్చి నీళ్ళు కుమ్మరించి మంటలు ఆర్పేసరికి కేక ఆగిపోయింది. వెంటనే హాస్పిటల్‌కు తీసికెళ్ళారు. అంతా అయిపోయిందని బ్యాండేజీలు కట్టి యిచ్చారు చూడటానికి భయంకరంగా లేకుండా. నాకు రమా.. రమా.. అనే పిలుపు దిక్కులు పిక్కటిల్లేలా యీ ఇంట్లో ఏమూలకెళ్ళినా విన్పిస్తుంది" అంటూ గుండెలవిసేలా ఏడ్చింది.

"విధి లిఖితాన్ని ఎవరూ తప్పించలేరు. నీవు పాపకోసం దిగులు మాని నీ ఆరోగ్యం చూసుకో. నీవు యిలావుంటే మీ అమ్మానాన్నా, అత్తామామ తట్టుకోగలరా? వారికి మాత్రం దిగులు లేదా? " అంటూ

ఓదార్చా
"అందుకే నేను హాస్టలు డేలో పోషించిన 'నాయకురాలి నాగమ్మ'లాగ, అయింది నా జీవితం కూడా" అంది.
"పిచ్చి పిచ్చి ఆలోచనలు చేయకుండా ముందు మీ అమ్మావాళ్ళతో వెళ్ళు. ఈ లోపల కాంపెన్సేటరీ గ్రౌండులో నీకు ఉద్యోగమిస్తానన్నారు కదా! ఈ పరిసరాల నుండి దూరంగా పోతే నీకు కొంత మనశ్శాంతి వుంటుంది. ఉద్యోగమనే వ్యాపకం వల్ల నీవు నలుగురితో కలసి దుఃఖాన్ని మర్చిపోగలవు. కాదనక వెళ్ళు" అన్నా.
"నా కసలు బతకాలని లేదు. ఎవరి కోసం బతకాలి? ఎందుకు బతకడం" అంది నిరాశగా నిట్టూరుస్తూ.
"మీ బావ ఆశయాలకు అనుగుణంగా పిల్లలను పెంచి పెద్ద చేయి. వారే నీ జీవితపు వెలుగులు. నీవు బతుకు, నలుగురిని బతికించు" అన్నా అనునయంగా.
విన్నట్టే కన్పించింది. వాళ్ల అమ్మవాళ్లకు ధైర్యం చెప్పి వచ్చేశా.
సుమారు ఆరునెలల తర్వాత రమ నాన్నగారు ఉత్తరం రాశారు "అమ్మాయీ! రమ మగపిల్లవాడిని ప్రసవించింది. కాని బిడ్డను తాకదు. పాలివ్వదు. తండ్రిని మింగిన రాక్షసుడు వీడిని కుతిక పిసికి చంపెయ్యండి" అంటూ హిస్టీరికల్‌గా అరుస్తుంది. మేమందరం ఎంత నచ్చచెపుతున్నా పరిస్థితిలో ఏమీ మార్పులేదు. మీరు వచ్చి చెబితే మారొచ్చని మా నమ్మకం. దయచేసి వస్తావు కదూ..." అంటూ రాశారు.
రెండో శనివారం, ఆదివారం కలసి రావడంతో మరి రెండు రోజులు సెలవు పెట్టి వెళ్ళా. నన్ను చూడగానే - "వచ్చావా? చూడు నా బతుకు ఎలా తగలడిందో. ఆ రాక్షసుడిని తేవద్దంటే తెస్తారు. వాడిని కుతిక పిసికి చంపెయ్యండి. అప్పుడు అన్నం తింటా" అంటూ

## కొత్తగాలి...

**మనిషి**
**తీసుకున్న గొయ్యి!**
**రుతువులు**
**గతి తప్పాయి!!**

**-ఎన్.శివనాగేశ్వరరావు,**
**తెనాలి**

తర్జనితో బెదిరిస్తూ చెప్పింది.
రమకు సైకలాజికల్ ట్రీట్‌మెంట్ అవసరమని కౌన్సిలింగ్ ఇప్పించాం. కొద్దిగా మారినట్టు కన్పించింది. డాక్టరమ్మకూడా "నెమ్మదిగా మారుతుంది. పిల్లవాడిని కొన్నాళ్లు దూరంగా ఉంచండి. ప్రతి పదిహేను రోజులకొకసారి తీసుకురండి" అని చెప్పింది.
నేను ఊరికి వచ్చే ముందురోజు రమ దగ్గర కూర్చొని "రమా! తల్లీ తండ్రీ నీవే అయి పిల్లలను పెంచు. దుఃఖాన్ని మరిచి పోవడానికి చేతినిండా పనిపెట్టుకో. ప్రైవేటుగా ఎమ్.ఏకు కట్టు. ఎక్కడ ఉద్యోగమిచ్చినా చేరిపో. అప్పులకు ఉత్తరాలు రాస్తుంటే సగం దిగులు పోతుంది. నేను మళ్లీ వస్తా" అని చెప్పి వచ్చేస్తుంటే..
"మన వాళ్ళందరూ ఏం చేస్తున్నారు? ఎక్కడున్నారు? నువ్వుండేది ఎక్కడా? మీవారు బాగా చూసుకుంటారా? " అంటూ ప్రశ్నలు వేసింది.
ఫర్వాలేదు కోలుకుంటుందన్పించింది. అందుకే నెమ్మదిగా చెప్పా. స్వర్ణ ఐ.పి.యస్‌కు సెలెక్టు అయి ట్రయినింగుకు వెళ్లిందని, సుజాత మరణం, లత అమెరికా వెళ్లడం, సుధ పెళ్లి విషయం చెపితే అనాసక్తంగా ఆలకించింది.
నేను తర్వాత ఊరికి వచ్చేశా.
ఆర్నెల్ల తర్వాత రమ ఉద్యోగంలో చే

రిందని, పిల్లల్ని బాగా చూసుకొంటోందని వాళ్ల నాన్న ఉత్తరం రాశారు.

ఉత్తరాల ద్వారా పలకరించుకోవడమే కాని తనను కలిసింది లేదు. సంసారంలో పడి తీరిక దొరకక వెళ్లలేదు. ఇదిగో ఇన్నాళ్లకు తనను చూడబోతున్నానన్న సంతోషం, ఎప్పుడెప్పుడు చూద్దామన్న కుతూహలంతో చూస్తున్నా. ఫొటోలో చూసినందువల్ల "మమ్మీ! అదిగో రమ ఆంటీ.. అక్కడ నిలబడి ఉంది" అని మా బాబు చెప్పగానే సూట్ కేసు, బ్యాగ్ తీసుకొని బస్సు దిగా. రమ ఎంతో సంతోషంగా మమ్మల్ని వాళ్లింటికి తీసుకెళ్లింది. పాప ఇంజనీరింగు చదువుతోందని, బాబు ఇంటర్మీడియట్ చదువుతున్నాడని చెప్పింది. పిల్లలిద్దరూ ముమ్మూర్తులా వాళ్ల బావ పోలికతో ఉన్నారు. రమ అమ్మ నాన్న ఆమెతోనే ఉన్నారు. అందువల్ల రమ తొందరగా కోలుకున్నదన్పించింది. అక్కడ ఉన్నన్ని రోజులు ఎక్కడికో ఒకచోటికి పిల్లలను తీసుకొని వెళ్ళి వస్తున్నాం. పిల్లలు కూడ బాగా కలిసిపోయి చెస్, క్యారమ్స్ మొదలైన ఇండోర్ గేమ్స్ ఆడారు. వాళ్ల ఇంట్లోని కంప్యూటర్‌లో మా పిల్లలకు కంప్యూటరు గేమ్స్ నేర్పించారు. రమా, నేను మా కబుర్లలో మునిపోయాం. రమకు, పాపకు నే పెయింట్ చేసిన డ్రస్ ఇచ్చా చాలా సంతోషించింది. మళ్లీ మేము వచ్చేటప్పుడు వద్దన్న కొద్దీ వాళ్ల అమ్మగారు బట్టలు పెట్టారు. "అప్పుడప్పుడు వస్తుండమ్మా. మాకు ధైర్యంగా ఉంటుంది. పిల్లలకు కూడ అందరూ పరిచయమవుతారు." అంది ఆమె. వారందరి దగ్గర సెలవు తీసుకొని వచ్చేశాం.

★ ★ ★

ఐదారు సంవత్సరాలు జరిగిపోయాయి. మా పిల్లలు కాలేజీ చదువులకొచ్చారు. ఒక రోజు మావారి మేనమామకు హార్ట్ ఎటాక్ వచ్చిందని హైదరాబాద్ 'యశోదా హాస్పిటల్'లో ఆపరేషన్ చేశారని మా అత్తయ్య వాళ్లు ఫోన్ చేసి చెప్పారు. ఇద్దరం వెంటనే బయలుదేరి వెళ్ళి ఆయనను చూసి, మా వారి బంధువుల ఇంటికి పోవడానికి హాస్పిటల్ వెలుపలకు వచ్చి నిలబడ్డాం. ఇంతలో మా ముందు కారు ఆగడం అందులో నుండి ఒక మధ్య వయస్కురాలు... అక్కడక్కడ అనుభవాన్ని తెలిపే తెల్ల వెంట్రుకలు... నడకలో హుందాతనం, చిరునవ్వుతో మమ్మల్ని సమీపిస్తోంది.

"ఏమండి ఆమె మీ బంధువులా?" అన్నా.

"కాదే! నాకేమి గుర్తులేదు. మీ ఫ్రెండ్ ఎవరన్నానేమో? నీకు ఇండియా అంతా ఉన్నారు కదా! ఉత్తరాల ప్రేయసులు" అన్నారు నవ్వుతూ.

"అబ్బా! శాంతీ! ఎన్ని సంవత్సరాలకు చూశానే నిన్ను. నువ్వు నన్ను గుర్తుపట్టినట్టు లేదే. అలా క్వశ్చన్ మార్క్ ఫేస్ పెట్టావ్. పోనీ ఇప్పుడు దగ్గరగా చూస్తున్నావు గదా? చెప్పవే" అందామె.

ఆశ్చర్యంతో "సుధా..నువ్వా? ఇక్కడా?" అన్నా.

"ఎలా గుర్తుపట్టావు? మరి" అంది నవ్వుతూ.

"నీకు మాట్లాడేటప్పుడు 'వే' అని చివర తగిలించనిది మాట్లాడలేవు. అదే నిన్ను పట్టిచ్చింది. సన్నగా, పీలగా, చింపిరి జుట్టుతో వుండేదానివి కదా! నగరానికొచ్చే సరికి మారిపోయావు" అన్నా.

"మీరు ఇక్కడికి ఎందుకు వచ్చారు? మా ఇంటికి పోదాం. కారెక్కండి" అంటూ చేతులు పట్టుకుంది సుధ.

"నేను విషయమంతా చెప్పి ఇంకోసారి వస్తాం లే. పిల్లలంతా బాగున్నారా? ఏం

చదువుతున్నారు? పెళ్లిళ్లు అయ్యాయా? నీ సంగతి అసలు మాకెవ్వరికి తెలియదు. మీ ఇంటికి ఉత్తరాలు రాస్తే తిరిగి వచ్చాయి. ఎవరినడిగినా తెలియలేదు" అన్నా.

"రోడ్డు మీద నిలబడి మాటలేమిటి? మా ఇంటికి రా. నీవడిగిన ప్రశ్నలన్నింటికి తీరికగా జవాబులు చెపుతాను" అంది సుధ.

"శాంతీ! నాకు పనివుంది. మీ ఫ్రెండ్ దగ్గర సాయంకాలందాకా ఉండి హాస్పిటల్‌కు రా. నేను అక్కడికి వస్తాను" అన్నారు, ఆయన ఎవరికో సెల్‌ఫోన్ రింగ్ చేస్తూ.

"నువ్వు వదిలేలా లేవు. సరే పద" అంటూ సుధతో కారెక్కాను. అప్పటివరకు ఎండలో నిలబడి వుండటంవల్ల కారులోని ఎ.సి. చల్లదనం, స్టీరియోలో సన్నగా విన్పిస్తున్న ఘంటసాల గొంతులో నుండి జాలువారిన భగవద్గీత సేదతీర్చాయి. ఒక నిముషం తేరుకొని "సుధా! నువ్వెందుకు హాస్పిటల్‌కు వచ్చావు? చెకప్ చేయించుకోవడానికా? " అన్నా.

నవ్వుతూ "మా అమ్మాయి మానస యిక్కడ పిల్లల డాక్టరు. మానసను హాస్పిటల్‌లో వదిలి నేను బజారు పని చూసుకుందామనుకున్నా. వెలుపలకు రాగానే కన్పించావు. తేలికగానే గుర్తుపట్టాను" అంది సుధ.

"నీకిద్దరు మగపిల్లలు కదా! వాళ్లు ఉద్యోగాలు చేస్తున్నారా? ఎక్కడున్నారు? మీవారిది బిజినెస్ కదా? " అన్నా.

"నీ యక్షప్రశ్నలన్నింటికీ ఇంటికి పోయాక తీరికగా జవాబు చెబుతాను. ఈ లోపు కాస్త రిలాక్సు అవు" అంటూ, "శాంతీ! మన వాళ్లను ఎవరెవరిని కలిశావు? విశేషాలేంటి? నువ్వే చెప్పు" అంది.

లత అమెరికానుండి వచ్చి ఇక్కడే ఉందని, సుజాత మరణం.. రమసంగతి.. అన్నీ చెప్పా. ఈలోపల పెద్ద బంగళా ముందు కారాగింది.

"రా శాంతీ! అంటూ చేయి పట్టుకొని సోఫాలో కూలేసింది. ట్రేలో పొగలు కక్కే కాఫీతో వంటమనిషి ప్రత్యక్షమయ్యింది.

"రాజమ్మా! ఈమె నా స్నేహితురాలు. ఈ రోజు ఇక్కడే ఉంటుంది. నీ ప్రావీణ్యమంతా చూపి ఈమెను మెప్పించాలి" అంది సుధ ఆమెతో.

"మానస ఎన్నింటికి వస్తుంది? " అన్నా చూడాలనే కుతూహలంతో.

"డాక్టర్లకు వేళాపాళా లేదు, ఎప్పుడొస్తుందో. ఫోను చేసి చెపితే కనీసం సాయంత్రం లోపయినా వస్తుంది. నాలుగు రోజులుండకూడదూ.. బోలెడు కబుర్లున్నాయి" అంది ఊరిస్తూ.

"పిల్లలను తెలిసిన వాళ్ల దగ్గర వదిలి వచ్చాం. రేపు వెళ్లి పోవాలి. ఈ రోజంతా నీ కబుర్లన్నీ చెప్పవే. నేను వినడానికి రడీగా ఉన్నా" అన్నా.

"అయితే నా బెడ్‌రూంలోకి పద. తినడానికి స్నాక్స్ తెస్తాను. రాజమ్మ భోజనాలకు పిలిచేదాక మాట్లాడుకోవచ్చు" అంది, నాకు బెడ్‌రూమ్ దారి చూపించి, తను వంట ఇంటిలోకి వెళుతూ.

బెడ్‌రూమ్ కూడా చాలా ఖరీదైన అలంకరణతో ఉంది. ఎవరో ఫోన్లు చేస్తూనే వున్నారు. మాట్లాడుతూనే ఉంది.

"రామూ! రామూ!" అంటూ కేకవేసేసరికి పనిపిల్లాడు పరుగెత్తుకొచ్చాడు.

"ఫోన్ ఏదైనా వస్తే ఎవరో కనుక్కొని లెటర్‌ప్యాడ్ మీద రాసి పెట్టు. నెంబరు కూడ నోట్ చేసుకో. అమ్మగారు బిజీగా ఉన్నారు. రేపు మాట్లాడుతారని చెప్పు" అంది సెల్‌ఫోన్ స్విచ్ ఆఫ్ చేసి.

"మీ అబ్బాయిలేరి? " అన్నా.

"నీకు ఆ కథంతా చెప్పడానికే ఈ శక్తి

నిచ్చే చిప్స్! కథ చెప్పాక నీ బుర్ర వేడెక్కకుండా ఉండటానికి ఐస్‌క్రీమూ తెచ్చా. ఇవి ఆరగిస్తూ ఉంటే చెపుతా" అంది.

"నేను శ్రోతనే కదా! హాయిగా తింటూ ఉంటా నాన్‌స్టాప్‌గా! నీదే ఆలస్యం. సస్పెన్స్‌తో చంపక చెప్పవే" అన్నా విసుగు నటించి.

"ఇదేం కొత్త కథకాదు. ఓల్డ్ వైన్ ఇన్ న్యూ బాటిల్" అంది.

"తల్లీ! నీ వివరణలకు జోహారు. నే వెళ్లాలి" అన్నా.

"ఎక్కడి నుండి మొదలు పెట్టాలని ఆలోచిస్తున్నా" అంది. తర్వాత "ఆc... టర్నింగు పాయింటు నుండి చెబుతాలే. కామెంట్స్ అన్నీ తర్వాత చేద్దువు. బుద్ధి మంతురాలైన విద్యార్థినిలా విను" అంది సీరియస్‌గా పోజుపెట్టి.

నేను కూడ సర్దుకొని కూర్చొని 'ఇంత ధనవంతురాలు ఎలా అయిందబ్బా' అని ఆలోచిస్తూ చెవులు రిక్కించా, తను మొదలు పెట్టగానే.

★ ★ ★

"ఏయ్! అక్కడే ఆగు!" అన్న అత్తగారి కేక గాదు గర్జనకు నేను, నా వెనక వున్న అమ్మ కూడ గేటు తీయబోతూ ఉలిక్కిపడ్డాం. నా పొత్తిళ్ళలోని పాప గుక్కపట్టి ఏడ్చింది.

"అబార్షను చేయించుకోమని చెప్పినా వినకుండా ఆడముండను కన్నావు కదా! మా మాట విననిదానివి మళ్ళా మా ఇంట్లోకి ఎలా అడుగు పెడదామని వచ్చావు? " అంటూనే-

"ఏమిరా? ముంగిలా మాట్లాడుకుండా నిలబడి నన్ను గయ్యాళి అని అందరూ ఆడిపోసుకోవాలని చూస్తున్నావా? నువ్వు చెప్పవేంటి? " అంది అత్తగారు ఆయనకేసి చూస్తూ.

ఆమె అలా అంటుందని ఊహించలేదేమో ఆయన "అమ్నియోసిస్ పరీక్షలో ఆడపిల్ల అని చెప్పగానే అబార్షను చేయించుకోమన్నా కదా! నా మాట వినకుండా మొండిపట్టు పట్టి నువ్వేకదా పురిటికి పుట్టింటికెళ్ళింది. వెళ్ళేటప్పుడే చెప్పా, మళ్లీ రావద్దని" అన్నారు తర్జనితో బెదిరిస్తూ.

"ఒరే! వీధిలో జనం అంతా పోగయేట్టున్నారు. తలుపులు మూసుకొని లోపలకు పోతే వాళ్ళే పోతారు" అంది అత్తగారు. అంతా విన్న నాకు ఓర్పు నశించింది.

"డాక్టరమ్మ అబార్షను చేస్తే పెద్ద ప్రాణాలకే ముప్పు అని చెప్పినా మీరు నన్ను అబార్షను చేయించుకోమని ఒత్తిడి తెచ్చారు. మీకు నేను చచ్చినా ఫరవాలేదు. అయినా చదువుకున్న మీరుకూడ ఇలా మాట్లాడతారేమండి? " అన్నా ఆవేదనగా.

"ఏమిటే? కన్నతల్లిని నన్ను ఇక్కడ పెట్టుకొని వాడేదో నేరం చేసినట్టు నిలేస్తున్నావు. చదువుకున్న పిల్ల వద్దురా అని నెత్తి నోరు కొట్టుకున్నా. విన్నాడా? ఈ వాజమ్మ ఇప్పుడు చూడు దీని నోరు ఎట్టా పెరిగిపోయిందో? ఏం చూసుకునే నీకంత పొగరు? వాడికేం మగ మహారాజు. వాడు చెప్పినట్టు నువ్వు వినాలి. లేకపోతే నీ గతి పుట్టిల్లే? " అంది ఖరాఖండిగా.

"ఛీ! మీరు మనుషులేనా? ఇంత జరిగాక నేను మీ ఇంట్లో అడుగు పెట్టదల్చుకోలేదు. నా మగపిల్లలిద్దరిని నాతో పంపండన్నా" అప్పుడే నిర్ణయానికి వచ్చి.

"అబ్బో! నీకే దిక్కులేదు. వాళ్లకేం పెడతావ్? నా మనవలు మహారాజుల్లా పెరుగుతారు. నీ దిక్కున్నచోట చెప్పుకో పో" అంది ఆవిడ.

అంతవరకు గుడ్ల నీరు కక్కుకుంటూ నా వెనకే నిలబడ్డ అమ్మ, "వదినగారూ! కావాలంటే ఆ పసిపిల్లను మేము పెంచుకుంటాంలెండి. అమ్మాయి కాపురాన్ని బండలు చెయ్యవద్దు" అంటూ ఆమె కాళ్ళ

## కొత్తగాలి...

**మేఘుమా!**
**కురవకే**
**అవసరం లేనిచోట!!**

-సూర్య షంషుద్దీన్,
జెడ్. పి. కాలనీ, నెల్లూరు

మీద పడ్డంత పనిచేసింది అమ్మ.

"ఇదో! ఆ ముండతోటి ఈ ముండను కూడ వుంచుకో. మా ఇంటావంటా లేదు, ఆడ ముండలను కనడం" అంది తనో ఆడ దాన్ననే విషయం మర్చిపోయి.

"అమ్మా! అమ్మా!" అని పిలుస్తున్న పిల్లలిద్దరిని లోనికి లాక్కెళ్ళిందావిడ. వాళ్ళను లోపల పెట్టి తలుపేసి వచ్చి "ఇదో! ఈ దిక్కు మాలిన ఏడ్పులు ఆపి బైటికెళ్ళండి. నా బిడ్డకు మరొక పెళ్ళి చేస్తాను. నీలాంటి దేభ్యం మొహాన్ని చూడను. రారా.. లోపలికి" అంటూ ఆయనను ఒక గుంజు గుంజి దబ్బున తలుపేసింది.

ఆ పదేళ్ళ కాపురంలో ఏ ముచ్చటా తీరకపోగా శాపనార్థాలకు, వాతలకు అలవాటు పడ్డా. వారి దృష్టిలో కోడలంటే 'ఆల్ ఇన్ వన్' జీతం లేని నమ్మకమైన పనిమనిషి. పురుళ్ళకు తప్ప పుట్టింటి గడప తొక్క లేదు. వాళ్ళకు డబ్బు ఖర్చు అని పంపేవారు. ఒక్కరోజన్నా ప్రేమగా పలకరించింది లేదు. తిన్నానా.. తినలేదా అని అడిగింది లేదు. తెలిస్తే అమ్మావాళ్లు తట్టుకోలేరని నేనెప్పుడూ వాళ్లకు యీ విషయాలేవీ తెలియనివ్వలేదు. ఆయన సకల గుణాభిరాముడు. ఆమెతో ఈమాట ఎప్పుడయినా పొరబాటున అంటే-

"వాడు మగాడే. బిజినెస్‌లో ఇలాంటివి తప్పవు. సంపాదిస్తాడు, తిరుగుతాడు. ఆడది తిరిగి చెడుతుంది, మగాడు తిరక్క చెడతాడు. ఈ బోడి ఆరాలన్నీ నీకెందుకే? నోర్మూసుకొని నీ పని చూసుకో" అనేది.

బాగా ఆస్తి వున్న వాళ్ళని యిచ్చారు. పెళ్లిలోనే ఈమె పేచీలతో తల తిరిగిపోయి "ఈ గయ్యాళితో ఎలా వేగుతావే" అని అమ్మ కంటనీరు పెట్టింది.

"అమ్మా! రెండు చేతులు కలిపితేనే కదా శబ్దమయ్యేది. నేను సర్దుకుపోతాను" అని అమ్మకు ధైర్యం చెప్పా.

ఎంత పని చేస్తున్నా కూడ పిల్లిమీద పెట్టి, ఎలుక మీద పెట్టి ఏదో ఒకటి అనడం ఆమెకు అలవాటే. నాకు సహనం చచ్చిపోయింది. పిల్లి అయినా తలుపులు మూసి కొడితే ఎదురు తిరుగుతుందనే సామెతగా పిల్లల మీద ప్రేమ వున్నా ఏమీ చెయ్యలేని నిస్సహాయ స్థితిలో వెనక్కి తిరిగి వెళ్ళాం. కంప్యూటర్ యుగమొచ్చిందని దేశనాయకులు స్టేజీలెక్కి ఉపన్యాసాలిస్తారు కాని ఈ పురుషాహంకార సమాజంలో స్త్రీ మనుగడ యింకా ప్రశ్నార్థకమే. పాప లేత చేతుల స్పర్శ నేనేమిటో రుజువు చేసుకోవాలనే ఆత్మవిశ్వాసాన్నిచ్చింది. కాని ఇల్లు చేరగానే ఇంట్లోని వాతావరణంలో అది అంత సులభం కాదేమోనన్పించింది.

"ఏందమ్మా? వచ్చేశారు?" అంటూ అన్నయ్యలిద్దరూ, నాన్న ఏక కంఠంతో ప్రశ్నించారు. అమ్మ వెక్కిళ్ళతో ఆటో దిగితే నేను చేతిలోని పాపను వదినకిచ్చి మౌనంగా సామానులన్నీ లోపల పెట్టడానికెళ్ళా.

ఏడ్చి ఏడ్చి అలసిన నాకు మాగన్నుగా నిద్ర పట్టింది. నా పేరు పదే పదే విన్పిస్తుంటే మేలుకున్నా. నాన్న, అన్నయ్యలు సీరియస్‌గా చర్చిస్తున్నారు.

"నాన్నా! విడాకులకు నోటీసు పంపి భరణం అడుగుదాం. సగం ఆస్తి పిల్లల పేర వ్రాయమందాం. అప్పుడు వాడే చచ్చినట్టు దారికొస్తాడు" అన్నాడు పెద్దన్నయ్య.

"నాన్నా! ఆడపిల్లకు కూడా ఆస్తిలో హక్కుంది. పాపకు కూడా ఆస్తి రాయమని అడగాలి మనం" అన్నాడు చిన్నన్నయ్య.

"విడదీయడం సులభం. కలసి కాపురం చేసేటట్టు చూడాలిరా! నలుగురు పెద్దమనుషులను తీసికెళ్ళి వాళ్ళకింత గడ్డిపెడితే పరువు మర్యాద కోసమైనా దారికొస్తారు" అన్నాడు నాన్న.

"మాకు జరిగిన సన్మానమే ఆ పెద్దమనుషులకు చేస్తుంది ఆ మహాతల్లి. ఆమె అంత సులభంగా లొంగే ఘటం కాదు. అందుకే ముందే పెద్దకొడుకు, కోడలు పారిపోయారు. అమ్మ, కొడుకు కలిసి అంతా పథకం ప్రకారమే చేసినట్టున్నారు" అంది అమ్మ.

"వాళ్ళ చుట్టాలను కలుసుకొని మధ్యవర్తిత్వం నెరపమని అడిగితే బాగుంటుంది" అంది పెద్ద వదిన.

"భర్త చనిపోగానే రాబందుల్లాంటి బంధువులు ఆస్తి కాజేస్తారని వారి నెవరిని గడప తొక్కనీయలేదు ఆవిడ. ఒంటిచేత్తో వాటన్నింటినీ తనే చూసుకుంది. ఆమె నోటికి జడిసేకదా పెద్ద కొడుకు, కోడలు ఆస్తి వద్దు, పాడు వద్దు, బతికుంటే బలుసాకు తిని బతకవచ్చని పారిపోయారు. ఎక్కడున్నారో కూడా తెలియపర్చలేదు. అందుకని ఈ కొడుకు తన కనుసన్నల్లో మెలిగేటట్టు చేసుకొని ఆయన అలవాట్లను ప్రోత్సహిస్తూ, భార్యకంటే తాను మంచిదాన్నన్పించుకొంది. మనకు ఇవన్నీ తెలీక ఆస్తి చూసి మోసపోయి ఈ రొంపిలో దిగబడ్డాం" అంది అమ్మ దిగులుగా.

"ఎక్కువ రోజులు ఇంట్లో పెట్టుకుంటే ఇరుగు పొరుగు ఆరా తీస్తారు. ఎందుకొచ్చిన గొడవ మీరెళ్ళి మాట్లాడిరండి" అంది పెద్ద వదిన ఇదేదో దారినబోయే తద్దినం తన నెత్తిమీదకు వచ్చినట్టు.

తానేమి మాట్లాడకపోతే తనకు గుర్తింపు వుండదన్నట్టుగా హడావుడిగా వచ్చి చిన్నవదిన "నలుగురు నవ్విపోతారు. వాళ్ళతో అలా ఎదురుతిరిగి మాట్లాడకపోతే బతిమాలకూడదూ. ఎంత చదువుకున్నా అణకువ వుండాలి. అరిటాకు మీద ముల్లుపడ్డా, ముల్లుమీద అరిటాకు పడ్డా అరిటాకుకే కదా నష్టం" అంటూ తను చెప్పదలుచుకొన్నది అయిపోయినట్లుగా వెళ్లింది.

ఈ సంభాషణ అంతా పొల్లుపోకుండా విన్న నేను ఒక నిర్ణయానికి వచ్చా "నేను ఎటువంటి పరిస్థితుల్లోను ఆ ఇంటి గడప తొక్కను. కోర్టుల కెక్కడం, విడాకులు, ఈ గలభా అనవసరం. మనకు కోర్టు ఖర్చులు కూడా రావు" అన్నా నిశ్చయంగా.

"పిల్లలిద్దరూ ఎలా? " అంది అమ్మ.

"అమ్మా! పిల్లలను ఆమె బాగానే చూస్తుంది. ఆస్తివుంది కదా! వాళ్ళకేం లోటుండదు. నేను మనసు చిక్కపట్టుకోవాలి" అన్నా ఏడుస్తూ.

"ఎల్లకాలం ఎవరు పోషిస్తారు? " అంది పెద్ద వదిన.

"ఆడపిల్లాయనే.. పెళ్లి పేరంటాలు కావద్దూ. మేం నలుగురిలో తలెత్తుకొని ఎలా తిరుగుతాం" అంది చిన్న వదిన.

"నేను ఎవ్వరి మీద ఆధారపడదల్చుకోలేదు. నా బతుకు నే బతకగలను? " అన్నా స్థిరంగా.

"పెద్దపెద్ద డిగ్రీలకే ఉద్యోగాల్లేక అడుక్కుతింటున్నారు. నీకేం వస్తుంది? " అంది పెద్దవదిన వెటకారంగా.

"నీవు ఇక్కడ ఉద్యోగం చేస్తుంటే మేమంతా పనికిమాలిన వాళ్ళమని,, నిన్ను ఆదరించలేదని నలుగురు ఆడిపోసుకోరూ! మా కెందుకు ఈ రొష్టు" అంది చిన్న వదిన.

మరుసటిరోజు నేను అమ్మను, నాన్నను

ఒప్పించి "ఈ వాతావరణంలో ఉండలేను. తెలిసినవాళ్లు ఏదో సూటిపోటి మాటలు అంటుంటారు. వేరే ఊరు వెళ్దామనుకుంటున్నా" అన్నా.

నాన్న వెంటనే "నాతో పనిచేసి రిటైరయిన నా స్నేహితుడు హైద్రాబాద్‌లో ఇల్లు కట్టుకొని వున్నాడు. ఆయనకు చాలా మంచి పేరుంది. నేను కనుక్కుంటాను. కొన్నాళ్ళు మేం నీతో వుంటాం. నా పెన్షనుతో మనం బతకవచ్చు" అన్నారు.

నాన్న వాళ్ళ స్నేహితుడిని విచారించగానే వెంటనే బయలుదేరి రమ్మని, వారి యింట్లోనే చిన్న పోర్షను వుందని, యిక్కడికి వచ్చాక విషయాలు మాట్లాడుకుందామని ధైర్యం చెపుతూ రాశారు. మేం ప్రయాణం ఏర్పాట్లు చేస్తుండగానే.

"మామయ్యగారూ! మీరు పెద్దవారయిపోయారు. మీ కూతురితో వెళతానంటున్నారు. వున్నదేదో మాకు రాసిస్తే బాగుంటుంది కదా!" అంది పెద్ద వదిన. నాన్న ఒక్క క్షణం నిశ్చేష్టుడై తర్వాత తేరుకొని

"అమ్మా! ఈ రెండు పోర్షనుల ఇల్లు తప్ప నాకేమి ఆస్తి లేదు. చెరొక పోర్షను మీకేగదా! ఇక రాతకోతలతో పనేమిటి? " అన్నారు.

"ఆడపిల్లకు ఆస్తిలో హక్కు ఉందంటున్నారు కదండి. మీ తర్వాత ఆమె కోర్టులో వేస్తే మాగతేమిటి? అందుకే మీరు లిఖిత పూర్వకంగా రాసిస్తే మంచిది" అంది చిన్నవదిన పాయింట్ కొస్తూ.

"ఏదో మేము కొన్నాళ్ళు ఆమె ఒంటరిగా ఉండకుండా తోడువుండి వద్దామని వెళ్తున్నాం. అక్కడే ఉండిపోవడానికి వెళ్ళడం లేదుకదా! సొంత ఊరు వదిలి పెట్టి వెళతామా? " అంది అమ్మ.

"ఇది మాయదారి కాలము ఏ క్షణమెట్లా వుంటుందో తెలీదు. మీరు రాతకోతలను ముగించి వెళ్ళండి" అంది పెద్ద వదిన ఆజ్ఞ జారీ చేస్తున్నట్టుగా.

అన్నయ్యలిద్దరూ ప్రేక్షకుల్లాగ చూస్తున్నారే కాని కనీసం ఒక్క మాటకూడ మాట్లాడలేదు.

"వాళ్లే నీకు అన్యాయం చేశారని నేను ఏడుస్తుంటే రక్తసంబంధీకులైన వీళ్లూ జాలి లేకుండా ప్రవర్తిస్తున్నారే తల్లీ" అంటూ అమ్మ ఏడ్వసాగింది.

"ఎందుకు నట్టింట ఏడుస్తారు. మీ ఏడ్పులు మా కొంపకు కలిసిరావు-ఆపండి" అంటూ గర్జించినట్టే చెప్పింది చిన్న వదిన. నాన్న ఖిన్నుడయి దిగాలుగా కొడుకుల చేతగానితనానికి, నా స్థితికి తనే బాధ్యుడయినట్టు తలవంచుకున్నాడు.

"నాన్నా! అన్నింటికీ భగవంతుడే వున్నాడు. మీరు ఆ రాతకోతలన్నీ ముగించండి. తొందరగా వెళ్ళిపోదాం" అన్నా. నాకింక ఆ ఇంట్లో ఒక్క నిముషం కూడ ఉండబుద్ధి కాలేదు.

★ ★ ★

హైద్రాబాదు వచ్చాక నాన్న పెన్షనే మా ఆధారమైంది. నాన్న స్నేహితుడు "అమ్మా! ఇప్పటికిప్పుడు ఈ మహాపట్నంలో ఉద్యోగం దొరకడం కష్టం. నీకిష్టమై నువ్వు చెయ్యగలనంటే నేనొక పని చెపుతాను. నేను మాటసాయం చేస్తాను" అన్నారు.

"బాబాయిగారూ! గోదావరిలో కొట్టుకుపోయేవాడికి గడ్డిపోచ దొరికినా ఆధారమే. ఇప్పుడు నా పరిస్థితి కూడా అదే. మీలాంటి వారి అండ దొరకడమే మహాద్భాగ్యం" అన్నా.

"ఈ ఏరియాలో చాలమంది ఉద్యోగస్తులైన తల్లులున్నారు. వారి పిల్లలను దూరంగా వున్న క్రచ్‌లో వుంచి సాయంకాలం తెచ్చుకుంటారు. నువ్వు ఇంట్లోనే క్రచ్‌లాగ పిల్లలను చూసుకో. వాళ్లకు దగ్గర కాబట్టి నీదగ్గర వదులుతారు. నేను వాళ్ళకు చెపుతాను. నీకు బాగుంటే

## తీగ తెగింది ఎందుకు?

కాకినాడలో సరస్వతీ గానసభలు జరుగుతున్నాయి. జమ్ములమడక మాధవరామ శర్మ వరద గోదావరిలా మాట్లాడారు. తర్వాత 'కొత్తకు చోటిచ్చి పాత తప్పుకుంటుంది' అంశంపై ఇంద్రగంటి ప్రసంగించారు. చివరిగా కాటూరి వెంకటేశ్వరరావు మొదలుపెట్టారు. అంతా తన్మయులై వింటుంటే కార్యనిర్వాహకుల్లో ఓ విద్యార్థి చీటీ పంపించాడు. 'ద్వారంవారి కచేరీ ఉంది. దయచేసి త్వరగా ముగించండి' అని ఉంది. వెంటనే కాటూరి గంభీరముద్ర వహించారు. ఎత్తుకున్న వాక్యాన్ని సైతం ముగించకుండా కత్తిరించినట్టు ఉపన్యాసాన్ని ఆపేశారు. సభ్యులతో 'ఇది సాహిత్య సభ అనుకున్నాను. పొరపాటు. సంగీత సభ అని ఇప్పుడే తెలిసింది. దానికి మా ప్రసంగాలు మంగళవాద్యాలు అనుకోలేదు. క్షమించండి' అని చటున లేచి తిరిగి చూడకుండా వెళ్లిపోయారు. ఈ చర్యతో శ్రావ్యంగా పలికే వీణ తీగ టప్పున తెగినట్టయింది.




## శ్రీపాదవారి కళా సేవ!

'కళాభివర్ధనీ పరిషత్తు'ను రాజమండ్రిలో శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి స్థాపించారు. కవి పండితులను గౌరవించడం ప్రజలకు నేర్పాలనే వారు శ్రీపాద. ధనవంతులను పట్టుకొని సభకు వక్తగా వచ్చిన కవిపండితులకు బహుమతిగా నూటపదహార్లు ఇచ్చేవారు. మేళతాళాలతో సభాస్థలికి వెళ్లేటప్పుడు అంగళ్లలోని వర్తకులు కారులోని పండితుడికి పూలదండలు వేసేవారు. అలాగే సభకు విచ్చేసిన ప్రముఖులచేత వక్తకు దండ వేయించేవారు.

ఓసారి శ్రీనాథ జయంతికి మల్లంపల్లి సోమశేఖరశర్మ విచ్చేశారు. శ్రీపాద వక్తకు తాంబూలంతోపాటు ఓ కవరును ఇచ్చారు. ఆ కవరును పెట్టెలో పెట్టబోయి అనుకోకుండానే తెరిచారు. మల్లంపల్లి. అందులో కరెన్సీకి బదులు కాగితం ఉంది. 'అయ్యా! అనుకున్న ప్రకారం దాత నూటపదార్లు ఇవ్వకుండా ఊరెళ్లాడు. తమ ఔదార్యం ఈ లోపాన్ని క్షమిస్తుందని మా విశ్వాసం - కళాభివర్ధనీ పరిషత్తు' అని ఉంది. వేరే సందర్భంలో ఈ రుణం తీర్చుకున్నారట శ్రీపాద.

కంటిన్యూ చేయవచ్చు. మీ పాపను చూసుకోవచ్చు" అన్నారు.

"ఇదేం ఉద్యోగమే? ఇంత చదువు చదివి పిల్లలను చూసుకోవడమా? వాళ్లతో సమస్యలు రావా? " అంది అమ్మ నచ్చనట్టుగా.

"అమ్మా! ఇప్పటికిప్పుడు ఉద్యోగం దొరకదు కదా! కొన్నాళ్ళు చూడమన్నారు కదా! మన పనిమనిషికి డబ్బులిస్తే వుంటుంది. సరే. బాబాయిగారూ! మంచిరోజు కూడ మీరే చెప్పండి" అన్నా.

"వచ్చే సోమవారం 'దశమి', బాగుంది. నేను ఈ లోపల వాళ్ళతో మాట్లాడతాను. ఇతరచోట ఇచ్చినంత ఫీజు ఇచ్చి ఒకనెల రోజులు చూడమంటాను. పిల్లలను సముదాయించడానికి మీ అమ్మగారు కూడ వున్నారు కాబట్టి సమస్య రాదులే" అన్నారు. బాబాయిగారిని తోడు తీసుకొని వెళ్ళి మరుసటిరోజు కొన్ని ఆటవస్తువులు, పిల్లలరైమ్స్ పుస్తకాలు, క్యాసెట్లు కొనుక్కొచ్చా. ముందు గదిని ఆకర్షణీయంగా బెలూన్లతో అలంకరించా. పిల్లలకు యివ్వడానికి చాక్లెట్లు, బిస్కెట్లు కూడా కొన్నా.

"నువు ఈ పిల్లల పెంపకంలోనే సెటిలయ్యేట్టున్నావే. ఇవన్నీ కొన్నావ్" అంది అమ్మ.

"పోనీలే అమ్మా! ఇది మనకు బాగుంటే యింట్లోనే వుండి పాపను చూసుకుంటూ క్రచ్ నిర్వహించవచ్చు. సిటీలో ఉద్యోగం చెయ్యాలంటే కనీసం గంటైనా సిటీబస్సులో ప్రయాణం చెయ్యాలి. ఈ కొత్త ఊరిలో నువ్వు, నాన్న ఒంటరిగా వుండలేరు" అని నచ్చచెప్పేసరికి కొద్దిగా స్థిమితపడింది అమ్మ.

పాపకు 'మానస' అని పేరు పెట్టా. నా భవిష్యత్ మానసతోటే ముడిపడివుంది కాబట్టి 'మానస క్రచ్' అని పేరు పెద్ద

అక్షరాలతో అట్టమీద రాసి ఇంటి ముందు తగిలించా. "మీరు బీఎస్సీ, హోంసైన్సు పిల్లల పెంపకానికి తప్పదేనికి పనికి వస్తుంది అని నన్ను ఆటపట్టిస్తుండేవారు. ఆ పిల్లల పెంపకం, హోంసైన్సు డిగ్రీ ఇలా ఉపయోగపడతాయని నేను కలలో కూడా ఊహించలేదు. మొదటిరోజు ఇరవైమంది పిల్లలను వదిలిపెట్టి వెళ్ళారు. రెండు నుండి నాలుగు సంవత్సరాల లోపువారే. ఎవరి బాక్స్‌లో వారికి భోజనం, వాటర్ బాటిల్, స్నాక్స్ అన్నీ బుట్టలో పెట్టి అప్ప చెప్పారు. మొదటిరోజు వాళ్ళతో కబుర్లు చెపుతూ, వాళ్ళు చెప్పేది వింటూ, టేప్‌లో రైమ్స్ విన్పించా. సిటీలో పిల్లలు కదా, 'ఆంటీ కార్టూన్ నెట్‌వర్క్ పెట్టు' అని, 'పోగో పెట్టు' అని అడిగారు.

"మాకు టి.వి. లేదు గదా? రేపు కొత్తది కొనుక్కువస్తా" అంటూ చెప్పా. వాళ్ల ఇంట్లో టి.వి. పేర్లు, సినిమాల్లో ఫైటింగ్‌లు యాక్షన్‌తో సహా చేసి చూపారు. తెచ్చిన ఆటవస్తువులతో నెమ్మదిగా మొదటిరోజు గడిపా. ఎవ్వరి దగ్గరనుండి కంప్లయింట్స్ రాలేదు. నా పిల్లలను వీరిలో చూసు కుంటూ నా దిగులు మరిచిపోయా. ఒక నెలలో ఖర్చులు పోను రెండువేలు మిగి లింది. ఫరవాలేదు. ఆ బస్సుల్లోపడి వెళ్లి, పాపను వదిలి అ ఉద్యోగం నే చెయ్య లేను. పైగా అమ్మానాన్నా పెద్ద వాళ్ళయ్యారు. వారిని కనిపెట్టుకుని వుండాలి. వాళ్లు నా కోసం అన్నయ్యలను వదిలివచ్చారు. వారి బాధ్యత నాదే అను కొన్నా. మేము వచ్చాక అన్నయ్యవాళ్ళు కనీసం ఎలా వున్నారని ఒక్క ఉత్తరమ్ముక్క కూడా రాయలేదు. అమ్మ రోజూ నన్ను రాయమని గొడవ చేసేసరికి నేనే మా అడ్రసుతో ఉత్తరం రాశాను. బాబాయిగారి హామీతో బ్యాంకు లోన్ సాంక్షను అయ్యింది. పక్కనే పెద్ద ఇల్లు తీసుకొని ఆధునికమైన ఆటవస్తువులన్నీ సమకూర్చుకొని పదిమంది టీచర్లను నియ మించా. పాప పెద్దదయ్యింది. మానస తోటే నా క్రచ్ కూడా అయిదు శాఖలుగా విస్తరించింది. అమ్మా వాళ్లను చూసుకోవ డానికి నమ్మకస్తురాలైన అమ్మాయిని మాట్లాడారు బాబాయిగారు. నా అభివృ ద్ధిని చూసి బ్యాంకువారు ఇంకా లోన్ ఇచ్చారు. ప్రస్తుతం పాతిక బ్రాంచీలు ఉన్నాయి. వాటిలో అధునాతనమైన ఆట సామగ్రి వుంది. నేనే ఒక ట్రయినింగ్ సెంటర్ నెలకొల్పి టీచర్లకు పిల్లల ఆలనా పాలనలో ఎలా ప్రవర్తించాలో ట్రయినింగ్ ఇచ్చి మరీ తీసుకుంటున్నా. ఆమెరికా వెళ్ళి పోతున్న వాళ్లు ఈ ఇల్లు చౌకగా అమ్ముతుంటే కొని నాకు నచ్చినట్లు తీర్చిది ద్దుకున్నా. అన్నీ 'మానస' పేరిట కొన్నా. మానస తనకిష్టమైన మెడిసిన్‌లో ర్యాంకు సంపాదించి పీడియాట్రిలో స్పెషలైజేషన్ చేసి రెండేళ్ళ కిందట 'యశోద'లో చేరింది. నేను నా బ్రాంచీలన్నీ ప్రతి రోజూ పర్యవే క్షిస్తుంటాను. పిల్లలందరూ నన్ను ఆంటీ అనే పిలుస్తారు. నా దగ్గరున్న టీచర్లం దరూ ఆడపిల్లలే. వాళ్ళను 'మిస్' అని కా కుండా 'అక్కా' అనిపిలవమన్నా. దానివల్ల పిల్లలకు ఆత్మీయతే కాకుండా, ఇల్లు వదిలి వచ్చామనికాని, ఇది కూడ ఒక బడిలాం టిది అనే భావంగానీ ఉండకుండా ఉంటుంది" అంది ఆయాసం తీర్చుకోడా నికన్నట్లుగా.

"ఒక్కసారన్నా నీవు నీ పిల్లలను గురించి విచారించలేదా?" అన్నా.

"పెద్దన్నయ్య వచ్చినప్పుడు ఒకసారి చెప్పాడు. ఆయన మళ్ళీ పెళ్ళి చేసుకొన్నా డని, ఆమె తుమ్మమొద్దులా వుంటుందట. కానీ కట్నం దండిగా తెచ్చిందట. మా అత్తకంటే నాలుగాకులు ఎక్కువ నోరట. అందుకని మా అత్త నోరు పడిపోయిం

దట. ఆయన కూడ కుక్కిన పేనేనట. ఆమెకు ఇద్దరు ఆడపిల్లలట. ఒకసారి సినిమా హాల్లో కన్పించారట. మొహం చాటేసుకొని వెళ్ళిపోయాడట. నేను ఆ బంధం పూర్తిగా తెంచుకునే వచ్చాను. అన్నయ్య చెప్తుంటే ఎవరో తెలిసిన వారి విషయం విన్నట్టు విన్నాను కాని నాకేమి అన్పించలేదు. ఇంతకీ అన్నయ్య అమ్మా, నాన్నలను చూడటానికి వచ్చాడనుకున్నా. కాదు, బిజినెస్ పెడుతున్నాడట. బాగా సంపాదిస్తున్నానని డబ్బివ్వమన్నాడు.

నేను ప్రతి ఒక్క సంఘటన మరిచిపో లేదు. ఆ రోజు వారి సంభాషణ నా మనసులో ముద్రించుకుపోయింది. అందుకే నేను "ఇదంతా అప్పు తెచ్చి పెట్టినదే. నేను అప్పులు తీర్చాలి. ప్రస్తుతం డబ్బు లేదు" అనేసరికి,

"నీకు కళ్లు నెత్తి కొచ్చాయి. అహం భావం నేనే సంపాదిస్తున్నానని. మొగుడొదిలేసినా నీకు పులుపు చావలేదు" అంటూ ఇంత ఎత్తున ఎగిరి వెళ్ళాడు.

అమ్మ! పాపం కొడుకు తనను రమ్మని పిలుస్తాడని ఎదురుచూసింది. కనీసం వాళ్ళతో సరిగా మాట్లాడింది కూడలేదు.

"నువ్వు వాళ్ళెవరికీ ఒక్క పైసా కూడయివ్వవద్దు" అని నాన్న నిష్కర్షగా చెప్పారు.

అయిదారు సంవత్సరాలదాక నాకేమి విషయాలు తెలీవు. ఓరోజు ఉన్నట్టుండి చిన్నన్నయ్య, వదినా వచ్చారు. నేను, అమ్మా ఆశ్చర్యపోయాం. నేనెక్కడికి వెళ్ళకుండా యింట్లోనే వున్నా. భోజనాలయ్యాక- "అమ్మాయి మెడిసిన్ అయిపోయిందట గదా...! మన వూరిలోనే ప్రాక్టీసు పెట్టుకోవచ్చు. మావాడు మీ అమ్మాయిని చేసుకోడానికి ఇష్టపడుతున్నాడు" అన్నాడు అన్నయ్య, చల్లకొచ్చి ముంతదాచడమెందుకన్నట్టు.

"మీవాడు పదో తరగతి కూడ పాస్ కాకపోయెనే" అన్నా.

"చదువుదేముంది? వాడు బిజినెస్ చూసుకుంటున్నాడు. పిల్లాడు లక్షణంగా వుంటాడు. మాకూ ఇల్లూవాకిలి వున్నాయి గదా" అంది వదిన.

"అమ్మాయిని అడిగి చెబుతాలే" అన్నా నెమ్మదిగా.

"నీ ఇష్టమేమిటో చెప్పు. అమ్మాయిని అడిగేదేమిటి? " అన్నాడు.

"మానస ఇంకా చదవాలనుకుంటున్నది. ఇప్పుడే పెండ్లి చేసుకోదు" అన్నా స్థిరంగా.

"నువ్వే దానికి అన్నీ నేర్పిస్తుంటావు. ఆడపిల్లకు తగిన ఈడులో పెళ్లి చెయ్యాలని నీకు తెలీదా? అమ్మా, నాన్నా పెద్ద వాళ్లయిపోయారు గదా. మనవడి పెళ్లి కళ్లారా చూసిపోతారు" అన్నాడు అన్నయ్య.

నేను వచ్చేశాక కనీసం ఎలా బతుకుతున్నారని కనుక్కోని వాళ్లకు ఈ రోజు అవసరమొచ్చింది. అందుకే తెగేసి చెప్పదల్చుకున్నా. అందుకని "మానస యమ్.డి.చెయ్యాలనుకుంటోంది. పెళ్లి ఇప్పుడే చేసుకోనని చెప్పింది" అన్నా.

తారాజువ్వలా ఇంతెత్తున ఎగిరి "అయిన వాళ్ళందరినీ దానికి దూరం చెయ్యాలని చూస్తున్నావు" అంటూ రుసరుసలాడుతూ వెళ్ళిపోయాడు. ఆ తర్వాత మరల ఎప్పుడూ రాలేదు.

ఒకసారి ఆయన తరపు చుట్టాలు కన్పించి, మగపిల్లలకు పెళ్ళిళ్ళు అయ్యాయని, ఆయన ఆరోగ్యం బాగుండటం లేదని, అందుకని బిజినెస్ వ్యవహారాలన్నీ పిల్లలే చూసుకుంటున్నారని చెప్పారు. ఆడపిల్లలిద్దరికీ చదువు అబ్బలేదని, పెళ్ళిళ్ళు చేశారని చెప్పారు. నేను ఎవరో పరాయి వారి గురించి విన్నట్టు విన్నానే కాని నాకేమి ఆసక్తి కలగలేదు. బాధ అంత కంటే లేదు. అమ్మా, నాన్న నా గురించి



మనసులో దిగులు పడుతూనే ఉన్నారు. నేను ఆర్థికంగా నిలదొక్కుకున్నా, నా జీవితంలో పూరించలేని వెలితి వుందని వాళ్ళ దిగులు. ఆరునెలల తేడాతో ఇద్దరూ పోయారు. అయితే చివరి క్షణం వరకు వాళ్ళు నా దగ్గరే వున్నారన్నదే నా తృప్తి. అన్నయ్యలిద్దరూ చుట్టం చూపుగా వచ్చి వెళ్ళారు.

"మానస ఎప్పుడు వాళ్ళ నాన్న గురించి నిన్నేమీ అడగలేదా? " అన్నా ఆత్రుతగా.

"నా దగ్గర ఎప్పుడూ ఆ ప్రస్తావన తేలేదు. కానీ వేరే ఎవరైనా ఇంకో రకంగా చెబితే తను బాధ పడుతుందని అమ్మే జరిగిన విషయమంతా చెప్పింది. అంతా విని, 'మై మమ్మీ ఈజ్ సో గ్రేట్ అమ్మమ్మా. మా మమ్మీని కష్టపెట్టే పనేదీ చెయ్యను. ప్రామిస్' అందట. అమ్మ తర్వాత మాటల సందర్భంలో చెప్పింది. అన్ని బ్రాంచీలను స్వయంగా పర్యవేక్షించుకోవడంలో బిజీ అయిపోయా."

"పోనీలే! ఎలాగో ధైర్యంగా పరిస్థితుల నెదుర్కొని మానసను ఒకస్థాయిలో నిలబెట్టావు. అందుకు నిన్ను అభినందించాలి. మొత్తానికి కంటే ఆడపిల్లనే కను అన్పించావు కదా! ఇంతకీ మానసకు వరుణ్ణి చూశావా? పెళ్ళెప్పుడు అన్నా" ఆత్రుతగా.

"ఇంకా నా కథ పూర్తి గాలేదు. నువ్వు మధ్యలో ప్రశ్నలు వేస్తుంటే ఎలా? " అంది.

ఇంతలో కాలింగ్ బెల్ మోగడం "మమ్మీ! ఎవరొచ్చారో చూడూ!" అంటూ ఓ యువతి ఓ యువకుడిని లోనికి తీసుకు రావడం చూశా.

"మమ్మీ! ఆంటీ వచ్చిందని ఈరోజు నీవు బోలెడు స్పెషల్స్ చేస్తావు. అవి రుచి చూపిద్దామని దీపక్‌ని భోజనానికి పిలిచా. తెగ మొహమాట పడుతున్నాడు" అంది మానస.

చూడగానే అంత చదువుకున్న అమ్మాయిలా అన్పించదు. నిర్మలమైన నవ్వు, ముచ్చటగొలిపే హుందాతనం, కలుపుగోలుతనం ఉన్నట్టన్పించాయి. వెంటనే నా దగ్గరకు వచ్చింది.

"ఆంటీ! మమ్మీ చెప్పింది మీరు కాలేజీ ఫ్రెండ్స్ అని. అన్నీ చెప్పిందిలే. మిమ్మల్ని కలుసుకోవడం చాలా ఆనందంగా వుంది. ఆయన నా కొలీగ్ కార్డియాలజిస్టు. మంచి డాక్టరుగా పేరుంది" అంటూ అతన్ని పరిచయం చేసింది. వచ్చినప్పటి నుండి ఇల్లంతా తిరుగుతూ సందడిగా వుంది. భోజనం దగ్గర ఒక్కొక్క వెరైటీని రుచి చూస్తూ కామెంట్లు చేస్తూనే ఉంది.

ఈ లోపల హాస్పిటల్ నుండి ఫోను రావడంతో ఇద్దరూ వెళ్ళిపోయారు.

"నా కథ చెప్పి నిన్ను విసిగిస్తున్నానేమో శాంతీ! కొద్దిసేపు రెస్ట్ తీసుకో" అంది సుధ.

"నాకు నీ కథ విన్నప్పటి నుండి మగవాడి ఇగో వల్ల ఎన్ని జీవితాలు బలవుతున్నాయో గదా అన్పిస్తోంది" అన్నా ఆలోచిస్తూ.

"అలా అనవద్దు. ఆ ఇగోని రెచ్చగొడుతున్నది ఎవరు? తల్లో, చెల్లెలో, అక్కో, ఆడవాళ్లే కదా!" అంది సుధ.

"అంటే మీ ఆయనదేమీ తప్పులేదనా? విచక్షణా జ్ఞానం వుండక్కరలేదా? " అన్నా కోపంగా.

"భార్యాభర్తల మధ్య మూడో వ్యక్తి దూరకూడదు. ఎప్పుడైతే మూడోవ్యక్తి దూరతాడో అప్పుడే గొడవలు మొదలవుతాయి" అంది.

"ఆర్థిక స్వావలంబన ఉన్నా ఇంకా కొద్ది మంది మహిళలు బాధలు భరిస్తూ భర్త దగ్గరే వుంటున్నారు కాని విడిపోవడానికి భయపడుతున్నారే? " అన్నా సందేహంగా.

"మన సమాజం కుటుంబ వ్యవస్థకు అధిక ప్రాధాన్యమిచ్చింది. కుటుంబం

రక్షణ వలయంలాంటిది. కుటుంబం నుండి వైదొలగిన వ్యక్తిని సమాజం గౌరవించదు. స్త్రీ అయితే ఇంకా చులకన. అలాంటప్పుడు ఎవరి సహకారమన్నా లేనిది బతకలేం. మారుతున్న కాలానికి అనుగుణంగా భార్యాభర్తలిద్దరూ ఉద్యోగస్థులైన వారిలో 'సర్దుకుపోవడం' అన్నది కన్పిస్తున్నది కాని ఇంకా అంతా మారలేదు" అంది సుధ.

"మనం ఆశాజీవులం. చూద్దాం" అన్నా.

"నీకు చెప్పడం మరచిపోయా. అసలు కథ ఇంకా వుంది" అంది.

"అబ్బ! ఏమిటో చెప్పవే. ఆయన నన్ను సాయంత్రం హాస్పిటల్ దగ్గరకు రమ్మన్నారు కదా! రేపు వెళ్ళాలి. మళ్ళా ఎప్పుడు కలుస్తానో ఏమో" అన్నా.

మానస హాస్పిటల్ నుండి వస్తే వాళ్ళ పేషంట్ల కబుర్లు చెబుతుంటుంది. మేమిద్దరం కలిసి భోంచేసేది రాత్రిపూటే. ఒక్కోసారి అదీ కుదరదు. అప్పుడప్పుడు నైట్ డ్యూటీ కూడా వుంటుంది. ఒకరోజు ఎవరో ముసలాయనను తెచ్చి ఆయన కొడుకులు అడ్మిట్ చేశారట. ఆ రోజు డాక్టర్లు సెలవులో వుండటం వల్ల ఆ ముసలాయన పరిస్థితి సీరియస్‌గా ఉండటం వల్ల డాక్టర్లంతా అక్కడే వున్నారట. మరుసటిరోజు వచ్చినప్పుడు ఆయన, 'నీకు అన్యాయం చేశాను. నన్ను క్షమించు' అంటూ పిచ్చిగా ఒక్కోసారి ఏడుస్తాడట, ఒక్కోసారి 'లెట్‌మీ డై' అంటూ తనకు తానే గొంతు పిసుక్కుంటున్నాడట. బాగా మెంటల్‌గా డిప్రెస్ అయినట్టున్నాడని చెప్పింది. అయిదారు రోజులయినాక ఆయన కోలుకున్నాడమ్మా కాని వెంబడి వచ్చిన కొడుకులిద్దరూ బిల్ కట్టాల్సి వస్తుందని పారిపోయారు. వాళ్ళిచ్చిన అడ్రసు తప్పని అన్నది.

"నేను మనకెందుకులే ఆ... గొడవలు నీ డ్యూటీ నువ్వు చేయి. నీవు పిల్లల డాక్టర్వి కదా! నీకెందుకే? " అన్నా.



**కొత్తగాలి...**

**కొత్త అల్లునికి మామగారే**
**'ఏ.టి.ఎం'బ్యాంకు**
**పాపం**
**పిల్లనిచ్చాడుగా**

–కళాప్రియ, కొవ్వూరు

"ఆయన దీపక్ పేషంట్. నేను దీపక్‌తో వెళ్ళి అప్పుడప్పుడు చూస్తుంటా. పాపం ఆయనను చూస్తే జాలేస్తుందమ్మా. బాగా తాగుడు. అన్ని అలవాట్లు వున్నట్టున్నాయి. 'నీకు అన్యాయం చేశాను. నాకు భగవంతుడు తగిన శాస్తి చేశాడు' అని ఎప్పుడూ గొణుగుతుంటాడు అంది.

నేనూ వినీవిననట్టు మా అకౌంట్సు సెటిల్ చేసుకోవడంలో మునిగిపోయా.

నాలుగు రోజుల క్రితం మానస భోజనానికి రాకపోతే నేను అటువైపు వెళ్తూ భోజనం క్యారియర్ యిచ్చేసి వెళ్దామని వెళ్ళా. హాస్పిటలు ఔట్ పేషెంట్ వార్డ్ దగ్గర ఓ ముసలాయనను నర్సులు కోప్పడుతున్నారు. "మీ వాళ్ళెవరూ రాలేదు. నీకు యిక వైద్యం చెయ్యరు. నీవు వెళ్ళి డబ్బు తీసుకురా. ఇది ధర్మాసుపత్రి కాదు. కార్పొరేట్ హాస్పిటల్, పో" అంటున్నారు.

వారి మాటలు పట్టించుకోనట్టు ఆయన "నన్నెందుకు బతికించారు మీరు? యిప్పుడెక్కడికెళ్ళాలి నేను? " అంటూ ప్రశ్నిస్తూనే ముఖాన రెండు చేతులు కప్పుకొని ఏడుస్తున్నాడు. అప్పుడు చూశా స్పష్టంగా ఆ మనిషిని. చేతులమీద నాగపడగ పచ్చబొట్టు. ఒక్కసారి ఆశ్చర్యపోయి నిలబడి, మరల పక్కన నిలబడి ఆయన చేతులు తీశాక ముఖాన్ని గుర్తుపట్టడానికి ప్రయత్నించా. లోతుకు పోయిన దవడలు,

జీబురుగడ్డం, గుంటపడ్డ కళ్ళు, నుదుట మీద కాల్చిన పెద్దమచ్చ నన్ను తట్టిలేపాయి. మనసు అడుగు పొరలలో పడిపోయిన రూపాన్ని తెరమీదకు తెచ్చి చూసి షాక్ తిన్నట్లయ్యా. వెంటనే తేరుకొని "ఏమండీ! ఏమిటీ దుస్థితి? " అని అడిగా. ఆయన నా గొంతు గుర్తుపట్టినట్లున్నాడు.

"సుధా! నీకు అన్యాయం చేసినందుకు భగవంతుడు నాకు తగిన శిక్ష వేశాడు. నాకంతే కావాలి. మనస్ఫూర్తిగా భరిస్తున్నా" అన్నారు.

"అలాంటి మాటలు మాట్లాడవద్దు. జరిగిందేదో జరిగిపోయింది. విధి లిఖితాన్ని ఎవరూ తప్పించలేరు" అన్నా.

ఇంతలో "మమ్మీ! యిక్కడే నిలబడ్డావేంటి? నర్సు వచ్చి చెబితే నువ్వు లోపలకు వస్తున్నావని ఎదురు చూశా. రాకపోయేసరికి నేనే వచ్చా. ఎనీ ప్రాబ్లమ్? " అంది మానస. తను మాట్లాడుతున్నంతసేపు కన్నార్పకుండ చూస్తూనే ఉన్నారు.

"ఆయనకు రూమ్ ఎలాట్ చెయ్యమని చెప్పు. ఇక్కడ అందరూ చేరతారు మనం మాట్లాడుతుంటే" అన్నా.

వెంటనే ఆయనకు రూమ్ అలాట్ చేశాక మానసను తీసుకువచ్చి ఆయన ఎదురుగా నిలబెట్టి "మన అమ్మాయి. ఇక్కడ చిన్న పిల్లల డాక్టరు" అన్నా.

"మీకు నేను చేసిన ద్రోహానికి నన్ను మీరు క్షమిస్తే నేను ప్రశాంతంగా పోతా" అన్నారు.

మానస అర్థం చేసుకొని "నాన్నా మీరు మమ్మల్ని వదిలి ఎక్కడికీ పోనక్కరలేదు. మిమ్మల్ని ఆరోగ్యవంతుడిని చేసి మమ్మీకి అప్పచెప్పే బాధ్యత నాది. హాయిగా విశ్రాంతి తీసుకోండి" అంది.

"నాకు బుద్ధి వచ్చింది. కొడుకులు పున్నామ నరకం నుండి రక్షిస్తారని వాళ్ళను నెత్తిన పెట్టుకొని చూశా. బిజినెస్ వ్యవహారాలన్నీ అప్పచెప్పా. 'నాన్నా! మామయ్యా' అంటూ నిన్నటిదాక నా చుట్టూ తిరిగారు. ఆమె కూడా వాళ్ళతో చేరి నామీద లేనిపోనివి చెప్పింది. వారికి నేనొక 'డిస్పోజబుల్ ప్రాడక్టు' నయ్యా. అందుకని హాస్పిటల్‌లో చూపిస్తామనే నెపంతో తీసుకొచ్చి యిక్కడొదిలేసి వెళ్ళారు సుధా! నీకు చేసిన అన్యాయమే నన్ను శాపమై కాటేసింది. నాకు ప్రాయశ్చిత్తం లేదు" అని గద్గద స్వరంతో చెప్పారు.

"పశ్చాత్తాపాన్ని మించిన ప్రాయశ్చిత్తం లేదు. మీరు అన్నీ మర్చిపోయి నిశ్చింతగా వుండండి. మనమ్మాయి పర్యవేక్షణలో మీరు కొత్త మనిషి అవుతారు" అన్నా మనస్ఫూర్తిగా.

"అమ్మా! నేటి సమాజంలో నీలాంటి కూతురు ఒకరుంటే చాలదా? " అన్నారు హీనస్వరంతో.

"కాదు నాన్నా! కొడుకైనా, కూతురైనా, సమానమే అనుకునే రోజులు వచ్చినప్పుడు భ్రూణహత్యలుండవు. ప్రతి ఆడపిల్ల తన జీవితాన్ని తనిష్టమొచ్చిన రీతిలో మలుచుకోగలిగిన స్వేచ్ఛ తల్లిదండ్రులిచ్చినరోజు సమస్యలే ఉండవు. ఆర్థికంగా నిలదొక్కున్నంత మాత్రాన సరిపోదు. తన సమస్యను తానే ధైర్యంగా ఎదుర్కొగల ఆత్మ విశ్వాసం ఉండాలి. అప్పుడు ఎవరికీ భయపడవలసిన అవసరం వండదు" అంది మానస ఆవేశంగా.

"క్షమయా ధరిత్రీ అన్న ఆర్యోక్తిలాగ మీ అమ్మ నన్ను క్షమించింది. నీవు కూడ నన్ను క్షమిస్తే నాకు మనశ్శాంతి" అన్నారు ఆవేదన, ఆందోళన నిండిన స్వరంతో.

"మనలో మనకు క్షమాపణలేమిటి నాన్నా! మీరు ఒక వారం రోజులు మేం చెప్పినట్టు వినండి చాలు. అన్నయ్యలను పిలిపిస్తాను. ఇంటికి వెళ్ళిపోవచ్చు" అంది మానస.

"అమ్మో! మళ్ళా అక్కడికా? నేవెళ్లను" అంటూ చిన్న పిల్లాడిలా అంటే, "నాన్నా! మాతోనే ఉందురు. మీరు సిస్టర్స్ చెప్పినట్టు మందులు మింగండి. నేను ఇక్కడే ఉంటాను. అమ్మ రోజూ వస్తుంది. మనమంతా సో హేపీ!" అంది ఆయనకు ధైర్యం చెప్తూ.

"నర్సమ్మా! ఆ మందులు ఇలా తే! తొందరగా నయమవ్వాలి నాకు" అంటూ నర్సును పిలుస్తుంటే...

"నీవు అన్నిటికీ అలా హడావుడి పడితే కుదరదు. వాళ్లకు తెలుసు. ఎప్పుడేది యివ్వాలో" అంది డాక్టరుగా ఆజ్ఞాపిస్తూ.

"అంకుల్! మానస హస్తవాసి చాలా మంచిదట. ఆ పిల్లల వార్డంతా మానస నామస్మరణతో నిండిపోయి ఉంటుంది. నో వర్రీ" అంటూ దీపక్ వచ్చి పరీక్షించి చార్టు మీద మందులు రాసిచ్చి వెళ్లాడు.

"దీపక్ ఈ హాస్పిటల్‌లోనే కార్డియాలజిస్టుగా చేస్తున్నాడు. చాలా మంచివాడు. మనమ్మాయికి తగినవాడనుకున్నా. వాళ్లిద్దరూ కూడ యిష్టపడ్డారు. మీరు తొందరగా ఆరోగ్యవంతులయితే వాళ్ళిద్దరిని ఒకటి చేసి ఆశీర్వదిద్దాం" అన్నా.

ఆయన ముఖం వెలిగిపోయింది.

"నేను ఉదయం హాస్పిటల్‌కు వచ్చింది ఆయనను చూసి పాలు, టిఫిన్ ఇచ్చి వెళ్దామని. మానస, 'వద్దులే మమ్మీ. నేను క్యాంటీన్ నించి తెప్పించి ఇస్తాలే' అంది. కాని ఆయన పశ్చాత్తాప పడుతుంటే.. రోజూ కన్పిస్తుంటే కొద్ది ఓదార్పుగా ఉంటుంది. అయినవాళ్ళున్నారు అనే భావన త్వరగా కోలుకునేటట్లు చేస్తుందని ఈమధ్య ఒక జర్నల్‌లో చదివా.

వృద్ధాప్యంలో చేతికర్రకు బదులుగా కొడుకులు ఆసరాగా నిలబడతారని కలలు కని కొడుకులను నెత్తికెక్కించుకుంటారు. ఆ కొడుకులే ఏరు దాటాక తెప్ప తగలేసినట్టు రెక్కలొచ్చాక వృద్ధులను బైటికి గెంటుతున్నారు. ఆడపిల్ల అయితే తల్లిదండ్రులు ఆమెతో ఉండలేరని, పెండ్లి భారమని భావిస్తారు. 'తాత బొచ్చ తరతరాలు' అనేది కొడుకులు మరిచిపోతున్నారు. వారి గతి అంతే" అన్నా ఆవేశంగా.

"మనం హాస్పిటల్‌కెళ్లే టయమయింది పద" అంటూ బుట్ట సర్దడంలో పడింది సుధ.

కారులో వెళ్తూ "అమ్మా, నాన్నల జ్ఞాపకార్థం ఒక వృద్ధాశ్రమం నిర్వహించాలనుకున్నా. నా ఆదాయంలో కొంత కేటాయించాను. మా యింటికి కొద్ది దూరంలోనే ఒక పెద్ద బిల్డింగు అమ్మకానికి వస్తే కొన్నాను. అమ్మా, నాన్నకు నేనున్నాను కాబట్టి సరిపోయింది. వారు వృద్ధాప్యంలో పడ్డ అవస్థలు నేను కళ్లారా చూశా. పైగా ఎంతోమంది వృద్ధులు కన్నవాళ్ల నిరాదరణకు గురవుతున్నారు. డాలర్ల కోసం అమెరికా ఎగిరిపోతూ కొందరు, యిద్దరూ ఉద్యోగాలతో కొందరూ, నిర్దయగా మరికొందరు వారిని పట్టించుకోవడం లేదు. పైగా మానస కూడ 'మంచి నిర్ణయం తీసుకున్నావమ్మా మా హాస్పిటల్ వాళ్ళు కూడ సహకారం అందిస్తామన్నారు' అంది. ఆ లెక్కలతోనే కొంచెం బిజీగా ఉన్నా. ఏ విధంగా చుట్టాలు కాకపోయినా బాబాయిగారు నాకు ధైర్యం చెప్పటమే కాక ఎన్నో రకాలుగా సహాయమందించారు. నేను ఈ స్థితిలో ఉన్నానంటే అంతా

**కొత్తగాలి...**

**మసీదు కాదు**
**రామాలయం కాదు**
**ప్లీజ్! అక్కడ**
**మనిషి గుడి కట్టండి!**

*—తోకల రాజేశం, ఆవడం, ఆదిలాబాద్ జిల్లా*

ఆయన చలవే" అంది సుధ.

"వృద్ధాశ్రమంలో బాగా ట్రయినింగ్ అయిన ఇద్దరు నర్సులను పెట్టుకో. ఒక చిన్న లైబ్రరీ, వాకింగ్ పార్కు ఏర్పాటు చేయి- బాగుంటుంది. అప్పుడప్పుడు ఆధ్యాత్మిక ఉపన్యాసాలు యిప్పించు. పని చేయ గలిగిన వాళ్ళను చేయనివ్వు. అప్పుడు వారిలో మేం ఎందుకు పనికిరాం అనే భావన పోయి ఉత్సాహంగా ఉంటారు. మానవ సంబంధాలన్నీ ఆర్థిక సంబంధాలైన నేటి రోజుల్లో వృద్ధాశ్రమాలను ఆశ్రయించడంలో తప్పు లేదన్పిస్తుంది. ఏమైనా మంచి నిర్ణయం తీసుకున్నావు. గో ఎ హెడ్" అన్నా మనస్ఫూర్తిగా.

"కాని మధ్యతరగతి వారు ఇంకా- కొడుకు, కోడలు తిట్టినా, విసుక్కున్నా అక్కడే ఉంటారు. వృద్ధాశ్రమంలో చేరితే కొడుక్కు అప్రతిష్ట అని.. పుత్రప్రేమ అలా ఉంటుంది మరి" అంది ఆవేశంగా సుధ.

ఇంతలో హాస్పిటల్ రావడంతో స్పెషల్ రూమ్‌వైపు వెళ్లాం. మంచానికి అంటుకుపోయిన శాల్తీని తట్టి లేపి "ఏమండీ! శాంతీ అని చెప్పానే.. మా ఫ్రెండ్ .. ఉదయం అనుకోకుండా కలిసింది. ఇద్దరం మనింటికి వెళ్ళాం. మిమ్మల్ని చూస్తానంటే పిల్చుకొచ్చా" అంది సుధ. ఆయన నెమ్మదిగా సుధ చేతులు పట్టుకొని లేచి కూర్చుని "అమ్మా! మీ స్నేహితురాలి ఔదార్యం నాలోని రాక్షసుడిని చంపివేసింది. నేనిప్పుడు పునర్జన్మనెత్తాను. మా మానస చేతిలో ఏం మహిమ వుందో లేచి కూర్చోగలుగుతున్నాను. మా మానస నన్ను చిన్నపిల్లాడిలా చూసుకుంటున్నది. ఈ జీవితానికి ఇలాంటి క్షణాలు వస్తాయని నేనూహించలేదు" అన్నాడు గద్గద స్వరంతో.

"మీరు తొందరగా కోలుకొని పెళ్లి పనుల్లో పాల్గొనాలి. అదే నా ఆకాంక్ష" అన్నా.

"పెండ్లికి తప్పక రావాలి. ఎదురు చూస్తుంటా. తప్పించుకోవద్దు!" అంటూ సుధ సాగనంపింది నన్ను.




మాకు చాలా రోజులనుండి కాశీ చూడాలని ఉంది. కాని ఎప్పుడూ ఏదో ఒక అవాంతరం వచ్చేది. మా బంధువులంతా కలిసి ఎండాకాలంలో కాశీ వెళ్లాలని పదిహేను రోజుల ప్రోగ్రాం నిర్ణయించారు. తొమ్మిది రోజులు కాశీలో నిద్ర చేయాలని పెద్దవారి ఆలోచన. ముఖ్యంగా మూడు ప్రదేశాలు చూడాలని నిర్ణయించారు. అలహాబాదు, కాశీ, గయ. అంతా ఒప్పుకున్నారు. నెల రోజుల ముందే 'వారణాసి ఎక్స్‌ప్రెస్'కు అరవై మందికి రిజర్వ్ చేయించారు. కాశీలోని 'ఆంధ్రాశ్రమం' వాళ్ళకు ఫోన్ చేసి మేం చూడవలసిన ప్రదేశాలకు స్పెషల్ బస్ ఏర్పాటు చేయమని, రూమ్స్ రిజర్వ్ చేయమని ముందుగానే ఉత్తరం రాశారు. మరల బయలుదేరేముందు ఫోనుచేసి చెప్పారు. ఇందులో ముసలి, ముతక ఉన్నారు, పిల్లలూ వున్నారు, భాషరాని ప్రదేశంలో అవస్థ పడుతామని మేం ఉన్నన్ని రోజులు ఒక గైడ్‌ని కూడా ఏర్పాటు చేయమన్నారు.

పిల్లలు పెద్దవారయిన తర్వాత మేం ఎప్పుడూ అంత దూరం ప్రయాణం చెయ్య

లేదు. అంతా ఉత్సాహంగా ఉన్నారు. పెద్ద వాళ్లు ఎక్కువ లగేజీ తీసుకురావద్దని మొత్తుకున్నా అందరు తినుబండారాలు, నెస్‌కేఫ్, బ్రూలాంటి ప్యాకెట్లు, పూజా సామగ్రి తెచ్చుకున్నారు. అలహాబాదు బ్రేక్ జర్నీగా దిగాలని నిర్ణయించారు. సుమారు ఒకటిన్నర రోజు పడుతుంద న్నారు. మధ్యాహ్నం రైలు బయలుదేరి నప్పటినుండి అందరూ ఇంటి దగ్గర భోజ నాలు చేసి వచ్చినప్పటికీ, ప్రయాణపు హడావుడిలో సరిగా తినలేదంటూ టిఫిన్ క్యారియర్లు తెరిచారు. ఒక్కొక్కరు ఒక్కొక్క వెరైటీ తెచ్చారు. పులిహోర, పెరుగన్నం, భక్ష్యాలు, అరిశెలు, గారెలు, బొబ్బట్లతో ఒక అరటిగెల కూడ రైల్లో ఎక్కించినట్టున్నారు. ఒకరి పిండి వంటలు ఒకరు పంచుకుంటూ, కబుర్లు చెప్పు కుంటూ తింటుంటే ఎన్ని స్టేషన్లు వచ్చాయో తెలీదు, పొయ్యాయో తెలీదు. పెద్దవారు నిద్రకుపక్రమిస్తే కొంతమంది పేకాట మొదలెట్టారు. కొంతమంది పిల్లలు టేప్ రికార్డులో పాటలు వింటూ, చెస్, చైనీస్‌చెక్కర్ ఆడుతున్నారు. ఆడవాళ్ల కబుర్లు మాత్రం ఎంతకీ తెగటం లేదు. ఏదో స్టేషన్‌లో రైలాగేసరికి ఆంధ్రా బోర్డరు దాటాం అనుకున్నా. ఒక టీవాడు వచ్చాడు. ఇంకేముంది అందరు చేరి వాడి టీ కెటిల్ ఖాళీ చేసి పంపించారు. ఉద యమంతా ప్రయాణపు హడావుడిలో తిర గడం వల్ల, ఇంటి దగ్గర పది గంటలకు కూడ పడుకోనివారు బెడ్ పరచుకొని అంతా నిద్రకుపక్రమించారు. చల్లటిగాలి శ్రమను మరపించింది.

తెల్లవారుజామున నాలుగు గంటలకు టీ వాడి కేకలతో అందరూ కళ్లు నులుము కుంటూ లేచారు. వచ్చీరాని హిందీలో 'ఏ స్టేషన్' అని అడిగా. 'నాగపూర్' అని, 'నేను తెలుగువాడినేనమ్మా బతుకు తెరువు కోసరం యిటు వచ్చా ఈ స్టేషనులో ట్రయిను అరగంట ఆగుతుంది' అని చెప్పాడు. నాగపూర్ చాలా పెద్ద స్టేషన్. టీ చిన్న పిడతలలో యిచ్చాడు. మా పిల్లలు అందరి దగ్గర టీ పిడతలు తీసు కొని కడిగి దాచిపెట్టారు. చూడటానికి భలే తమాషాగా వున్నాయి. పెయింటింగ్ వేసి వాల్ డెకరేషన్‌కుపయోగించ వచ్చ నుకున్నా. మగవాళ్లంతా రైల్లోనే స్నానాలు ముగించి గంట, శంకువు మోగిస్తూ పూజా కార్యక్రమాలు ముగించారు. యథావిధిగా కొంతమంది స్టేషన్‌లోకెళ్ళి అందరికీ టిఫిన్లు కట్టించుకొచ్చారు. క్యాన్లలో మంచి నీళ్లు పట్టుకొచ్చారు. రైలు అయిదారు గంటలదాక ఎక్కడా ఆగదట. తెలుగు పేపర్లు, కొన్ని మాస, వార పత్రికలు, తెచ్చారు. ఆడవాళ్లం ఎవరం స్నానం చెయ్యకుండా ముఖాలు కడిగి చీరలు మార్చుకున్నాం. రైలులో నుండి బైటికి చూస్తుంటే అన్నీ చిన్నచిన్న ఊర్లే కాని పెద్ద ఊర్లే రాలేదు. మధ్యాహ్నమయ్యేస రికి అందరికీ ఆత్మారాముడు గోల మొద లెట్టాడు. అంతా కలిసి టీసీని యక్ష ప్రశ్న లతో వచ్చీరాని హిందీలో మెదడు తినే సారు. తట్టుకోలేక 'ఇంతమందికి అన్నం దొరకదు. చపాతీలు, పుల్కాలు, పరో టాలు దొరుకుతాయి. అవి తెచ్చుకొని తినండి వచ్చే స్టేషన్‌లో. రాత్రి పదకొండిం టికి అలహాబాదు వస్తుంది. ఆ స్టేషను లోనే మంచి నీళ్ళు కూడ పట్టుకోండి. మళ్లా దొరకవు' అన్నాడు.

రైలు ఎంతసేపు ఆగుతుందో తెలీదు కాబట్టి కుర్రవాళ్ళనడిగి అన్నీ తీసుకుర మ్మని చెప్పారు. అంతా ఆకలి మీద ఉన్నారు కాబట్టి యేమి కామెంట్సు చేయ కుండా దొరికిందే చాలని తిని పుస్తక పఠ నంలో పడ్డారు. పిల్లలంతా యథాప్రకా రంగా వారి ఆటల్లో పడ్డారు. పెద్దవాళ్లు

కునుకు తీశారు. ఈ ప్రాంతంలో జనాలంతా ఎక్కువ చదువుకున్నవాళ్లలా కన్పించలేదు. కొంచెం వ్యవహార జ్ఞానం తెలిసిన వాళ్లు వ్యాపారాలు, లేని వాళ్లు పనులకు పోతూ కన్పించారు. అందుకే ఏ పల్లెలో కూడ ఒక్క మిద్దె యిల్లు కనబడలేదు. పొలాలన్నీ బీడులే. నేను కిటికీగుండా బైటికి చూస్తుంటే శ్రీవారు "ఎంతసేపు చూస్తావు? ఆ రేగడి మట్టి పొలాలు, తుమ్మ చెట్లు, ముళ్ల పొదలూ" అన్నారు. సాయంత్రమయ్యేసరికి టిఫిను క్యారియర్లన్నీ ఖాళీ చేసి టీ తాగి సామాన్లన్నీ సర్దుకొని దిగడానికి సిద్ధమయ్యాం.

అలహాబాద్ స్టేషన్‌లో దిగగానే గైడు వచ్చి మమ్మల్నందరినీ బస్సులో ఒక పెద్ద వసతి గృహానికి తీసుకెళ్ళాడు. భోజన కార్యక్రమాలన్నీ అయ్యేదాక వుండి "తెల్లవారుజామున అయిదు గంటలకు అందరూ రడీగా ఉండండి. త్రివేణి సంగమంకు వెళ్ళాలి" అని చెప్పాడు. అంతా మాట్లాడుతూనే నిద్రపోయారు.

మరుసటిరోజు ఉదయమే పురోహితులను కూడ వెంటపెట్టుకొని గైడ్ బస్‌తో సహా వచ్చి అందరినీ తొందరపెట్టి బయలుదేరదీశాడు. బస్సు దిగీదిగగానే మమ్మల్ని యాత్రికులుగా గుర్తించిన పండాలు మా వెంటబడ్డారు. గైడ్ వాళ్లను పంపించి వేశాడు. వెలుగురేకలు అప్పుడు విచ్చుకుంటున్నాయి. అయినా అప్పటికే యమునా తీరమంతా వివిధ ప్రాంతాల నుండి వచ్చిన యాత్రికులతో సందడిగా వుంది. త్రివేణి సంగమం దగ్గరకు పోవడానికి ఒక్కొక్క పడవను వందరూపాయలకు మాట్లాడుకొని అందరం బయలుదేరాం. సుడులు తిరుగుతూ, గంగ యమునలు కలుస్తున్న దృశ్యం చూడాల్సిందేకాని, వర్ణించడానికి మాటలు చాలవు. స్నానానంతరం పంతులుగారు పిండప్రదానాలు చేయించారు. అంతా పడవపైనుంచే. సరస్వతీ నది అంతర్వాహినిగా ప్రవహిస్తుందని తెలిపారు. మొదటిసారిగా త్రివేణి సంగమాన్ని దర్శించుకుంటున్న దంపతులకు అక్కడ మరల వివాహతంతు జరిపిస్తారట. పెళ్ళి మంత్రాలు, ప్రమాణాలతో, తలంబ్రాలు మినహా పెళ్ళితంతు అంతా జరిపారు. గతం కళ్ళముందు కదిలి మధురోహల్లో తేలిపోయారు దంపతులంతా కొత్త జంటల్లాగ. ఆఖరున వేణీ దానం చేశాం. దానం ముగిసిన తర్వాత భర్త, భార్య జడ చివరి భాగాన్ని కత్తిరించి ఇవ్వాలన్నారు. ఆ జడ చివర్లకు పసుపు, కుంకుమ, అక్షింతలతో అద్ది సుడులు తిరుగుతున్న గంగ యమున సంగమంలోకి విసిరేశారు. ఆ జుట్టు సుడులు తిరుగుతూ నీటిలో మునిగిపోయింది. అలా మునిగితే ఆ దంపతులు అన్యోన్యంగా ఉంటారని లేకపోతే సఖ్యతగా వుండరనీ అక్కడ వారి నమ్మకమని పురోహితులు చెప్పారు. త్రివేణి సంగమంలో స్నానాలు మిగతా కార్యక్రమాలన్నీ ముగిశాక అందరం బస్సులో సత్రానికి వచ్చాం.

"అందరూ ఒక అరగంటలో తొందరగా రెడీ అయితే 'ఆంధ్ర కాఫీ హోటల్'కు తీసి కెళ్తాను. అక్కడ తొందరగా టిఫిన్ల కార్యక్రమం ముగిస్తే అలహాబాద్‌లో చూడవలసినవి చాలా వున్నాయి అని చెప్పాడు. పంతుళ్ళకు దక్షిణలు యిచ్చి పంపేసి, తొందరగా తయారవడంలో మునిగిపోయారంతా. షుగర్ పేషంట్లు, పిల్లలు అందరూ ఉదయం ఏమి తినకుండా త్రివేణి సంగమం దగ్గరకు రావడం వల్ల అంతా నీరసంగా వున్నారు.

మా బస్సు ఒక పెద్ద హోటల్ ముందు ఆగింది. అందరూ ఎవరికి కావాల్సినవి వారు ఆర్డరిచ్చారు. మేం ఇడ్లీ మాత్రమే తిన్నాం. కాని అవి కుడుముల్లా వున్నాయి.




## అక్టోబరు -09
# చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికి త్వరలో బహుమతులు అందుతాయి.




1. **రాధాకృష్ణ భావరాజు** - కొవ్వూరు, ప. గో. జిల్లా
2. **ఎం. సత్యనారాయణ రాజు** - రామకృష్ణా నగర్, రాజమండ్రి
3. **అయితా మాధవి** - సూళ్ళూరుపేట, నెల్లూరు జిల్లా
4. **ఎం. కృష్ణ కుమారి** - దేవపురం, గుంటూరు
5. **ఎం.రామచంద్ర రావు** - హిల్ కాలనీ, నల్గొండ జిల్లా

## సరైన జవాబులు

1. బాలమ్మ 2. రామం 3. పార్థసారథి 4. సాంబయ్య 5. ఎలిజబెత్ గాస్కెల్
6. కొడవటిగంటి 7. ఊర్వశి 8. చిలుకూరి దేవపుత్ర 9. రమేష్ 10. వసుంధర

మావారు "తొందరగా ఆకలి కాదులే" అన్నారు. అక్కడంతా ఆవుపాలేనట. కాఫీ టేస్టు కొంచెం కొత్తగా అన్పించింది. గైడ్ తరమడంవల్ల అందరూ తొందరగానే బయలుదేరారు. మొదటగా నెహ్రూగారి జన్మస్థలమైన 'ఆనంద భవన్' చూశాం. చాలా విశాలమైన భవంతులు, పచ్చికమైదానాలు, ఉద్యానవనంతో ఆకర్షణీయంగా వుంది. 'రాచ దర్బారు' అంటే అదేనేమోనన్పించింది. ప్రభుత్వం వారు మ్యూజియంగా మార్చారు ఆ భవనాన్ని పర్యాటకుల సందర్శనార్థమై. నెహ్రూ, గాంధీ సంభాషణలు జరిపిన గది, ఇందిరాగాంధీ ఉపయోగించిన వస్తువులు, అనేకరకాల ఫొటోలను భద్రపరిచారు. అన్నింటి మీద వివరంగా పేర్లు ఉండటం వల్ల ఆసక్తిగా చూశాం. అన్నింటికంటె పిల్లలను పెద్దలను మెప్పించింది 'రాజీవ్‌గాంధీ ప్లానెటోరియమ్' నక్షత్రాలు, గ్రహాలు, రాశులు, సూర్య, చంద్ర గ్రహణాలు ఏర్పడటం మొదలైన వాటిని వ్యాఖ్యానంతో సహా చక్కగా తెలిపారు. మేం తెలుగువారమని తెలుగు అనువాదకుడితో చెప్పించడంవల్ల అందరికీ సులభంగా అర్థమైంది.

తర్వాత 'భరద్వాజముని ఆశ్రమం' వెళ్ళాం. రుషులు ప్రతిష్టించి పూజించిన శివలింగాలు అక్కడ చాలా వున్నాయి. పూజారులకంటే చిన్నపిల్లలే ఒక్కొక్క శివలింగం దగ్గర నిలబడి మమ్మల్ని అభిషేకం చెయ్యమని 'కమండలం'తో నీరందించి, పూలు, గంధం, అక్షింతలు ఇచ్చి మంత్రం చెప్పి వేయమని ఒక్కొక్క జంటను ఇరవై రూపాయలిమ్మన్నారు. అంతా శివలింగాలమయం కాబట్టి ఒక్కొక్క జంట ఒక్కొక్క శివలింగానికి అర్చన చేశారు. అప్పటికి మధ్యాహ్నం కావడం వల్ల అంతా భోజన హోటల్ దగ్గర బస్సు ఆపమన్నారు. భోజనాలు ముగించుకొని అందరం యూనివర్సిటీకి వెళ్ళాం. విశాలమైన భవంతులు, ఆధునిక పోకడలతో రూపుదిద్దుకున్న విభిన్నమైన కోర్సులను అందిస్తున్నది. విశాలంగా, పరి



శుభ్రంగానున్న వీధులు, ఎటుచూసినా పచ్చదనంతో, ఆకర్షణీయమైన ఉద్యానవనాలతో చాలా ప్రశాంతంగా ఉంది.

సాయంకాలం దేవాలయానికి వెళ్లాం. అక్కడ మమ్మల్ని ఆశ్చర్యపరచింది దేవునికి నైవేద్యంగా మిఠాయి పెట్టడం. మనవైపు గుడిముందు కొబ్బరికాయలు, పూలు, పండ్ల దుకాణాలుంటాయి. కాని ఇక్కడ చాలా రకాలైన స్వీట్లు అరకేజి ప్యాకింగు నుండి అమ్ముతుంటారు. మనం ఒక స్వీటు ప్యాకెటు తీసికెళ్తే పూజారి దేవునికి నైవేద్యంగా చూపించి ఏదో మంత్రం చదివి సగం స్వీటు దేవుని దగ్గర పెట్టి మిగతావి మనకు ఇస్తారు. మేం కూడ స్వీటు నైవేద్యంగా ఇచ్చి ప్రసాదం అక్కడే తిని చేతులు కడుక్కొన్నాం. ఏ గుడిలో చూసినా పాలరాతి విగ్రహాలే దర్శనమిస్తాయి. జీవకళ ఉట్టిపడతాయి. ఉత్తరాది వేషభాషల కనుగుణంగా అలంకరణ చేస్తారు. రాత్రిపూట భోజనం దొరకదని చెప్పాడు. అందుకని అందరూ చపాతీలు, పుల్కాలు, పరోటా తిని బస్సులో రైల్వేస్టేషన్‌కు చేరాం. రాత్రి వారణాసి ఎక్స్‌ప్రెస్‌కు 'కాశీ' బయలుదేరాం.

తెల్లవారుజామున కాశీలో దిగాం. చాలా పెద్ద స్టేషన్ చాలా రద్దీగా ఉంది. ఆంధ్రాశ్రమంవాళ్లు పంపిన బస్సులో గైడు మమ్మల్నందరినీ తీసికెళ్లాడు. ఇరవై గదులు పది రోజులకు రిజర్వు చేయించాం. కాబట్టి వసతి సులభమైంది. గంగానది చాలా దగ్గరే అని అందరూ తయారుగా ఉండమని చెప్పాడు. రానా? వద్దా?



అంటూ కాశీ విశ్వనాథుని అనుమతి కోరుతున్నాడేమో అన్నట్టుగా సూర్యుడు నెమ్మదిగా ఉదయిస్తున్నాడు. గంగాతీరం చేరగానే అందరిలో ఒకలాంటి భక్తిభావం ఏర్పడింది. అప్పటికే చాలామంది గంగలో మునకలేస్తున్నారు. గంగ ఒడ్డున అనేక స్నానఘట్టాలున్నాయి. కొన్ని ఘట్టాలను రాజులు ఏర్పాటు చేయడం వలన వారి పేరుతోనే పిలువబడుతున్న ప్రతి స్నానఘట్టం దగ్గర శివలింగాలని ప్రతిష్ఠించారు. ఘాటులలో ప్రశస్తిగాంచినవి కేదారఘాట్, మణికర్ణికా ఘాట్, హరిశ్చంద్రఘాట్, దశాశ్వమేధ ఘాట్ మొదలైనవి. మెట్లు జారుతుంటాయి 'జాగ్రత్తగా దిగండి' అని గైడు హెచ్చరిస్తూనే ఉన్నాడు. కాని ఒకజంట హడావుడిగా మెట్లు దిగడం, దబ్బున జారి రెప్పపాటులో నీళ్ళలో పడింది భార్య. ఆమెను రక్షించాలని ఆయన కేకపెడుతూ ఆమెను పట్టుకోబోయాడు. ఇద్దరూ మునిగిపోయారు. గైడ్ వెంటనే నీళ్ళలో దుమికి ఇద్దరిని బయటికి లాక్కొచ్చి నీళ్ళను కక్కించాడు. ఈ దెబ్బతో మిగతావారందరూ జాగ్రత్తపడ్డారు.

"మామయ్యా! అత్తయ్యా! సరిగంగ స్నానాలు చేశారు" అంటూ పిల్లలు వాళ్లని వేళాకోళం చేశారు.

"గుడికెళ్ళాలి తొందరగా రండి" అని గైడ్ కేకలు పెడ్తున్నా ఎవ్వరూ నీటిలో నుండి పైకి రాకపోగా మంత్రాలు చదువుతూ, సూర్య నమస్కారాలు చేస్తున్నారు. అందరూ వెంట తెచ్చుకున్న కమండలాల్లో

## కొత్తగాలి...

**వీధిలో అరువు**
**ఇంటిలో పరువు**
**గుండెలో బరువు**

–సితారా,
విశాఖపట్నం

గంగను తీసుకొని 'విశ్వనాధుని' దర్శనానికి బయలుదేరారు. మా చిరకాల వాంఛ తీర బోతున్నదని అందరం ఆనందభరితుల మయ్యాం. గుడికి వెళ్లే దారులన్నీ ఇరుకు సందులే. గుడికి వెళ్లే దారికిరుపక్కల స్వీట్సు తయారీ షాపులే. ఘుమఘుమ లాడే స్వచ్ఛమైన నేతి వాసన, నాసికాపుటా లను తాకుతూ నోరూరిస్తుంటే, పిల్లలకు గుడినుండి వచ్చేటప్పుడు కొని పెడ్తాం అని నచ్చచెపుతూ గుడికి వెళ్లాం. ఆవులు రోడ్డు వెంబడి ఎక్కడంటే అక్కడ నిలబడి వుంటాయి. కాని ఒక్క ఆవు కూడా ఏమి అనదు. అక్కడ అందరూ 'గోపూజ' చేస్తారు. అయితే ఆడ, మగ అందరికీ జర్దా కిళ్లీ నమిలే అలవాటుండం వల్ల వీధు లన్నీ ఎర్రగా ఉంటాయి. మొత్తం మీద చెప్పాలంటే వీధులన్నీ అపరిశుభ్రంగా ఉంటాయి. జనసందోహం ఎక్కువ కావడం వల్ల ఒకరినొకరు తోసుకుంటూ హడావుడిగా పోతూనే ఉంటారు. భక్తి భావంకన్నా వ్యాపారధోరణి ఎక్కువగా కన్పిస్తుంది. గుడి దగ్గర చిన్నపిడతలలో అభిషేకానికి పాలు, పెరుగు వేర్వేరుగా అమ్ముతున్నారు. అయితే మేమంతా ఎక్కడ సంతృప్తి పడ్డామంటే మన చేతుల్తో స్వయంగా విశ్వనాధునికి పాలు, పెరుగు, నెయ్యి, గంగతో అభిషేకం చేసి పరమానందం చెందాం. విశ్వనాధునికి వేసిన జిల్లేడు మాలను దంపతుల మెడలో వేసి ఆశీర్వదించి దక్షిణ అడుగు తాడు పూజారి. మా పిల్లలు, పిడతలు బాగున్నాయని, పెయింటింగ్ వేసి ఇండోర్ ప్లాంట్స్ పెంచవచ్చునని అన్నీ భద్రం చేశారు.

విశాలాక్షి ముగ్ధ మనోహర రూపం చూసిన పిదప మనసుకు చాలా సంతోషం కలిగింది. అక్కడవున్న పూజారి ఆమె రూపం గురించి వివరంగా చెప్తూ, ఆమె రూపం స్వయంగా వెలసిన రూపం అని, ఆమె ముందుగా ఉన్న రూపాన్ని శ్రీకంచి పీఠాధిపతులు ప్రతిష్ఠించారని, ఆమె చాలా మహిమ కలిగిన తల్లి అని, కోరిన కోరి కలు నెరవేర్చగల జగన్మాత అనీ వివరిం చారు. అక్కడి దేవాలయాలలో అతి ముఖ్యమైన దేవాలయం 'వారాహి' దేవా లయం. ఈ వారాహి అమ్మవారే కాశీ పట్ట ణానికి అధినేత్రి. ఆమె ఈ పట్టణాన్ని రాత్రి అంతా కనిపెట్టుకొని చూసి తిరిగి అలసిపోయి తెల్లవారుజామున నాలుగు గంటలకు దేవాలయానికి చేరుకుంటుంది. ఆ తెల్లవారుజామునే దేవాలయంలో అమ్మవారికి పూజలు చేసి సూర్యుడు ఉద యించే సమయానికి దేవాలయం మూసివే స్తారు. ఆ అమ్మవారిని దర్శించుకోవాలంటే ఉదయం ఆరు గంటలలోపే చూడాలి. అందువలన మేం తెల్లవారుజామున 3 గంటలకు లేచి ఆ దేవాలయానికి వెళ్లాం. ఆ అమ్మవారిని దర్శించాలంటే ఎన్నో మలుపులు దాటవలసి వచ్చింది. అలా ఎన్నో ప్రయాసల కోర్చి ఆ వారాహి దేవా లయానికి వెళ్ళాం. అప్పుడే అమ్మవారి ఆలయద్వారం తెరిచారు. వెంటనే లోప లకు వెళ్ళాం. ఒక సన్నని రంధ్రం ద్వారా కింది భాగాన ఉన్న అమ్మవారిని దర్శించాం. ఆమె పాదాలు, శిరస్సు మాత్రమే కనిపించాయి. మరొక చోట నుండి చూస్తే ఆమె పాదాలు కన్పిం చాయి. అనుకున్న సమయంలో ఆ దేవి

దర్శనం కల్గినందుకు ఆనందం వేసింది.

మరికొంత దూరంలో గౌడీబాయ్ దేవాలయం వుంది. ఆమె శివుడికి సోదరి. ఆమె ఎల్లప్పుడు మడి... మడి అంటూ చెప్పేదట. ఆ శివుడికి మాత్రం ఏ నియమమూ లేదు. ఆ లయకారకుడు శ్మశాన వైరాగ్యం చెప్పేవాడు. బూడిదను ఒంటికి రాసుకునేవాడు. ఆమె కోరికమేరకు ఆమెకు ప్రత్యేక దేవాలయం నిర్మించి అందులో వుంచారట. ఆమెకు మన పేరు, గోత్రం చెప్పి ఒక గవ్వను సమర్పించడం అక్కడి ఆనవాయితీ.

కాశీలో మొత్తం 64 ఘాట్‌లున్నాయట. ఆ ఘాట్‌లలో రాజులు కట్టించినవి, మహర్షులవి కూడ వున్నాయి. దీనిని ఒరుసుకుంటూ గంగ ప్రవహిస్తూ కాశీపట్టణానికి ప్రాముఖ్యతను తెచ్చిపెట్టింది. మేం కాశీలో తొమ్మిది రోజులు నిద్రచేయాలని నిర్ణయించుకున్నాం కాబట్టి రోజూ వేకువనే రోజు కొక ఘాట్‌లో స్నానం చేయటం విశ్వనాధునికి ఆ గంగజలంతో అభిషేకం చేయడం. మధ్యాహ్నం నుండి కాశీలో దర్శించవలసిన ప్రదేశాలు చూడటంగా నిర్ణయించుకున్నాం. 'కరివెన'వారు నిత్యాన్నదానసత్రం ఏర్పాటు చేశారు. అన్ని ప్రాంతాలవారు వస్తుంటారు. 'అన్నదానం కంటే మించిన దానం లేదు' అనే ఆర్యోక్తితో సేవా దృక్పథంతో ఏర్పాటు చేశారు. దాతల సహకారంతో నిర్వహిస్తున్నారు. మేం కాశీలో ఉన్నన్ని రోజులు అక్కడే భోజనం చేయాలని నిర్ణయించుకొని అందరం కలసి యాభైవేలు అన్నదాన సత్రానికి విరాళాలిచ్చాం. మేం విశ్వేశ్వరుని చూసిన పుణ్యఫలం దక్కిందని సంబరపడ్డాం.

కాశీలో వున్నన్ని శివాలయాలు మరెక్కడా లేవు. అందుకే కాశీని 'సిటీ ఆఫ్ టెంపుల్స్' అంటారు. పూర్వం గంగానదిలో శవాలను సగం కాల్చి పడేసేవారట. గంగలో మునిగేవారికి శవాల కాలో, చెయ్యో వచ్చి తగులుతుండేదట. కాని నేడు ప్రభుత్వం కట్టుదిట్టమైన చర్యలు తీసుకోవడంవల్ల గంగ పరిశుభ్రంగా ఉంది. మణికర్ణికా ఘాట్‌లో శవాలు దహనానికి క్యూలో వుంటాయెప్పుడూ. ప్రభుత్వం 'ఎలక్ట్రికల్ క్రమేషన్' ఏర్పరచినా హైందవ సంస్కృతీ సంప్రదాయాలను నరనరాలలో జీర్ణించుకున్న జనం ఖర్చుకు చూడకుండా మణికర్ణికా ఘాట్‌లోనే దహన సంస్కారాలు చేస్తారు. ఇంకా ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే 'హర్చింద్ర ఘాట్'లో హరిశ్చంద్రుని వంశం వారే దహన సంస్కారాలు చేస్తున్నారట. వారి చేతిలో అక్కడ దహన సంస్కారాలు జరిగితే పుణ్యలోకాలు ప్రాప్తిస్తాయని ఎక్కువ మొత్తం అడిగినా అక్కడికి వెళ్తారు జనాలు...

మేం మరుసటిరోజు కాశీకి దూరంగా ఉన్న 'వ్యాస కాశీకి' వెళ్ళాం. గంగానది మీద ఇనుప డ్రమ్ములు వేసి కట్టిన బ్రిడ్జి అత్యద్భుతంగా ఉంది. ఆటోలు, వ్యాన్‌లు ఆ బ్రిడ్జిపై పోతుంటే ఉయ్యాలలూగినట్టుంటుంది. ప్రశాంత వాతావరణంలో ఉన్న వ్యాస ఆశ్రమం మనశ్శాంతిని కలిగిస్తుంది. నది ఒడ్డున నిల్చుని నదిలో విహరిస్తున్న పడవల్లోని దీపాలను చూస్తే పరమాత్మను చేరే ఆత్మల్లా ఉన్నాయి. వ్యాస మహర్షి ఇక్కడ స్వయంగా శివలింగాన్ని ప్రతిష్ఠించుకొని పూజించాడట. తర్వాత 'కాశీరాజు' కోటకు వెళ్ళాం. పిల్లలు "అమ్మా! కాశీ మజిలీ కథలు చెప్తారే? ఆ కాశీ రాజేనా? " అన్నారు.

"అవును!" అన్నా.

కాశీరాజు కోటను మ్యూజియంగా మార్చారు. అప్పటి రాజులుపయోగించిన శిరస్త్రాణాలు, ఆయుధాలు, రథాలు,

రాజులు, రాణులు ధరించిన బంగారు పోగులతో ఉన్న వస్త్రాలు, కిరీటాలు, వివిధ రకాలైన రత్న ఖచిత నగలు అందు లో భద్రపరిచారు. ప్రాచీన భారతీయ సంస్కృతీ సంప్రదాయాలను నేటి విద్యార్థు లకు పరిచయం చెయ్యటానికి అన్నట్లు మ్యూజియం విజ్ఞానదాయకంగా ఉంది.

మరుసటిరోజు బెనారస్ విశ్వవిద్యాల యాన్ని సందర్శించాం. ఎంతో ప్రాచీన చరిత్ర కలిగిన 'కాశీ విశ్వవిద్యాలయాన్ని' చూడగానే మా అందరికి ఒకలాంటి అను భూతి కలిగింది. విశ్వవిద్యాలయ ప్రవేశ ద్వారం దగ్గరే విశ్వవిద్యాలయాన్ని స్థాపిం చిన మదన్ మోహన్ మాలవ్యా నిలు వెత్తు విగ్రహం చూపరులను ఆకట్టుకొం టుంది. విశ్వవిద్యాలయంలో చాలా విభా గాలున్నాయి. ఒక్కొక్క విభాగం దగ్గరకు వెళ్ళాలంటే కారులో వెళ్ళాల్సిందే. నడ వలేం. అంటే అంత విశాలమైన ప్రాంగణం. యూనివర్సిటీ స్టూడెంట్ సెక్ర టరీకి కారు ఇస్తారు ఆ పదవిలో ఉన్నంత వరకు. నిశ్శబ్దంగా అందరూ ఎవరి పనులు వారు చేసుకుంటున్నారు. చదివితే ఇలాంటి యూనివర్సిటీలో చదవాలి అన్పిం చేదిలా ఉంది. తర్వాత మేం బిర్లామంది రానికి వెళ్ళాం. బిర్లాల రాజసం ఉట్టిపడేలా ఆలయాన్ని నిర్మించారు. అయితే బిర్లాలు సాధారణంగా వెంకటేశ్వరస్వామి, కృష్ణుడు దేవాలయాలు ఎక్కువగా నిర్మించారు కాని కాశీలో మాత్రం శివాలయాన్ని నిర్మిం చారు.

తర్వాత తులసీదాస్ మందిరానికి వెళ్ళాం. మందిరం ముందు భాగంలో ఆంజనేయస్వామి 'తులసీదాస్ రామా యణం' పుస్తకం పుటలు తిప్పుతున్నట్టుగా వుండి, ఆయన చెపుతున్నట్టుగా రామా యణం వినిపిస్తుంటుంది. ఇది పిల్లలను చాలా ఆకర్షించింది. మేడ పైభాగంలో రామాయణాన్నంతా ఒక్కొక్క ఘట్టంలో కదిలే బొమ్మలతో ఏర్పాటు చేశారు. పక్కనే ఘట్టాల వివరణ కూడ వుంది. పిల్లలెవరూ అక్కడి నుండి తొందరగా కద లడం లేదు. వాళ్ళను అక్కడ నుండి లాక్కొచ్చేసరికి రాత్రి ఎనిమిది గంటల య్యింది.

మరుసటిరోజు విశ్వేశ్వరుని ఆలయాన్ని దాటి బయటకు వస్తే, అక్కడ పూర్వ విశ్వ నాథ ఆలయాన్ని పడగొట్టి కట్టిన మసీదు ఉంది. కొద్దిపాటి దూరంలో ఉన్న విశాల మైన మండపం దగ్గరకు వెళ్ళాం. మూడు మీటర్ల చతురస్రాకారంలో ఇనుపకంచె వేయబడింది. అక్కడి నుండి కిందికి చూస్తే, పాతాళంలో ఉన్నట్లు శివలింగం దీపకాంతిలో చక్కగా కన్పిస్తుంది. మహ మ్మదీయులు ఆలయాన్ని పడగొట్టి మసీదు కట్టగా, ఇక్కడ స్వామి స్వయంభు వుగా వెలిశాడనీ, ఆ రోజుల్లో కాశీ పట్టణం అంతా పల్లంగా వుండేదని, కాలక్రమంలో అందరూ ఇళ్లు కట్టుకోవడంతో శివలింగం లోతులో వున్నట్లు అయ్యిందని పూజారి చెప్పారు. మేం ఇనుపకంచె చుట్టూ తిరిగి గోత్ర నామాలను చెప్పుకుంటూ పైనుండి అభిషేకం చేయించాం.

ఆ మండపంలోనే విశ్వనాథ దేవాలయా నికి సంబంధించి ఒక కార్యాలయం వుంది. మనం అక్కడ పైకం చెల్లిస్తే, మనం కోరిన రోజుకు అర్చన, అభిషేకం, పూజలు మన పేరున చేయించి, స్వామి వారి విభూది అక్షతలు, మారేడు దళా లను తపాలా ద్వారా పంపిస్తారు. మేం కూడా మా పిల్లల పుట్టిన రోజుకు అర్చన కని డబ్బు కట్టాం.

మరుసటిరోజు 'కాలభైరవుడ్ని' దర్శించాం. కాలభైరవుని దర్శనంతో ముక్తి లభిస్తుందని పెద్దలమాట. కాశీలో మా తొమ్మిది రోజుల నిద్ర పూర్తవడం వల్ల

# హీరోలా? జీరోలా?



అరిజోనా రాష్ట్రంలోని బెంటన్ కౌంటీకి చెందిన ఇద్దరు పోలీసు అధికారులు జో ఆర్పియో, ఏండీ లీ కఠినమైనవారనే పేరు తెచ్చుకున్నారు. వారు ఖైదీలను ఖాళీగా ఉంచకుండా పని చేయిస్తున్నారు. ఎడారిలోని టెంట్లలో వారిని ఉంచి దగ్గర్లోని ఊర్ల రోడ్డు పక్కన చెత్తను శుభ్రం చేయించారు. అప్పుడు ఖైదీలు పారిపోకుండా 18వ శతాబ్దంలోలాగ కాళ్లకి సంకెళ్లు వేశారు. వారికి పెట్టే భోజనం కూడా చవకదే. ఖైదీలకు టీవీ, రేడియో, సిగరెట్లు, పొగాకు, చాక్లెట్స్ నిషిద్ధం. తర్వాత పత్రికల్ని కూడా వారికి నిషేధించారు. వారు జైల్లో తమ గదుల్లో ఉంటే సిమెంట్ రంగు గోడలు, ఇనుప చువ్వలు తప్ప చూడటానికి ఇంకేం ఉండవు.



అనేకమంది స్వాతంత్ర్య ప్రియులు, ప్రజాస్వామ్య పిపాసులు వీరి పద్ధతులని ఆక్షేపిస్తే వారి మాటలను కొట్టి పారేస్తూ, 'పన్నులు చెల్లించే వారి ధనాన్ని ఈ నేరస్థుల సరదాకోసం ఖర్చు చేయడం సబబు కాదు. ఇళ్లల్లో దొరికే ఈ సుఖాలు కావాలంటే నేరాలు చేయకుండా ఇంటి పట్టునే ఉండాలన్న సందేశం వారికందేలా మేము జైలుని నిర్వహించదలచుకున్నాం' అన్నారు.

అమెరికన్ టీవీలు దీన్ని పాజిటివ్‌గా ప్రసారం చేస్తూ వీరిద్దరినీ అమెరికన్ హీరోలుగా కీర్తించడం గమనార్హం. 'జైలును దుఃఖకరమైన అనుభవంగా మారిస్తే మరోసారి నేరస్థులు జైలుకు రావడానికి జంకుతారు' అన్న అంశానికి న్యూయార్క్ పోస్ట్, యు.ఎస్.ఎ. టుడే పత్రికలు సానుకూలంగా వ్యాసాల్ని ప్రచురించాయి.

అమెరికాలో చట్టాలు పాలకులకు, బ్యూరోక్రసీకి విపరీతమైన అధికారాలు కట్టబెడుతుండటంతో ఇలాంటివి కొనసాగిస్తుంటారు. అందువల్లనే అక్కడ ఇలాంటి ప్రయోగాలు అమలు చేస్తుంటారని విమర్శ ఉంది.

మరుసటిరోజు 'గయ'కు బస్సులో బయలుదేరాం. కాశీ నుండి గయకు వెళ్ళే మార్గంలో అచ్చటచ్చట పచ్చని పంట పొలాలు కన్పించాయి. పర్యాటకుల కోసం హోటళ్ళు ఎక్కువగా ఆరుబయలు ప్రదేశాల్లో ఉన్నాయి. మేం ముందుగా 'బుద్ధ గయకు' వెళ్లి అక్కడినుండి గయకు రావాలనుకున్నాం. 'బుద్ధ గయ'లో మొత్తం తొమ్మిది బౌద్ధ మందిరాలున్నాయి. ముందుగా మేం బుద్ధునికి జ్ఞానోదయం కలిగిన బోధి వృక్షం దగ్గరకు వెళ్ళాం. అక్కడక్కడ బౌద్ధ బిక్షువులు ధ్యానం చేస్తూ కనిపించారు. చైనా, జపాన్, టిబెట్, సింగపూర్ మొదలైన దేశాల వారు నిర్మించిన బౌద్ధ ఆరామాలు వారి వారి సంస్కృతీ సంప్రదాయాలను ప్రతిబింబించేవిగా ఉన్నాయి. అయితే అంతటా నిశ్శబ్దమే. ఆలయాలు చాలా ఆకర్షణీయంగా వున్నాయి. బుద్ధగయ నుండి గయకు వచ్చి అక్కడ కొండపైనున్న 'మంగళగౌరి' ఆలయానికి వెళ్ళాం. గుడి ఓ గుహలాగా వుంది. లోపల వంగి నడుచుకుంటూ వెళ్ళి అమ్మవారిని దర్శించుకున్నాం. అప్పటికి ప్రయాణపు బడలికలో, తిరుగుడులో అలసి వున్న మేం మా బసకు చేరి తెలుగువారు నడుపుతున్న హోటల్లో భోజనాలు చేసి మరుసటి రోజు ఆలయానికి వెళ్ళి స్వామిని దర్శించి పిండ ప్రదానాలు చెయ్యాలని నిర్ణయించుకొని విశ్రమించాం. ఇక్కడ పెద్దగా చదువుకున్నవారు లేరు. మోసం, రౌడీయిజం ఎక్కువ కన్పించింది.

గైడ్ నలుగురు పూజారులను తీసుకొని

ఉదయమే బస దగ్గరకు వచ్చాడు. ఉత్తర ఫల్గుణీ నదిలో నీరు లేదని, అందుకని అందరూ స్నానాలు చేసి సిద్ధంగా వుండ మని రాత్రే చెప్పాడు కాబట్టి అందరూ తయారయ్యాం. ఉత్తర ఫల్గుణీ నదిలో ప్రవహిస్తున్న చిన్నపాయలో కాళ్ళు, చేతులు కడుక్కొని, తలపై నీళ్ళు జల్లుకొని పిండ ప్రదానం చేశాం. పిండాలతో విష్ణు ఆలయానికి వెళ్ళి ఆయన పాదాల చెంత పిండాలను పెట్టాం. మాలో కొంతమంది 'హిరణ్య శ్రాద్ధం' పెట్టారు. అంటే బతికుం డగానే మనకు మనమే తద్దినం పెట్టు కోడం. తర్వాత పిల్లలు తద్దినాలు పెట్టినా ఫరవాలేదు. పెట్టకపోయినా ఫరవాలేదు, అక్కడ పూజ చేయించి అశ్వత్థ వృక్షానికి ప్రదక్షిణలు చేశాం. ఆ చెట్టు దగ్గర ఇద్దరు కొద్దిగా సమ వయస్కులైన అమ్మాయి, అబ్బాయి నిలబడి "మీరు ఇక్కడకు వచ్చి నందుకు మీకిష్టమైన ఒకపండు, ఒక కాయ. ఒక ఆకు, ఒక పూవు వదిలి పెట్టాలి. మేం మంత్రం చెప్పి నువ్వులు, నీళ్ళతో మీ చేత వదిలిపెట్టిస్తాం. ఒక్కొక్క దానికి పది రూపాయలివ్వండి. లేకపోతే మీకు తీర్థయాత్ర ఫలం దక్కదు" అంటూ హిందీ, తెలుగు, అరవం, ఇంగ్లీషు భాష లలో చెపుతున్నారు. కామ, క్రోధ, మద, మాత్సర్యాలను వదిలిపెట్టాలి అని విన్నాం కాని పండ్లు, పూలు వదిలిపెట్టడమేమిటో అనుకున్నా. జిహ్వాచాపల్యాన్ని అదుపుచే సుకోవడానికి పెద్దవారు యిలా చేసి వుంటారనుకున్నా. అందరూ తమ కిష్ట మైనవాటి పేరు చెప్పి వదిలి పెడ్తున్నారు.

వెనకనే వున్న శ్రీవారు "నా కిష్టమైన దానివి నువ్వు కాబట్టి నిన్నే వదిలేస్తే పోలా" అన్నారు.

"సరే నేను కూడా అదేపని చేస్తున్నాలే" అన్నా నవ్వుతూ.

"ఎందుకో నాకు ఆ చెట్టు కింద పిల్ల లను చూస్తుంటే ఎవరివో తెలిసినవారి పోలికలు కనబడుతున్నాయండి. ఎంత బుర్ర బద్దలు కొట్టుకున్నా గుర్తుకు రావడం లేదు" అన్నా ఆలోచనగా! మరల గుర్తుకు వచ్చినట్టుగా నదీ తీరంలోని సంఘటన నా మనసంతా ఏదో అలజడి రేపినట్టయ్యింది.

నదీతీరంలో కొంతమంది ముత్తైదువులు ఒక చేటపై మరొక చేట బోర్లించి హిందీ, తెలుగు, అరవంలో "అమ్మా! మూగి వాయనం యిస్తారా? " అని తిరుగుతూ అడుగుతున్నారు. మా పూజారిని అడిగితే.. ముత్తైదువలు మూగి వాయనం గయలో నదీ తీరంలో మరొక ముత్తైదు వకు యిస్తే పుణ్యవతిగా పోతారని, ముక్తి పొందుతారని నమ్మకమని చెప్పారు.

ఆ చేటలో చీర, రవిక, పసుపు, కుంకుమ, గాజులు, పూలు, నల్లపూసలు, మెట్టెలు, తమలపాకులు, వక్కలుంటా యట. చీరను బట్టి రేటు మారుతుందట. కొంతమంది వారి దగ్గర తీసుకొని, మరల వారికే వాయనమిస్తుంటారట. బీదవారి కిస్తే పుణ్యంకాని మరల అయినవారికే ఇస్తే, 'జోగి జోగి రాసుకుంటే బూడిద రాలినట్టు' సామెతలాగ వుంటుంది. ఇది కొంతమందికి వ్యాపారమై తిరుగుతుంటా రని చెప్పారు. మాలో కొందరు మూగి వాయనం ఒకరికొకరు ఇచ్చుకున్నారు. నాకు వీటిపై నమ్మకం లేకపోవడం వల్ల నేను ఇవ్వలేదు. కాని నేను అక్కడ తిరు గుతున్నంత సేపు ఒకామె మేలి ముసుగు వేసుకొని నన్ను చూడగానే పక్కకు వెళ్ళి పోయింది. నాకు తెలిసిన తెలుగువాళ్లు ఇక్కడ ఎవరుంటారు? మరి ఆమె ఎందు కెళ్ళిపోయింది? మరల అక్కడికి వెళ్ళి చూస్తే ఆమె లేదు. ఎంత గుర్తుకు తెచ్చు కుందామన్నా నా ఆలోచనలు కుదరడం లేదు. "గయలో గోదానం, సువర్ణదానం,

భూదానం, అన్నదానం చేస్తే పుణ్యలోకాలు ప్రాప్తిస్తాయి. కాబట్టి మాకు వెయ్యిన్నూట పదహార్లిస్తే ఆ దానాలన్నీ స్వీకరించి మంత్ర పూరితంగా చేస్తాం" అని పూజారులు చెప్పేసరికి అందరూ డబ్బుకట్టి ఆ దానాలు ఆ బ్రాహ్మలకిచ్చారు. అప్పటికే మధ్యాహ్నం కావడంతో అందరికీ ఆకలి మంటలు. ఆ బ్రాహ్మలే అందరికీ మంచి ఆంధ్ర భోజనం ఏర్పాటు చేశారు. నేను పనులన్నీ యాంత్రికంగా చేస్తున్నానే కాని "ఆమె ఎవరు? నన్ను చూసి ఎందుకు ముఖం చాటు చేసుకుంది? " అని ఆలోచిస్తూనే ఉన్నాను. భోజనం చేసి సత్రానికి వచ్చి అందరం విశ్రమించాం. గదిలో పడుకున్నానే కాని ఎడతెగని ఆలోచనల వల్ల కన్నులు మూతలు పడలే. ఆయన, పిల్లలు, అమ్మమ్మ, తాతయ్య అందరూ గుర్రుపెట్టి నిద్రపోతున్నారు.

గడ్డం కింద 'బ్యూటీ స్పాట్'లా వున్న ఆ పుట్టుమచ్చ. ఆc... ఇందాక నేను చూసిన ఆమె రాధికే.. సందేహం లేదు. మరి రాధిక ఇక్కడికి ఎందుకు వచ్చింది? ఒక్కతే కూతురు కావడం వల్ల, లేటు వయస్సులో పుట్టడం వల్ల కొండమీద కోతినైనా తెచ్చిచ్చేవారు అమ్మనాన్నలు ఆమెకు. అందుకే పెంకితనం, అలక సర్వసాధారణ మయిపోయాయి. మాతోటే మాకంటె చాలా చిన్నది, మా మాస్టారి కూతురు 'సత్య' కూడ వుండేది. చిన్నది కావడం వల్ల మేమిద్దరం ఎప్పుడూ పెత్తనం చెలాయిస్తుండేవాళ్ళం. వామన గుంటలు, కుందుడుగొమ్మ, అచ్చనగాయలు ఆడుతుండే వాళ్ళం. సత్య ఆటలో వోడిపోతే ఏడుస్తూ అలిగిపోయేది. మేం ఆ అమ్మాయి అసలు పేరు 'సత్యవేణి' అయితే సత్యభామ అని, ఎర్రగా సన్నగా వుండేది కనుకే 'ఎర్రతేలు' అని పిలుస్తుండే వాళ్ళం. రాధిక ఇంకా ఎక్కువగా ఎగతాళి చేసేది. సెలవొస్తే చాలు ఏటి ఒడ్డుకు

## కొత్తగాలి...

**మనసు పెడితే**
**విజయం**
**మనసు చెడితే**
**వియోగం**

–అయినాల కనకరత్నాచారి,
కోరిశపాడు, ప్రకాశం జిల్లా

వెళ్ళి పోటీలు పడి పిచ్చుక గూళ్ళు కట్టి వాటిపై తంగేడు పూలు, తుమ్మిపూలు, రకరకాలైన పిచ్చి పూలన్నీ అలంకరించి మురిసిపోయేవాళ్ళం. రాధిక పిచ్చుకగూడు బాగా లేదని దారిన పోతున్న వారెవరైనా అంటే మిగతావాళ్ళ గూళ్ళు తొక్కిపారేసేది. మాస్టారిగారి వరండాలో 'బొమ్మల పెళ్లి' చేసేవాళ్లం. మాస్టారు భార్య మాకు తినుబండారాలు అందించేది. బొమ్మలకు కావలసిన వస్తువులన్నీ రాధిక తెచ్చేది. రాధిక వాళ్ళిల్లు ఎప్పుడూ వచ్చేపోయే వాళ్లతో హడావుడిగా వుండేది. అందుకని మా ముగ్గురితో పాటు, మా తమ్ముడు కూడ మాస్టారు గారింట్లోనే ఆటలు ఆడే వాళ్లం. ఒక్కోసారి మాస్టారు భార్య మాకు అన్నం కలిపి ముద్దలు పెట్టేది. వేడివేడి అన్నంలో చింతకాయ పచ్చడి వెన్నకాచిన నెయ్యి వేసి పెడ్తుంటే ఎన్ని ముద్దలు తినే వాళ్ళమో? ఆ ఆపేక్షలు ఇప్పుడేవి? పోయినసారి పల్లెకు వెళ్ళినప్పుడు సత్య హాస్టలులో వుండి కంప్యూటరు కోర్సు చదువుతోందని తెల్సింది. రాధిక నాకంటే రెండేళ్ళు పెద్దది. రాధిక పెద్దదయ్యేసరికి చక్కగా కుందనపు బొమ్మలా తయారైంది. అయితే పట్నపు గాలి సోకక పోవడం వల్ల అమాయకంగా వుండేది. తను డాబూ, దర్పం చూపించడానికన్నట్టు హైస్కూలుకు కూడా కంచీ పట్టు పావడా, జాకెట్టు, వోణి, చామంతి, బిళ్ళ, జడకుచ్చు

లతో బారు జడ ఊపుకుంటూ ముంజేతి గాజులు సవరించుకుంటూ వచ్చేది. సరిగ్గా అప్పుడే మాకు ఇంగ్లీషుకొచ్చే కుర్ర మాస్టారు మాయలో పడింది.

ఇంట్లో కొంత సొమ్ము, నగలు తీసుకుని రాధిక ఇంగ్లీషు మాస్టారితో ఎటో వెళ్లిపోయింది. ఆ అవమానాన్ని భరించలేక ఉన్న ఊరిలో తలెత్తుకోలేక ఆస్తిని వచ్చిన కాడికి అమ్మేసి కరణంగారి దంపతులు ఎటో వెళ్లిపోయారట. తర్వాత చాలా రోజులకు వాళ్ళ చుట్టాలు కన్పించి, కూతురి దిగులుతోనే వారు మంచంపట్టి ఆర్నెల్లు తేడాతో ఇద్దరూ చనిపోయారని చెప్పారట. తాతయ్యా చెప్పిన ఈ సంఘటనలన్నీ ఒక దాని వెంబడి ఒకటి సినిమా రీలులాగ గుర్తుకు రావడంవల్ల ఆమె కచ్చితంగా రాధికే అన్పించింది. వెంటనే ఆలస్యం చేయకుండా గుడి దగ్గరకు వెళ్లి ఒక వృద్ధ పూజారిని, 'ఆమె' గురించి అరాతీస్తే ఆమె పేరు సీతమ్మ అని, త్రివేణి సంగమం దగ్గర దిక్కుతోచక పిల్లలను పెట్టుకొని ఏడుస్తూ వుంటే తను తీసుకువచ్చాననీ చెప్పాడు. వయస్సులో వున్న ఆమె ఒంటరిగా వుంటే అందరి ఆకలిచూపులు ఆమె మీదే ఉంటాయి. ఈ రాబందుల రాజ్యంలో ఆడది ఒంటరిగా బతుకలేదు. అందుకే ఆమెకు నచ్చచెప్పి ఇక్కడకు తీసుకువచ్చి కూతురిలా సహాయంగా వుండమన్నానన్నాడు. పిండాలకు కావలసిన అన్నం వండిపెడ్తూ పిల్లలిద్దరిని పోషిస్తోంది అంటూ ఆ చెట్టు దగ్గరవున్న యిద్దరు పిల్లల్ని చూపాడు. తను ఎన్నో ఏళ్ళ క్రితం బతుకు తెరువు కోసం యిక్కడికి వచ్చాననీ, భార్య చనిపోయిందని, దరిమిలా ఇలా కాలక్షేపం చేస్తున్నానని అన్నాడాయన.

"ఆమె గురించి వివరాలు ఎన్నిసార్లు అడిగినా హృదయ విదారకంగా ఏడుస్తుందే కాని ఏమి చెప్పదు. నేను ఎప్పుడు రాలిపోతానో చెప్పలేను. నేను పోయేలోపు ఆమెను వాళ్ల వాళ్ల దగ్గరకు చేర్చాలని నా తాపత్రయం. ఆమె వచ్చి సుమారు పదేండ్లపైనే అయ్యింది. ఆమెను గురించి వివరాలడిగిన వారెవ్వరూ లేరు మీరు తప్ప. మీరు ఆమెకేమైనా కావలసిన వారేమో? ఆమెకేదైనా దారి చూపుతారనే ఆశతో చెప్పా" అన్నాడు ఆయాసం తీర్చుకుంటూ ఆ పెద్దాయన.

"మేం ఆమె బంధువులం. ఒక్కసారి ఆమె దగ్గరకి నన్ను తీసుకుపొండి" అన్నా.

"రోజూ ఈపాటికి వచ్చేదే? ఎందుకు రాలేదో? " అంటూ.

"రాఘవా! అన్నపూర్ణా!" ఇటురండి అనే సరికి ఆ పిల్లలిద్దరూ "ఏమిటి తాతయ్యా" అంటూ వచ్చారు.

"వీరిని మన ఇంటికి తీసికెళ్లండి" అన్నాడు.

వాళ్లు ప్రశ్నార్థకంగా ఆయనవైపు చూస్తూ నిలబడ్డారు.

"ఇంతవరకు ఆమెకోసం ఎవ్వరూ రాలేదు. అందుకే మిమ్మల్ని చూసేసరికి పిల్లలు ఆశ్చర్యపోతున్నారు" అన్నారు నాతో.

వెళ్లేటప్పుడు స్వీటు, హాటు ప్యాకెట్లు తీసుకున్నా. పిల్లల వెంట ఎన్నో సందులు, గొందులు తిరిగి చివరకు ఒక చిన్న పెంకుటింటి ముందు ఆగాం. "అమ్మా! అమ్మా!" అంటూ పిల్లలు పిలిచేసరికి చేటలో బియ్యం పోసి చెరుగుతున్న ఆమె ఒక్కసారి వెనక్కి తిరిగి పిల్ల వెంట ఉన్న నన్ను చూసి రెండు చేతులు మొహానికి అడ్డం పెట్టుకొని హృదయవిదారకంగా ఏడవడం మొదలెట్టింది.

"రాధీ!" అంటూ రెండు చేతులూ ఒక్కసారి లాగేశా. భుజం మీద చెయ్యేసి అరుగుమీద కూర్చోబెట్టా. పిల్లల చేతిలో స్వీటు, హాటు పెట్టి తినమన్నా.

"నీ ఈ అజ్ఞాత వాసానికి కారణ మేంటి? ఏమిటీ దుస్థితి? " అన్నా ఆందోళన నిండిన గొంతుతో.

"చేసుకున్న వాళ్ళకు చేసుకున్నంత. నా దురదృష్టం నన్నీ స్థితికి తెచ్చింది. ఎవరిని నిందించి ఏం ప్రయోజనం? " అంది.

"ఏమీటీ వేదాంతం? " అన్నా.

"ఏమీ చేతకాని వాళ్ళు మాట్లాడేది వేదాంతమే కదా! ఏముంది? మామూలు కథే. నన్ను చేసుకోవడం వాళ్ళ వాళ్ళకు యిష్టం లేదట. అందుకని మెద్రాసు వెళ్ళాం. ఆ మహా పట్టణంలో ఏవో చిన్న, చితక ఉద్యోగాలు చేశాడు. యిద్దరు పిల్లలు పుట్టేసరికి నాతో తెచ్చుకున్న డబ్బు, నగలు హారతి కర్పూరంలా కరిగిపోయాయి. అప్పటినుండి వేధింపులు ఎక్కువయ్యాయి. రోజూ తాగి రావడం, కొట్టడం... ఒకరోజు నేను ఎదురు తిరిగే సరికి "నువ్వేం పెద్ద అందగత్తెవని చేసుకోలేదు. నువ్వే నా వెంట పడ్డావు. మీ నాన్న ఆస్తి చూసి చేసుకున్నా. పిల్లలను తీసుకొని వెళ్ళి ఆస్తి రాయించుకొని వస్తే, రా. లేకపోతే అక్కడే చావు" అంటూ పిల్లల ఎదురుగానే తిట్టడం మొదలు పెట్టాడు.

"నేను ఎలా వెళ్ళను? వాళ్ళను అంత అవమానానికి గురిచేసిన నేను ఏ ముఖం పెట్టుకొని వెళ్ళేది? " అన్నా. అప్పటి నుండి ఇంటికి సరిగా రాకపోవడం, తన తరపు బంధువులను తీసుకువచ్చి వాళ్ళకు సేవలు చేయించడం ఎక్కువయ్యింది. వారిముందే నన్ను, పిల్లలను హీనంగా చూసేవారు. పైగా వెధవ సంత నా మెడకు చుట్టుకుందని గొణిగేవాడు. దిక్కులేక అన్నింటినీ భరించా. చివరకు ఒకరోజు వున్నట్టుండి మాయమయ్యాడు. పిల్లలు నేను భాషరాని చోట దిక్కులేని వాళ్ళమయ్యాం. అమ్మా, నాన్న దగ్గరకు ఎలా రాను? ఊళ్ళో కాకుల్లా పొడవరా? ఆ అవమానం తట్టు

కోలేననుకున్నా. అప్పులవాళ్లు రోజూ జాతర చేస్తున్నారు. ఆరు నెలల ఇంటి అద్దె బాకీ వున్నాడట. నువ్వు ఒప్పుకుంటే 'చిన్నింటిలో' వుంచుతా. బాకీ మాఫీ చేస్తా అంటూ రాయబారం పంపాడు ఇంటి యజమాని. ఈ రాబందుల ధాటికి తట్టుకోలేక పిల్లలను తీసుకొని కట్టుబట్టలతో కన్పించిన రైలెక్కా. రెండు రోజులుగా తిండిలేకపోవడం వలన, మనోవ్యధ వలన నిద్రలేదు. రైలులో ఒక మూల ఒదిగి పిల్లలను పెట్టుకొని కూర్చున్నా. నిద్ర పట్టేసింది. టికెట్ కలెక్టరు వచ్చి ఫైన్ కట్టమన్నాడు. ఆయన తెలుగువాడే. నా కథంతా విని పక్క స్టేషనులో రైలాగగానే దిగి పొమ్మని చెప్పి వెళ్ళిపోయాడు. కన్ను పొడుచుకున్నా కానరాని చీకటిగా వుంది మేం దిగిన ప్రదేశం. బాగా లైట్లు వెలుగుతున్న ప్రాంతానికి వచ్చి బోర్డు చూస్తే 'ఇలహాబాదు' అని వుంది. బతుకు మీద విరక్తి కలిగింది. త్రివేణి సంగమానికి దారి ఎటు అని కనిపించిన వారినల్లా అడుగుతూ యమునా నది ఒడ్డుకు చేరా. చిన్న చిన్న పిడతలలో పూలు, అక్షింతలు, బొరుగులు, కొంత దక్షిణ వుంచి దంపతుల చేత 'నిమజ్జనం' చేయమని నీటిలో విడిపిస్తారు. ఆ పిడతలలో వున్న డబ్బులకోసం నీటిలో పిడత వదిలీ వదలగానే అక్కడవున్న చిన్న పిల్లలు బుడుంగున మునిగి పిడత నందుకొని, ఆ దక్షిణ తీసుకుంటారు. నేను పోతే నా పిల్లలు అనాథలయి అలాగే బతకాల్సి వస్తుందేమో నన్పించింది. నేచేసిన తప్పుకు పిల్లల జీవితాన్ని ఎందుకు బలి పెట్టాలి? అనుకున్నా. అందుకే పాప పరిహారార్థం త్రివేణి సంగమంలో మునిగి కొత్త జీవితాన్ని ఆరంభించాలి అనే స్థిర నిశ్చయంతో ముందుకెళ్ళా. నిస్త్రాణవల్ల స్పృహ తప్పి పడిపోయా. ఎవరో వృద్ధుడు నాకు సపర్యలు చేసి పిల్లలను ఓదార్చి గట్టుమీదకు తీసుకొచ్చాడు. మాకు తినడానికి తెప్పించి, వివరాలు తెలుసుకున్నాడు.

అప్పుడు ఆయన "ఈ వృద్ధాప్యంలో అందరూ నన్ను ఒంటరిని చేసి వెళ్లిపోయారు. నీవు నాకు కూతురు లేనిలోటు తీరుస్తూ నా దగ్గరే ఉండు. నువ్వు ఒంటరిగా ఈ పిల్లలతో బతకలేవు. నాతో రా" అన్నాడు.

"గత్యంతరం లేక ఆయన వెంట గయకు వచ్చా. పిల్లలకు, నాకు తిండికి గడిచిపోతున్నది. ఈ జీవితానికింతే చాలు అనుకున్నా. నా తప్పుకు నేనే శిక్ష అనుభవిస్తున్నాను. ఇదివరకు చేసిన తప్పులకు నరకంలో శిక్ష అనుభవిస్తారనేవారు. నేను చేసిన తప్పుకు ఆ నరకాన్నంతా ఇక్కడే అనుభవించా" అంది.

"పిల్లలకు చదువు చెప్పించాలి అని నీకు అన్పించలేదా? " అన్నా.

"చదువుకొని నేను వెలగబెట్టింది తెలుస్తూనే వుంది. అందుకే వాళ్లు వాళ్ళ తాతయ్యతోటే గుడికి పోవడానికి, ఆ మంత్రాలు నేర్చుకోవడానికి అలవాటు పడ్డారు. వారికి ఆయన యింటి దగ్గరే వేదం, సంస్కృతం కూడా నేర్పిస్తుంటారు. నేను వాటితోనే తృప్తిపడటం నేర్చుకున్నా" అంది నిస్పృహగా.

నా ఆలోచనలో నేనుండగానే పండిట్ జీ వచ్చి "అమ్మా! ఈమె మీకు చుట్టాలవుతుంది అన్నారు కదా! వారి తల్లి, తండ్రి అడ్రసు కాని, అన్నదమ్ముల అడ్రసుగాని చెప్పండి. నేను పెద్దవాడినైపోతున్నా. ఎప్పుడు పిలుపొస్తోందో? ఈ ప్రపంచంలో ఈమె ఒంటరిగా బతకలేదు. ఈమెను వాళ్ల దగ్గరకు చేరుస్తాను" అన్నారు.

"మా అమ్మా, తాతయ్య అందరూ ఉన్నారు. వారితో మాట్లాడి ఆమెకు, పిల్లలకు ఏ లోటు లేకుండా నేను చూస్తా.

మీరు నిశ్చింతగా ఉండండి" అని చెప్పా పండిట్ జీతో.

"మళ్లీ వస్తాను రాధీ" అని చెప్పి మేం బస చేసిన సత్రం దగ్గరకు వచ్చి తాతయ్యకు అంతా వివరంగా చెప్పా. వెంటనే తాతయ్య "శాంతీ! రాధిక చాలా ఆత్మాభిమానం గల పిల్ల. మనం ధన సహాయం చేస్తే స్వీకరించదు. వాళ్ల నాన్న పొలాలు, ఇల్లు అమ్మితే చౌకగా కొన్నాను. అందుకని ఆమెకు, పిల్లలకు శాశ్వత సహాయం చేద్దాం" 'కాశీ విశ్వవిద్యాలయం' పరిధిలో సంస్కృత పాఠశాల, కళాశాలలున్నాయి. వారే తరగతిలో సరిపోతే అందులో చేరి చదువుకునేటట్టు ఏర్పాటు చేస్తాను. దానికి అనుబంధంగా మన తెలుగువారే ఆశ్రమం నిర్వహిస్తున్నారు. రాధిక అక్కడ ఉండవచ్చు. అన్నీ వారే చూసుకుంటారు. ఆ మేనేజిమెంట్ వాళ్లు నాకు తెలిసినవాళ్లే. పిల్లల పేరున రెండు లక్షల ఫిక్సెడ్ వేస్తాను. వారి అవసరానికి పనికి వస్తుంది" అన్నారు తాతయ్య మనస్ఫూర్తిగా.

"అబ్బ! ఎంత దొడ్డ మనస్సు నీది తాతయ్యా" అన్నా సంతోషంగా.

"ఏదో పొరపాటు వల్ల తప్పు జరిగిపోయింది. ప్రాయశ్చిత్తంగా అనుభవిస్తున్నది. మన చేతనైన సహాయం మనం చెయ్యకపోతే ఇక ఎవరున్నారు రాధికకు. శాంతీ! రాధికను, పిల్లలను ఇప్పుడే మనతో బస్సులో కాశీకి తీసుకెళ్దాం. మనమే దగ్గరుండి చేర్పిస్తే మనకు ఒక మంచి పని చేశామన్న తృప్తి జీవితాంతం ఉంటుంది. అమ్మమ్మను తోడు తీసుకుని వెళ్లి నువ్వే నచ్చచెప్పి తనని తీసుకురా!" అన్నారు తాతయ్య.

"తాతయ్యా! ఆ చిన్న సందుల్లోకి బండ్లేమి పోవు. అమ్మమ్మ అంత దూరం నడవలేదేమో" అన్నా సందేహంగా.

"అయితే మనిద్దరం ఇప్పుడు రాధిక దగ్గరకి వెళ్లి మనం అనుకున్న విషయాలు చెప్పి పండిట్ జీ గారితో కలిసి సంస్కృత కళాశాల దగ్గరకు రమ్మని చెబుదాం. పండిట్ జీకి కొంత డబ్బు ఇచ్చి తననే వెంటబెట్టుకుని రమ్మందాం. మనం వెళ్లేముందు ఆమెకు ఒక ఆధారం చూపించిపోతే బాగుంటుందని నా ఉద్దేశం" అన్నారు తాతయ్య.

అలాగే ఇద్దరం వెళ్లి రాధికను బతిమాలి ఒప్పించి పండిట్ జీకి డబ్బిచ్చి బయలుదేరాం. మరుసటిరోజు ఉదయం పదకొండు గంటలకు నేను, తాతయ్య మా శ్రీవారు కలిసి సంస్కృత కళాశాల దగ్గరకు వెళ్లేసరికి వాళ్లు వచ్చివున్నారు. పిల్లలి

## పల్లెకూ పట్నానికీ తేడా?




ఆధునిక నాగరికత తెచ్చిన పట్నం జీవితంతో విసుగు చెంది, దానికి రియాక్షన్‌గా ప్రకృతిలోకి వెళ్లి జీవించాలనే ధోరణి పారిశ్రామిక విప్లవం వచ్చిన తొలినాళ్లలోనే మేధావులు, కవుల్లో అంకురించింది. దీంతో పల్లెటూరి జీవితాన్ని ఆకాశానికెత్తివేయడం సాధారణమైంది. ఓసారి పల్లెటూరి జీవితం గురించి ఆస్కార్‌వైల్డ్‌ను ఏమని చెబుతారో చూద్దామని అడిగితే ఇలా చెప్పారు: పల్లెటూరిలో స్వచ్ఛమైన కలుషితంకాని గ్రామీణ జీవితం ఉంటుంది. వారు పెందరాళే లేస్తారు. దానికి కారణం చేయడానికి వారికెన్నో పనులు ఉంటాయి. అలాగే రాత్రిళ్లు చాలా త్వరగా పడుకుంటారు.. కారణమేమంటే ఆలోచించేందుకు వారికేమీ విషయం తట్టదు. వాస్తవానికి వారి బుర్రలు దేనిగురించీ ఆలోచించవు. వారికి కడుపుకింత పడితే చాలు కాబట్టి.

ద్దరిని తొమ్మిదో తరగతిలో చేర్చుకున్నారు. పచ్చని చెట్ల మధ్య, ప్రశాంత వాతావరణంలో పిల్లలు శ్లోకాలు పఠిస్తుంటే మన సంస్కృతి ఇంకా జీవిస్తోందనే తృప్తి కన్పిస్తోంది. పక్కనే పిల్లలకు హాస్టల్, ఆశ్రమం కూడా ఉంది. ఆ ఆశ్రమంలో స్త్రీలకే ప్రవేశం. చదువుకోవచ్చు పనిచేస్తూ. అందుకని రాధికను చదువుకొనమని, అప్పుడప్పుడు ఉత్తరాలు రాస్తుండమని, మా అడ్రసు, ఫోన్ నెంబర్లు ఇచ్చాం. "ఏ అవసరమొచ్చినా మేమున్నామనే సంగతి గుర్తుంచుకో" అని తాతయ్య చెప్పేసరికి రాధిక కళ్ల నీరు తుడుచుకుంటూ ఆయన కాళ్లకు నమస్కరించింది. "లే తల్లి!" అంటూ ఊరడించారాయన.

మరుసటిరోజు ఉదయం పదిగంటలకు 'వారణాశి ఎక్స్‌ప్రెస్'లో మా తిరుగు ప్రయాణం. అందుకని అందరం తెల్లవారుజామునే గంగలో మునిగి తెచ్చుకున్న వాటర్ క్యాన్‌లలో గంగా జలాన్ని నింపుకొని, విశ్వనాథుని కడసారి మనసారా దర్శించుకొని బయలుదేరాం. అంతా ఉదయం అల్పాహారం ముగించాం. మధ్యాహ్నం భోజనానికి ముందుగానే హోటల్‌లో ఆర్డరిచ్చి పులిహోరా ప్యాకెట్లు, దధ్యోదనం ప్యాకెట్లు, చపాతీలు చేయించారు. ఈ లగేజి అంతా ఒక పెద్ద బస్తాకు వేసి సీల్ వేశారు. కొంతమంది పెద్దలు 'యాత్రకు పోతే పాత్ర' కొనాలి అనే నానుడి ప్రకారం దీపపు సెమ్మలు, అగరొత్తుల స్టాండులు, రకరకాలైన ఇత్తడి పూజాసామాగ్రి కొన్నారు. కొంతమంది స్త్రీలు కాశీకి వచ్చి బెనారస్ చీరలు కొనకుండా పోవడమేమిటని అన్నారు. నేను కూడా కొన్ని చీరలు కొన్నా. అన్నపూర్ణా వస్త్రాలయ 'ముక్తికాంత' శాంతినొక్కదాన్నే వరిస్తుంది. మనకెవ్వరికి కాశీయాత్ర ఫలం దక్కదు" అన్నాడు మామయ్య వరుసైన ఆయన నన్ను ఆటపట్టిస్తూ. ఇంతలో రైలు స్టేషనులో ఆగడంతో బిలబిలా అందరూ దిగుతుంటే ఓ లంబాడీ యువతి నా దగ్గరకు వచ్చి కాళ్ళకు దణ్ణం పెట్టబోయింది. ఆమెను వారించి, పిల్లవాడి చేతిలో బిస్కట్ ప్యాకెట్ పెట్టా. ఆమె దణ్ణం పెడుతూ దిగిపోయింది. రైలాగడంతోటే కొంతమంది రాత్రి భోజనం కోసమై కొన్ని ప్యాకెట్లు, పిల్లలకు బిస్కట్లు, మంచి నీళ్ళు తెచ్చారు. ఒక టీ వాడిని పంపించారు. అందరూ వేడివేడిగా టిఫిన్లు తిని, టీ తాగి హమ్మయ్య అనుకుంటూ సర్దుకొని కూర్చున్నారు. వెళ్ళేటప్పుడున్నంత ఉత్సాహం లేదు. అందరూ డస్సిపోయి వున్నారు. ఒక్కొక్కవారం ఒకొక్క కుటుంబంవాళ్ళు కాశీ సమారాధన చేసేటట్లు యాత్రకెళ్లిన వాళ్ళందరిని పిలుచుకునేటట్లు మాట్లాడుకున్నారు. మళ్ళీ స్కూళ్ళు, కాలేజీలు తెరుస్తారు కాబట్టి అమ్మా, నాన్నను, అమ్మమ్మ, తాతయ్యలను వుండమని, మా యింట్లో ఎల్లుండి కాశీ సమారాధన అందరూ తప్పక రావాలని అక్కడే అందరికీ బొట్టు పెట్టి మరీ చెప్పా.

"శాంతి తెలివయింది. ఇంటికెళ్ళాకయితే ఇల్లిల్లూ తిరిగి పిలవడం కష్టమని వెంటనే నిర్ణయించుకొని అందరిని యిక్కడే పిల్చింది" అన్నారొకరు.

"అమ్మా, నాన్నా, తాతయ్య, అమ్మమ్మ మళ్ళా వెళితే యిప్పుడల్లా రారు. ఎటూ వాళ్లూ చేసుకోవాలి కదా. అందుకని మా యింట్లోనే అయితే నాకూ సహాయంగా వుంటుందని తొందరగా చేస్తున్నా. మళ్ళీ ఎక్కువ రోజులుండమంటే వాళ్ళుండరు కదా!" అన్నా వారినందరిని ఒప్పిస్తూ. "మన కాశీయాత్ర తర్వాత మొదటి సమారాధన మీ యింట్లో కాబట్టి యావన్మంది వస్తాం" అన్నారు నాటకీయ ఫక్కీలో. అంతా నిద్రకుపక్రమించారు.

## కొత్తగాలి...

**వరద సంగతి**
**ఆనకట్టలు చూసుకుంటాయి!**
**కన్నీటి వరదకు**
**కొత్త ఆనకట్టలు**
**కరకట్టలు వెయ్యండి!**

-డి. హెచ్.సంతోషి,
దొడ్డనకుంది, బెంగళూరు

నేను మనసులో ఇంటికి పోగానే చేపట్ట వలసిన పనులను ప్రాధాన్యతా క్రమంలో పేర్చుకుంటూ ఒక కాగితం మీద వ్రాసి పర్సులో పెట్టుకున్నా. ఎన్నో రోజుల నుండి మేం కలలు కంటున్న కాశీయాత్ర శుభప్రదంగా ముగిసినందుకు పరమేశ్వరు నికి కృతజ్ఞతలు చెప్పుకున్నా. ఆశ్చర్యకర మైన విషయమేమిటంటే చిన్న పిల్లలు, పెద్దలు అంతా రోజూ పదిహేను రోజుల నుంచి తలారా స్నానం చేస్తున్నాం. అలాగే అందరూ రాత్రిపూట చపాతీలు, పరోటాలు లాంటివి తిన్నారు. ఒక్కరు కూడా చిర్రున చీదలేదు. ఏ విధమైన అనారోగ్యం లేదు. మందులు తెచ్చాం. కాని వాటి అవసరం రాలేదు. అంతా సర్వే శ్వరుని దయకాక మరేమిటనుకున్నా. స్టేషను రావడంతో అంతా దిగాం.

★ ★ ★

అనుకున్న ప్రకారమే కాశీ సమారాధన దిగ్విజయంగా ముగిసింది. అమ్మ, నాన్నకు, అమ్మమ్మ, తాతయ్యలకు బట్టలు పెట్టి ఆశీర్వచనం తీసుకున్నాం. వచ్చిన ముత్తైదువులందరికి జాకెట్ తో పాటు, కాశీలో కొన్న 'ఇత్తడి దీపారాధన' సెమ్మను దీపం వెలిగించి యిచ్చాను. ఎంతో తృప్తిగా అన్పించింది.

భోజనాలయ్యాక అందరం హాలులో మాట్లాడుకుంటుంటే మా తమ్ముడు మాధవ్ అమెరికా నుండి వచ్చే నెలలో వస్తున్నానని, రెండు నెలలుంటానని ఫోన్ చేసి చెప్పాడు. మా అందరి ఆనందానికి అవధులు లేవు. ఎందుకంటే మాధవ్ సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌గా అమెరికా వెళ్ళి సుమారు అయిదు సంవత్సరాలయ్యింది. ఇప్పుడే రావడం. అప్పుడే మా అమ్మ, నాన్న అందరూ ఒకరికొకరు మాట్లాడుకొని వాడి పెండ్లి చేయాలని నిర్ణయించుకు న్నారు.

"అమ్మాయ్! మీ పెద్దన్నయ్య అమెరికా నుండి వచ్చి బాంబేలో సెటిలయ్యాడు కదా? వాళ్ళిద్దరి అమ్మాయిల్లో ఒకరిని మాధవ్‌కి అడగాలనుకుంటున్నానని ఓసా రి చెప్పాడు" అన్నాడు తాతయ్య అమ్మతో.

"అదేమిటి? హైదరాబాద్‌లో వున్న చిన్నవాడు మా పిల్లలు కంప్యూటర్ ఇంజ నీర్లు. వారినే చేసుకుంటాడన్నట్టు మాట్లా డాడే" అంది అమ్మమ్మ.

"పోయిన నెలలో బుల్లి మామయ్య మా ఇంటికి వచ్చినప్పుడు తనకు ఒక్కగానొక్క కూతురు, బోలెడంత ఆస్తి వుందని, తమ కూతురు 'గజలక్ష్మి' కొంచెం బొద్దుగా వున్నా ముద్దుగా వుంటుందన్నాడు. మాధవ్‌కు నీ దగ్గర బాగా చనువు కదా! నీవు చెబితే వింటాడు. మీ అమ్మ ఏదో ఒకటి అడ్డుపుల్ల వేస్తుందంటూ చెప్పాడు" అన్నా.

"వాడి పెళ్ళి విషయంలో మేం సొంత నిర్ణయాలు తీసుకోదల్చుకోలేదు. కాలాన్ని బట్టి మనం మారాలి. వాడిష్టానికే వదిలి పెట్టాను. అందుకే రేపు వాడు ఎటూ బొంబాయి ఎయిర్‌పోర్టులో దిగుతాడు కాబట్టి పెద్దన్నయ్య వాళ్ళింటికి వెళ్ళి ఒకరో జుండి రమ్మంటా. అలాగే హైదరాబాద్ వెళ్ళి, వస్తూ చిన్నవాడి దగ్గరకు వెళ్ళి వస్తే ఒక అభిప్రాయానికి రావచ్చు. వాడు వున్నన్ని రోజులు అందరం మన పల్లెలో

# టీ బ్యాగ్స్ చరిత్ర



తేయాకు వాడుకకు మూడు శతాబ్దాల చరిత్ర ఉంది. భారతదేశం లోని ఈస్టిండియా ట్రేడింగ్ కంపెనీకి బ్రిటిష్ రాణి ఎలిజబెత్-1 తేయాకు వ్యాపార హక్కులిచ్చి, వచ్చిన లాభంలో మూడోవంతు స్వీకరించేది. ఆ రోజుల్లో వెండిని ఇచ్చి తేయాకును చైనా నుంచి దిగుమతి చేసుకునేవారు. 1830లో బ్రిటిష్‌వారు అస్సాంలో టీ ఎస్టేట్లను అభివృద్ధి చేశారు. అనేక లక్షల టీ మొక్కలను నాటించారు. ఈ ఎస్టేట్లలో పనిచేయడానికి పసివారిని బలవంతంగా వినియోగించారు. వారిలో ముప్ఫై శాతం బాలికలే. వారి వేళ్లు సన్నగా, మృదువుగా ఉండి, తేయాకుని కోయడానికి అనుకూలంగా ఉంటాయి. 1855నాటికి ఐదులక్షల పౌన్ల తేయాకుని బ్రిటన్‌కు ఎగుమతి చేయసాగారు. 1880 నాటికి ఇది రెట్టింపయింది.

తేయాకుకు కాఫీ ఏనాడూ పెద్ద పోటీ కాలేదు. ఇరవయ్యో శతాబ్దంలో తేయాకును చిన్న సంచుల్లో కట్టి వాటిని డీలర్స్ దగ్గరకు, అమెరికాలో లిప్టన్ టీ కంపెనీ శాంపిల్స్‌గా పంపేది. ఆ బ్యాగ్‌ని కొందరు వేడి నీళ్లలో కాస్సేపు ఉంచి, టీ చేసుకుని తాగేవారు. ఈ సంగతి తెలిసిన ఆ కంపెనీకి టీ బ్యాగ్స్ తయారుచేయాలన్న ఆలోచన కలిగింది. దానిమీద రీసెర్చి చేసి టీ బ్యాగ్స్‌ని తయారుచేసే యంత్రాన్ని కనుగొంది. ఆ తర్వాత టీ బ్యాగ్స్‌కు ప్రజలనుంచి ఆదరణ లభించడంతో రోజుకు వంద టీ బ్యాగ్స్ తయారుచేసే యంత్రాన్ని అభివృద్ధి చేశారు. నేడు అమెరికాలో అరవై శాతం టీ బ్యాగ్స్‌తో టీ చేసుకుంటారు. అక్కడ ఏడాదికి తొమ్మిదివేల కోట్ల టీ బ్యాగ్స్ అమ్ముడవుతున్నాయి. క్షణానికి 30 టీ బ్యాగ్స్‌ను తయారు చేసే యంత్రం, నిముషానికి 200 టీ బ్యాగ్స్‌ను చేసే యంత్రం ప్రస్తుతం అమెరికాలో వినియోగంలో ఉన్నాయి. అలాంటి ఒక్కో యంత్రానికి 2,500 కదిలే భాగాలు ఉన్నాయి. దారం, కాగితం, స్టేపిల్స్, తేయాకు పొడిని ఈ యంత్రంలో ఫీడ్ చేస్తే టీ బ్యాగ్స్ తయారయి బయటికి వస్తాయి.



లిప్టన్ కంపెనీకి పోటీదారైన టెట్లీ టీ కంపెనీ కూడా 1920 నుంచి టీ బ్యాగ్స్‌ని ఉత్పత్తి చేస్తోంది. ఇప్పుడు టెట్లీ దగ్గర నిముషానికి 600 టీ బ్యాగ్స్ తయారు చేసే యంత్రాలు ఉన్నాయి. తేయాకులో 1200 రకాల రుచులు ఉన్నాయి. అది పండే నేల, వర్షపాతం, అక్కడి వాతావరణం మొదలైనవి తేయాకు రుచిని నిర్ణయిస్తాయి. ప్రతి టీ కంపెనీ అనేక రకాల తేయాకుని కలిపి ప్రత్యేక రుచి వచ్చేలా ఉత్పత్తి చేస్తుంది.

సెలెస్టియల్ సీజనింగ్ కంపెనీ అనేక రకాల పదార్థాలైన హైబిస్కస్, మింట్, లెమన్, జింజర్ తదితరాలను కలిపి 1970 నుంచి తేయాకు లేని హెర్బల్ టీని అమెరికాలో తయారు చేస్తోంది. రెడ్ జింజర్, పీపీ టైమ్ అనే సువాసనలు వెదజల్లే ప్రొడక్ట్స్ అక్కడ అధికంగా అమ్ముడవుతున్నాయి. విశేషమేమంటే హెర్బల్ టీకి మామూలు టీ బ్యాగ్స్‌కు ఉన్నట్లు దారం ఉండదు.

## కొత్తగాలి...

**పైకి పాకిన**
**హీరోయిన్ ఒంటిమీద వలువలు**
**దిగజారిన**
**నైతిక విలువలు**

*-యస్.శేషగిరి,*
*వారాసిగూడ, సికింద్రాబాద్*

మన యింట్లోనే వుందామనుకున్నా. ఎందుకంటే వాడికి మొదటినుండి పల్లె అంటే చాలా యిష్టం. ఎప్పుడు ఫోను చేసినా అడుగుతుంటాడు నాన్నా! మీరు అంత దూరం వచ్చి మా దగ్గర ఆ వాతావరణానికి యిమడలేరని కనుక మీరు వస్తానంటే అంతా మా ఊరికే వెళ్దాం" అంది అమ్మ.

"నీవు చెప్పింది బాగుందమ్మా. మేం మరల అంతదూరం ప్రయాణం చెయ్యలేం. మన ఊరిలో అయితే అన్ని వసతులున్నాయి. ఇబ్బంది లేదు"

"శాంతీ! నీవూ ఓ రెండు నెలలు మెడికల్ లీవు పెట్టిరా. మాధవ్ వెళితే మళ్ళీ ఎప్పుడొస్తాడో? " అన్నాడు తాతయ్య.

"అమ్మా! మామయ్య వస్తుంటే మేం రావద్దా? మరి కాలేజీ..." అన్నారు పిల్లలిద్దరూ ముక్తకంఠంతో.

"మీ అమ్మను వెళ్ళనీయండి. మనం హాయిగా వంట చేసుకొని మనిష్టమొచ్చినట్టు తింటూ స్వేచ్ఛగా తిరగవచ్చు అడిగేవాళ్లుండరు" అన్నారు శ్రీవారు.

'సరే! అప్పుడాలోచిద్దాం. ఇప్పటి నుండే మీరు స్వేచ్ఛా జీవులైనట్లు కలలు కనకండి" అన్నా నవ్వుతూ.

"అమ్మో! నాన్న వంట మావల్ల కాదు. హోటలు నుండి తెచ్చుకుని తింటాంలే" అంది మా అమ్మాయి.

"సరేలే! ఆయన ఇంటికి వచ్చేసరికి మనిద్దరం నిద్రపోతాం. ఇక అర్ధరాత్రికా తెచ్చేది" అన్నాడు సుపుత్రుడు.

"ఒరేయ్! పిల్లలూ మీ అమ్మకు నామీద ఇప్పుడే చాడీలు చెప్పి నామీద బ్యాడ్ ఇంప్రెషన్ కలిగిస్తున్నారు" అన్నారు శ్రీవారు.

"సరే లేరా! ఇప్పటి నుండే పోట్లాట ఎందుకు? ముందు మాధవ్‌కి తగిన అమ్మాయిని వెతకండి ముందు. లేకపోతే 'ఈనాడు పెళ్లిపందిరి'లో యాడ్ ఇవ్వండి. మనం సెలెక్టు చేసుకోవచ్చు వాడు వచ్చేసరికి మనం కొన్ని చూసి పెడితే అప్పుడు సెలెక్షన్‌కు ఎక్కువ టైం పట్టదు" అన్నాడు ఎప్పుడూ తక్కువగా మాట్లాడే నాన్న. అందరూ సరేననడంతో యాడ్ యిచ్చి రావడానికి నాన్న వెంటనే బయలుదేరి వెళ్ళాడు.

"మీనాన్న లేడికి లేచింది పరుగన్నట్లు వెళ్ళారు. మనకు కావలసిన అర్హత లేమిటి? ఏమీ అడగకుండా వెళ్ళారు. కొడుకు వస్తున్నాడన్న సంబరంలో" అంది అమ్మ విసుక్కుంటూ.

"నీవు ఆయన ఏ పనిచేసినా ఏదో ఒక విమర్శ చేస్తుంటే వాళ్లకు ఏ పనీ చేయ బుద్ధి కాదు. పైగా తనకు ప్రాముఖ్యతనివ్వడం లేదని బాధపడతారు" అన్నారు తాతయ్య అల్లుడికి సపోర్టుగా.

అమ్మకు ప్రతిపనిలో కచ్చితత్వం పాటించాలి. ప్రణాళికాబద్ధంగా వుండాలి అంటుంది. నాన్న పూర్తి వ్యతిరేకం. ఎప్పటికేది తోస్తే అది చేసేస్తుంటారు. అయినా ఎప్పుడో చదివిన ఆయస్కాంత సూత్రాలు గుర్తొస్తాయి వీళ్ళను చూస్తే. 'సజాతి ధృవాలు వికర్షించుకుంటాయి. విజాతి ధృవాలు ఆకర్షించుకుంటాయి'

సంతోషంగా ఉన్నపుడు రోజులు గిర్రున తిరిగిపోతాయేమోనన్నట్టు అమెరికా నుండి మాధవ్ వచ్చే రోజొచ్చింది. పిల్లలను తీసు

కొని శని, ఆదివారాలు ఆయనను వస్తుండమని చెప్పి, పనిమనిషికి జాగ్రత్తలు చెప్పి, రెండు నెలలు సెలవు పెట్టి పల్లెకు బయలుదేరా. నాన్న కూడా తన కంపెనీ బాధ్యతలను వేరొకరికి అప్పచెప్పి అప్పుడప్పుడు వస్తానని చెప్పారట. అందుకని నాకంటే ముందే చేరారు. ఇక అమ్మమ్మ, తాతయ్యల హడావుడి చెప్పనక్కరలేదు. ఇంటిని పెండ్లిల్లులా అలంకరించారు. వాకిట్లో చల్లగా వుండటానికి కొత్త తాటాకులతో పందిరి వేయించారు. మంగమ్మకు తోడు ఇద్దరు పనివాళ్ళను పెట్టాడు. ఈ రెండు నెలలు ఇద్దరు వంట మనుషులను పిలిపించాడు. ఎవరో ఒకరు చుట్టాలు వస్తుంటారని, మనవడి కోసం అన్ని రకాల హంగులు ఏర్పాటుచేశారు. అందరం మాధవ్ రాగానే మామయ్యల కబుర్లన్నీ వినాలని, వాడికేమామయ్య కూతురైనా నచ్చిందో తెలుసుకోవాలని కుతూహలంతో ఎదురు చూస్తున్నాం. "వస్తున్నానని" ఫోన్ చెయ్యగానే తాతయ్య, "ఏ బస్సుకు వస్తుంది చెప్పలేదు వీడు" అనుకుంటూ రామలక్ష్మణులను ముస్తాబు చేయించి బండి సిద్ధంచేసి, రోడ్డు దగ్గరకు పంపాడు. బండి వెళ్ళిన అరగంటకే ఒక చేత్తో సూట్ కేసు, మరొక చేత్తో బ్యాగు, వీపుపైన లగేజి వేసుకొని మాధవ్ యింటిముందు ప్రత్యక్షమయ్యాడు. అందరం ఆశ్చర్యం లోంచి తేరుకోకముందే "నాకు మిమ్మల్నందరిని ఎప్పుడెప్పుడు చూడాలా? అనే ఆత్రుత అణచుకోలేక తెల్లవారుజామునా ఫస్టు బస్సుకే వచ్చేశా. కాలిబాట వెంబడి నడుచుకుంటూ వచ్చా. అబ్బ చల్లటి గాలి ఎంత హాయిగా వుందో" అంటూ మాట్లాడుతుంటే నోరెళ్ళ బెట్టాం.

"నీవు ఫోన్ చెయ్యగానే మధ్యాహ్నానికి వస్తావని బండి పంపించా. పోనీ అక్కడ మనుషులకెవరికయినా లగేజి యిచ్చి రాక పోయావా? అంత బరువు మోస్తూ ఎలా నడిచావు?" అన్నాడు తాతయ్య.

"తాతయ్యా! ఆరోగ్యానికి నడక మంచిదని డాక్టర్లు చెప్పారు కదా! మన వూరు ఎంతమారిందో చూద్దామని నడుచుకుంటూ వచ్చాలే" అంటూ లోపలికెళ్ళాడు.

"మాధవా! సామాను అక్కడ పెట్టి స్నానం చేసిరా. నీకిష్టమని పెసరట్లు వేశా. తిందువుగాని" అంది అమ్మమ్మ హడావుడిగా.

"నెయ్యి ఫాట్ అమ్మమ్మా. తినకూడదు" అన్నాడు.

"ఫాట్ లేదు గీటు లేదు. ఇక్కడ వున్నన్నాళ్ళు నేను చేసిపెట్టినవన్నీ తినాల్సిందే" అంది తర్జనితో బెదిరిస్తునట్టుగా.

## చూపించాల్సింది ఏమీలేదు



ఉపన్యాసాలిచ్చేందుకు అమెరికాకు వెళ్లిన ఆస్కార్ వైల్డ్‌ను ఓసారి న్యూయార్క్‌లో కస్టమ్స్ ఆఫీసర్స్ క్షుణ్ణంగా తనిఖీచేసి, 'మీరు చూపించాల్సింది, బయటపెట్టాల్సింది ఇంకేమైనా ఉందా?' అన్నారు.

దానికి ఆయన సుతిమెత్తగా 'నా ప్రజ్ఞాపాటవాలు, తెలివితేటలు తప్ప ఇంకా మీకు చూపించాల్సిందేమీ లేదు' అన్నాడు.

### అమెరికన్లు చనిపోతే..?

ఓసారి అమెరికన్ల గురించి వైల్డ్‌ను అడిగితే హాస్యంగా ఆయన ఇలా అన్నాడు. 'మంచి అమెరికన్లయితే చనిపోయిన తర్వాత పారిస్‌కు వెళతారు. చెడ్డ అమెరికన్లయితే చనిపోయాక కూడా మళ్లీ నరకంలాంటి అమెరికాకే పోతారు'

"నేను మళ్ళీ వెళ్ళేటప్పుడు విమానం పట్టదు అమ్మమ్మా" అంటూ నవ్వుతూ స్నానానికెళ్ళాడు వాడు.

స్నానం చేసి టిఫిన్ తిని, పాలు తాగి రాగానే హాలులో అందరం రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సులాగ సమావేశమయ్యాం. ఎలా మొదలెట్టాలి అని మాధవ్ వచ్చి కూర్చో గానే అమ్మమ్మ "మాధవా! మామయ్యలను కలిసివచ్చావా? అక్కడి విషయాలేమిటో చెప్పరా! మేమంతా వినాలని ఎంతో ఆత్రు తగా ఎదురు చూస్తున్నాం" అంది.

"ఇంతమంది ఇక్కడ సమావేశమవడం చూస్తుంటే పకడ్బందీగా ప్రణాళిక వేసి నన్ను ఇరికించినట్లున్నారు. చిన్నపిల్లవా డిని పట్టుకొని 'చెడుగుడు' ఆడేసారే" అన్నాడు మాధవ్.

"చిన్నపిల్లాడివి కాదు. పెండ్లీడుకొచ్చావు. అమ్మాయిలు కలలు కంటున్న అమెరికా సాఫ్ట్‌వేర్ ఇంజనీరువి" అన్నా తమాషాగా.

"అదే నా పాలిట పెద్ద ప్రమాదం ముంచుకొచ్చేలా చేసింది" అన్నాడు. నాన్న.

"అదేమిటిరా? అలా గంటావు? " అన్నా ఆశ్చర్యంగా.

"అవును. నేనిక్కడేదో ఉద్యోగం చేస్తుంటే వీళ్ళెవరైనా అడిగేవారా? నా మొహం చూసేవారా? " అన్నాడు ఏదో గుర్తుకొచ్చినట్లు.

"పోనీలేరా! ఎవరి పాపాన వాళ్లని వది లెయ్యడమే. నువ్వు ఏం జరిగిందో చెప్ప రాదూ? " అంది అమ్మమ్మ.

"మీ అందరికి బోలెడు ప్రజంటేషన్సు తెచ్చాను. అవి ఇవ్వవద్దా మరి" అన్నాడు.

"నీవు తెచ్చినవి మళ్ళా వెనక్కు తీసికెళ్ళ వుగదా! మొహమాటపడకుండా తీసుకుం టాంలే. ముందు నువ్వు స్టోరీ మొదలు పెట్టు" అన్నా.

"అదే ఎక్కడినుండి మొదలెట్టాలి? " అని ఆలోచిస్తున్నా అన్నాడు.

"నీవు విమానం దిగినప్పటినుండి మొద లెట్టు. నీవు యిప్పుడు చెప్పకబోతే రేపటి నుండి నీవు వచ్చావని ఎవరో ఒకరు వస్తుంటారు. మనం స్థిమితంగా మాట్లాడు కోవడానికి వీలు చిక్కదు" అన్నా.

"అది కాదురా! ఈసారి ఎలాగైనా నిన్ను జంటగా అమెరికా పంపాలని మీ అమ్మా, నాన్న కృతనిశ్చయులై వున్నారు. మేం కూడ పెద్దవాళ్ళమై పోతున్నాం కదా! మన వడి పెళ్లి కండ్లారా చూస్తే ఒక తృప్తి వుంటుంది. మా చేతుల్లో పెరిగిన పిల్లలు ఇంత ఎత్తుకు ఎదిగారని గర్వపడతాం" అన్నాడు తాతయ్య నచ్చచెబుతున్నట్టుగా.

"ఏం చేద్దాం? మీరంతా గూడుపుఠాణి చేసి నన్నిరికించారు. నా పర్యటన కార్య క్రమం ఎలా మొదలైందంటే..." అంటూ ప్రారంభించాడు వాడు.




విమానం నెమ్మదిగా రన్‌వే మీదకి లాండ్ అవుతోంది. అయిదేళ్ళ తర్వాత మాతృభూమిని చూస్తున్నానన్న ఆనందం, ఆత్మీయులనందరినీ కలుసుకుంటున్నాననే భావన, ఉద్వేగం నన్ను చుట్టుముట్టాయి. అయితే అమ్మ మామయ్యలను కలుసుకొని పల్లెకు రమ్మనడంతో ముంబాయి ఎయిర్ పోర్టులో దిగా. పెద్దమామయ్య ఎయిర్‌పో ర్టుకు వస్తాడా? అని సందేహిస్తూనే సెక్యూ

రిటీ చెకప్ ఫార్మల్‌గా ముగించుకొని లగేజీ తీసుకునేసరికి "హాయ్! మాధవ్! హౌ ఆర్ యు? అమెరికా నీళ్ళు బాగానే ఒంటపట్టినట్టున్నాయే? మంచి రంగొచ్చి దొరబాబులా వున్నావ్!" అంటూ పెద్దమామయ్య పలకరించాడు.

"మాధవ్! మమ్మల్ని మర్చిపోయావా? అమ్మావాళ్లు నిన్ను రిసీవు చేసుకోమని చెప్పేదాక మాకు తెలీదు. మేం పరాయి వాళ్ళమయ్యామా? కమాన్ యార్" అంటుంటే ఆ స్లీవ్‌లెస్ బ్లౌజు, బాబ్డ్ హెయిర్, లిప్‌స్టిక్ పెదవులు, తళతళ మెరిసే బొడ్డుకింద చీర ఆమె భారీ శరీరాన్ని దాచిపెట్టలేనంటున్నాయి. ఆమె పెద్దత్తయ్య అని గుర్తుపట్టడానికి నాకు అయిదు నిముషాలు పట్టింది. వెంటనే తేరుకుని "మీరు అమెరికా నుండి వచ్చి ఇక్కడ సెటిల్ అయినట్టు నాకు తెలీదు" అన్నా నెమ్మదిగా.

"పిల్లలు పెళ్ళీడుకొచ్చారు కదా! అక్కడ డేటింగ్ సంస్కృతికి పిల్లలు అలవాటు పడతారని భయం. అందుకే వచ్చేశాం" అంది.

"ఇక్కడ నిల్చొని ఈ మాటలన్నీ ఎందుకు? పద, ఇంటికిపోదాం" అంటూ మామయ్య లగేజి తీసుకోగానే ఖైదీని పోలీసులు తీసుకెళ్లే దృశ్యం మనసులో మెదిలి, 'అమ్మో వీళ్ళ పాలిట పడ్డాను. తొందరగా తప్పించుకోవాలి భగవంతుడా? ఏది దారి?' అనుకుంటూ జీవం లేని నవ్వుతో వాళ్ళవెంట నడిచా.

పెద్దమామయ్య బిజినెస్ మాగ్నెట్ అని తెలుసు, కానీ ఈ కాస్మోపాలిటన్ సొసైటీని ఒంటపట్టించుకున్నారని తెలీదు. అయినా ఎ.సి.కార్లో ప్రయాణిస్తున్నా వాళ్ల మాటలు, చేష్టలు కృతకంగా అన్పించాయి.

పెద్ద భవంతి ముందు కారు ఆగగానే గూర్ఖా వచ్చి గేటు తీశాడు. మేం హాలులోకి అడుగు పెట్టగానే ఇద్దరమ్మాయిలు గదినుండి బయటకు వచ్చారు. వారిద్దరూ వాళ్ల అమ్మను మించిపోయారు. ఎవరు పెద్దో, ఎవరు చిన్నో తేల్చుకోలేనట్టున్నారు. టైట్‌ఫిట్ ప్యాంటువల్ల శరీరంలోని ప్రతి అవయవం కదలికతో సహా బైటికి కనబడుతుంది. పైగా షార్ట్ టీషర్టు, బాబ్డ్ హెయిర్, చెవులకు, మెడలకు పూసలదండలు చూస్తుంటే నాకు దేవానంద్ 'హరే కృష్ణ హరే రామ్' సినిమా గుర్తుకొచ్చింది. ఆమె పెద్దమ్మాయి 'కన్నీ' అని చెప్పగానే. "హాయ్ మధూ! ఈవెనింగ్ గెట్‌టు గెదర్ పార్టీ వుంది. మా ఫ్రెడ్సంతా నీ హబ్బీని ఇంట్రడ్యూస్ చెయ్యమని గోలపెడుతున్నారు. ప్లీజ్‌యార్. వాళ్ళందరూ నన్ను చూసి కుళ్ళుకునేలాగ చార్మింగ్‌గా డ్రస్ అప్ అవ్వు" అంటూ అప్పుడే నన్ను చూసినా, ఏదో అధికారం తీసుకొన్నట్లుగా బూట్లు టకటకలాడించుకుంటూ వెళ్ళింది.

"ఈ పాప పేరు 'బన్నీ'.. చిన్నమ్మాయి అనగానే ఒక్కసారి తేరిపార చూసి నిశ్చేష్టుడినయ్యా. మోకాళ్ళ పైకి మిడ్డీ, అతి పలుచని టాప్, చిన్న ముఖానికి బండి చక్రాలంత రింగులు, కుతికకు అంటున్న ఏవో దారపు పోగులూ, చేతిలో మొబైల్‌తో 'యూ ఆర్ సో నైస్. వియ్ విల్ మీట్ అగైన్. ఐ హేవ్ సమ్ అర్జంటు వర్క్' అంటూ హడావుడిగా వెళ్ళింది. అంత తలబిరుసుగా వుండే మామయ్యకు నేను అమెరికా వెళ్ళి వచ్చేసరికి నా స్టాటస్ మారిపోయి ఆయన కంట్లో పడ్డానన్నమాట. వారు అంత ఆప్యాయంగా రిసీవ్ చేసుకోవడంలోని అంతరార్థం బోధపడింది.

మధ్యాహ్నం భోజనం చేసి ఫోమ్‌బెడ్ మీద వాలానేకాని ఆలోచనలు కందిరీగల్లా చుట్టుముడుతున్నాయి. ముగ్గురు మామయ్యలకూ ఆడపిల్లలే! పైగా వాళ్ళందరి మధ్య వయస్సు తేడాలూ తక్కువే. అందు

కేనేమో అమ్మ నన్ను 'వచ్చేదారే కాబట్టి ఒకసారి పలుకరించిరా' అన్నది. జాగ్రత్తగా ఆలోచించి ఇక్కడినుండి బైటపడాలి అనుకుండేసరికి నిద్ర పట్టేసింది.

"మాధవ్! నీవు ఇండియా వచ్చావని మీ అత్తయ్యా, మా బేబీస్ వాళ్ల ఫ్రెండ్స్ అందరినీ ఆహ్వానించి గ్రాండ్‌గా పార్టీ అరేంజ్ చేస్తూంటే అసలు హీరోవి ఈ మొద్దు నిద్రేమిటి? లేచి ఫ్రెష్ అప్ అవు. హోటల్ కెళ్దాం" అంటూ తట్టిలేపాడు మామయ్యా.

చల్లని సాయంకాలం హాయిగా బీచ్‌లో తిరిగి వద్దామనుకుంటే ఈ పోగ్రామేమిటో? హే భగవాన్? నీవే దిక్కు అనుకుంటూ నా కిష్టమైన లాల్చీ, పైజామా ధరించి గది నుండి బైటకు వచ్చా.

"నిన్ను చూసేక ఎవరూ అమెరికా నుండి వచ్చిన వాడివి అనుకోరు. పార్టీ అంటే కోటు, సూటు వేసుకోవాలోయ్. ఇదేమిటి? ఈ అవతారం? బెంగాలీ బాబులా? " అంది అత్తయ్య. అప్పుడే బ్యూటీక్లినిక్ నుండి వచ్చినట్టుంది ఘాటైన ఫర్ఫ్యూమ్ వాసన గుప్పుమంటుండగా అతి అలంకారంతో అతిశయంగా అలా పలికింది పెదవి విరుస్తూ.

"నాకు ఈ డ్రెస్సే కంఫర్టబుల్‌గా వుంటుంది" అన్నా వేరే మాటకు తావివ్వకుండా ముందుకు నడుస్తూ.

ఫ్యాషన్ పెరేడ్‌లో పాల్గొనడానికి వెళ్తున్నట్టు బేబీస్ యిద్దరూ హీల్స్ టకటకలాడించుకుంటూ, నన్నో వేస్ట్ ఫెలోలా చూసి కార్లో కూర్చున్నారు. అంతా కోట్లకు పడగలెత్తిన వారినే పిలిచినట్టున్నారు. ఆ అట్టహాసం, డాబూ, దర్పాలు చూస్తేనే తెలుస్తుంది. డయాస్ మధ్యలోకి మామయ్య నన్ను పిలిచి "నా మేనల్లుడు మాధవ్. అమెరికాలో సాఫ్ట్‌వేర్ ఇంజనీర్. త్వరలో కాబోయే అల్లుడు" అనగానే "కమాన్! యార్! చీర్స్!" అంటూ షాంపైన్‌గ్లాసులు, వైన్‌గ్లాసులు తాకించుకొని, తాగుతూ డాన్స్ మొదలెట్టారు. తామేమి తక్కువ కాదన్నట్టు ఆడపిల్లలిద్దరూ తాగుతూ, తూలుతూ "కమాన్ మధూ! లెట్ అజ్ డాన్స్! కాంట్ యు నో ద మేనర్స్" అంటూ ముద్దుముద్దుగా మాట్లాడుతున్నారు. పగలబడి నవ్వుతున్నారు. "నన్ను మాట మాత్రమయినా అడగకుండా మామయ్య అందరి ముందు అలా చెప్పడమేంటి? వీళ్ళ డబ్బుకు ఆశపడి పెంపుడు కుక్కలా తిరుగుతానని అనుకున్నారేమో? ఈ వాతావరణంలో ఇమడలేక టెర్రస్ దగ్గరకు వచ్చి దూరంగా కన్పిస్తున్న సముద్రపు అందాలను, షిప్పులను చూస్తూ ఎంత సేపు నిలబడ్డానో? అర్ధరాత్రి రెండు గంటలు దాటాక మత్తు వదిలిందేమో యింటిదారి పట్టారు.

మరుసటి రోజే నేను ప్లేన్ టికెట్టు రిజర్వేషన్ చేయించుకున్నాను 'హైదరాబాదు' వెళ్ళాలి అని బయలుదేరి వచ్చేశా. బేగంపేట విమానాశ్రయంలో చిన్నమామయ్య, అత్తయ్య సాదరంగా ఆహ్వానించారు. "నీవు వస్తున్నావని పెద్దమామయ్య ఫోను చేశాడు. చూడవలసిన పెండింగు ఫైల్సు చాలావున్నా నీ కోసం పర్మిషన్ పెట్టి విమానాశ్రయానికి వచ్చాం" అన్నారిద్దరూ కూడబలుక్కుని. ఇక్కడ ఏమి అగచాట్లు పడాలో భగవంతుడా అనుకుంటూ వుండగా సిటీ టాక్సీ మాట్లాడి తీసికెళ్ళాడు. పెద్ద బిల్డింగు ముందు టాక్సీ ఆగింది. నేను మెయిన్ బిల్డింగులోకి పోబోతుంటే మరొక చిన్న 'అవుట్ హౌస్' లాంటిది చూపి 'ఇలా రావోయ్ అల్లుడూ!' అన్నాడు చిన్నమామయ్య. అమ్మ చిన్నమామయ్య 'పిసినారి' అని చెబితే విన్నాకాని యింత పిసినారి అని యిప్పుడే చూశా. హైద్రాబాద్‌లో రెండు అపార్ట్‌మెంట్లు, రెండు పెద్ద భవంతులు వున్నాయి.

ఇద్దరూ ఆఫీసర్లు. కాని కారు లేదు.

"మామయ్యా! కారు కొనుక్కోకూడదా? " అన్నా ఊరుకోలేక.

"ఈ సిటీలో హెవీ ట్రాఫిక్. డ్రైవరును మెయిన్‌టెయిన్ చెయ్యడం పెద్ద తల నొప్పి. మా ఇద్దరికీ ఆఫీసు వెహికల్స్ వస్తాయి. పిల్లలు బస్‌లో వెళ్తారు. ఇక కారెందుకూ.. శుద్ధ దండగ" అన్నాడు.

"అమ్మో! వీళ్ళు కడుపు నిండ తిండి కూడ తినేటట్టు లేరు" అనుకున్నా.

ఇంతలో "బావా! కాఫీ" అనే కోకిల కంఠ స్వరంతో తలెత్తా. చుడీదార్‌తో సన్నగా రివటలాగ ఉన్నమ్మాయి కన్పించింది. డైటింగ్ చేసి కాబోలు ముఖంలో కళాకాంతులు లేవు.

"నా పేరు నీహారిక, మా చెల్లి పేరు హారిక" అంటూ కొంచెం బొద్దుగా, జీన్సు ప్యాంట్, టీషర్టు వేసుకున్న అమ్మాయిని చూపింది నాకు. ఓ చిరునవ్వు విసిరేసి లోపలికెళ్ళిందత్తయ్య.

"నా చదువైపోయింది. ఉద్యోగాల వేటలో వున్నా. ఇంటర్వ్యూ టైమవుతుంది. వెళ్దామనుకునే లోపలే నీవు ఊడిపడ్డావు. బై... బై... వుంటావుగా" అంటూ చేతులూపుతూ బైటికెళ్ళిపోయింది నీహారిక.

"నేను పోస్టు గ్రాడ్యుయేషన్ చేస్తున్నా. రేపు సెమినార్ వుంది. ఆ ప్రిపరేషన్‌లో ఉంటే అమ్మ పిలిచింది. వచ్చాను" అంటూ తనకేం పట్టనట్టు హడావుడిగా లోపలికెళ్ళింది హారిక.

"అల్లుడూ! ఈ సెల్లులతో తిప్పలొచ్చాయోయ్. అర్జంటుగా ఫైలు చూడాలి రమ్మని మా బాస్ ఆర్డరు. వెళ్తొస్తాను" అంటూ నా జవాబుకు చూడకుండా వెళ్ళిపోయాడు చిన్న మామయ్య. ఇక ఈ మహాతల్లి అయినా ఇంట్లో వుంటుందా? అనుకునేంతలో ఫోను గణగణ మోగడం "బయలు దేరుతున్నా. జీపు పంపండి" అని అత్తయ్య చెప్పడం విన్పిస్తూనే ఉంది.

## కొత్తగాలి...

**చేత కాని**
**వాళ్లెవరు?**
**చేత కానీ**
**లేనివాళ్లే!**

*–అంబటి వెంకట శివారెడ్డి,*
*యర్రగుంట్ల, కడప జిల్లా*

"మాధవ్! అర్జంటు మీటింగు ఉంది. ఆఫీసుకెళ్లాలి. నీకు డిన్నర్ హాట్ ప్యాకులో పెట్టి టేబుల్‌పై పెట్టా. టి.వి. పెట్టుకో. కాలక్షేపమవుతుంది. అన్నట్టు అడగటం మరిచిపోయా. మీ పెద్దత్తయ్య తన కూతుళ్ల సొగసును, ఆమె అంతస్థును చూపి నిన్ను బుట్టలో వేసుకోవచ్చనుకుంటుందిలే! మీ అమ్మకు ఎవరెటువంటివారో తెలుసులే? మా అమ్మాయిలిద్దరిని చూశావుగా. వారిద్దరూ నీకు సరిజోడే. ఛాయిస్ నీదే. తర్వాత మీ అమ్మా, నాన్నతో మేమిద్దరం మాట్లాడుతాం. బొంబాయి ఆమెకు వాళ్లు అమెరికాలో ఉండి వచ్చామని, పిల్లలకు ఆ కల్చర్ బాగా తెలుసని విర్రవీగుతుంది. సభ్యత, సంస్కారాలు తెలీవు. వట్టి డబ్బు పిచ్చోళ్లు. నువ్వు చూసి ఉంటావుకదా వారి స్టయిల్. మాదంతా సింప్లిసిటీ. మా పిల్లలు అంతే. వస్తా"నంటూ తను చెప్పదల్చుకున్నది చెప్పి వెళ్ళిపోయింది.

అన్ని తలుపులు తాళాలేసుకొని ఒక్క డైనింగ్ హాల్ మాత్రం తీసి ఉంచారు. ఆ సోఫాలో వాలి టీవీ చూస్తూ కాలక్షేపం చేశా. ఆ తిండి చూస్తే నిన్న వండినవి ఫ్రిజ్‌లో పెట్టి వెచ్చబెట్టి హాట్ ప్యాక్‌లో పెట్టినట్టున్నారు. అసలు తినబుద్ధి కాలా. పోనీ బయటి హోటల్‌కెళ్ళి వద్దామను

కుంటే కీస్ ఎక్కడున్నాయో తెలీదు. ఇంటికి కొత్త మనిషి వచ్చాడు. ఆదరంతో చూడాలని, ఆప్యాయతను పంచి పెట్టాలని గాని ఏమాత్రం వున్నట్టు లేదు. అవతలి వారి అభిప్రాయంతో పనిలేకుండా వారే నిర్ణయాలు తీసుకుంటున్నారు. ఆయన అదోరకం. ఈయన ఇదో రకం అను కున్నా. ఈ ఆలోచనతో తలుపులు దగ్గరగా వేసి పడుకున్నా. సాయంకాలం ఏడు గంటలకు కాబోలు ఒక్కొక్కరు గూటికి చేరారు.

"మాధవ్! మీ అమెరికాలో పుల్లారెడ్డి నేతి మిఠాయి దొరుకుతుందా. మా పిల్ల లకు ఇదంటే ప్రాణం. ఎంతైనా తింటారు. అందుకే ఎప్పుడూ తేను. నీవు వచ్చేవు. నీకు రుచి చూపిద్దామని తెచ్చాను" అంటూ పావుకేజి ప్యాకెట్టును తీసి ఒక ముక్క పెట్టింది చిన్నత్తయ్య.

అప్పుడే "మమ్మీ! నాకు! మమ్మీ నాకు" అంటూ యిద్దరూ పోటీ పడి ప్యాకెట్ ఖాళీ చేశారు.

"అమెరికా నుండి ఏమితేలేదా బావా? " అంటూ ఆశగా అడిగింది నీహారిక.

నే జవాబు చెప్పేలోగానే "బావ వట్టి ముద్దపప్పులాగున్నాడే. అన్నీ బొంబాయి వాళ్ళు కాజేసి యిక్కడికి ఈయనను పార్శిల్ చేసినట్టున్నారు ఈయన ఫోజు చూస్తే" అంది హారిక.

"మాధవ్! వాళ్ళ మాటలకేం గాని రేపు ఉదయం పక్కవీధిలో వున్న 'నీహారిక అపార్ట్‌మెంట్స్' తర్వాత 'చిక్కడపల్లి'లో వున్న 'హారిక' అపార్ట్‌మెంట్స్ చూపిస్తా. అవి వారి పేరుమీదే వున్నాయి. మా పిల్లల పేరుమీద ఇన్ఫోసిస్ వంటి పెద్ద కంపెనీల షేర్లు కూడా ఉన్నాయి. వాటి వేల్యూ ఎంతో తెలుసా? " అంటూ చెపు తూనే వుంది చిన్నత్తయ్య.

"నాకెందుకత్తయ్యా అవన్నీ" అన్నా నిరా సక్తగా.

"అదేమిటోయ్? కాబోయే అల్లుడివి కదా. నీకు తెలుసుండాలి. అయినా మీ పెద్ద మామయ్యతో పోటీ పడలేం. మా అమ్మాయిలు సంప్రదాయబద్ధంగా, నాజూగ్గా ఉంటారు. మీ అమ్మకు చెప్పు" అంది.

ఇంతలో మామయ్య వచ్చి అందుకొని "ఒక వారం రోజులలో నేను పల్లెకు వస్తాను. మే నెలలో మంచి ముహూర్తా లున్నాయి. ఒకేసారి ఇద్దరూ అమెరికా చెక్కేయవచ్చు. ఏమంటావు? మీ అమ్మకు మన పద్ధతుల ప్రకారం మెలిగే వాళ్ళంటే యిష్టం. నువ్వు చూశావు గదా! అన్నయ్య పిల్లలను" అన్నాడు.

"ఎవడికోసం చేసుకుంటాడులే? మమ్మల్ని కాదనడు" అనే ధీమా వారిలో కనబడుతోంది. వీరితో మాటలనవసరం. ఇక్కడి నుండి బైటపడితే అంతేచాలని మళ్ళీ వస్తా అని చెప్పి ఎలాగోలా బస్సెక్కేశా.

పైరు మీద వస్తున్న చల్లగాలికి ప్రాణం లేచొచ్చినట్లయింది. నా ఆలోచనలో గతం ఒక్కసారి కళ్ళముందు మెదిలింది. ఒక ఏడాది పంట సరిగా పండక, బిజినెస్ సరిగా రాక తన చదువు ఆగిపోతుందేమో నని అమ్మ భయపడి నాన్న వద్దంటున్నా వినకుండా పెద్దమామయ్యను డబ్బు సర్ద మని అడిగింది. "నీ కొడుకు కలెక్టరై ఏ రాజ్యమేలాలి? పొలం దున్నేవాడి కొడుక్కు పైచదువులెందుకు? మింగమెతు కులేదు కాని మీసాలకు సంపెంగనూనె" అంటూ ఎద్దేవా చేశాడు. చిన్నమామ య్యను అడిగితే "నన్నే మొదట అడిగి వుంటే సహాయం చేసేవాడిని. నేనా మాత్రం చెయ్యలేనని అనుకున్నావు? నేను నీ కంటికి ఆనడం లేదుమరి. కొడుకు చదువు పూర్తవకుండానే ఇంత అహంభావ

మొస్తే రేపు చదువు పూర్తయితే కాలు భూమిమీద నిలిపేలా లేవు" అంటూ అమ్మకు వరండాలోనే సమాధానం చెప్పి పంపారు. పోనీ అమ్మ బుల్లిమామయ్యను అడుగుదామనుకుంది. ఆయన పక్కవూ రయ్యి కూడ సొంత తండ్రినే కనీసం చూడటానికి రాడు. పైగా "నేను ఇల్లరికపు అల్లుడిని. నాకు ఏం స్వతంత్రముండేడు స్తుంది?" అంటూ ఎదురుప్రశ్నిస్తాడని వూరుకుంది. తాతయ్య, అమ్మమ్మ తీర్థయాత్రలకు వెళ్ళడం వల్ల, వారి క్షేమసమాచారాలు వారు దిగిన ప్రదేశం దగ్గర నుండి రాస్తుండేవారు కాని యిప్పటిలాగ ఫోన్ల సౌకర్యాలు లేవు. అప్పుడు ఆపద్బాంధవుడిలా ఆదుకున్నవాడు మా పల్లెలో మాస్టారు. ఆయన హామీ వుండి అప్పటికప్పుడు డబ్బు యిప్పించి ఆ గండం గట్టెక్కించాడు. నాన్న చేసే వుద్యోగంలో ప్రమోషను రావడం వల్ల బాగానే స్థిరపడ్డాం. ఆయన పదవీవిరమణ చేశాక ఊరికినే వుండలేక బిజినెస్ చేస్తున్నారు. ఈ రోజు బిజినెస్‌లో కలిసిరావడం, నేను అమెరికా వెళ్ళడంవల్ల వీళ్ళ కంటికి కనిపిస్తున్నాం. నేను ఏ ఒక్క సంఘటనా మరిచిపోలేదు. పల్లెలోని ఆటలు, పాటలు, కథలతో ఎంత చక్కని బాల్యాన్ని గడిపామో? నా ఆలోచనలకు బ్రేక్ పడ్డట్టయ్యింది. చల్లటిగాలి ఆగిపొయ్యింది. జనం అంతా బస్సులో నుండి తిట్టుకుంటూ దిగుతున్నారు. నేను కిందికి దిగా. "టైరు పంక్చరయ్యింది. స్పేరు టైరు తెచ్చి మార్చాలి. టైం పడుతుంది. అదో ఆ కనబడేదే ఊరు. హాయిగా దిగి నడిచిపోవచ్చు" అని చెప్పాడు డ్రైవరు. చుట్టూ పరికించి చూశా. తాటితోపు, ఊరిని ఆనుకొని వున్న చెరువు చూస్తే, బుల్లి మామయ్యగారి ఊరని గుర్తుపట్టా. ఈయన సంగతి కూడా తెలిసికొనిపోతే సరిపోతుంది అనుకుంటూ సూట్‌కేస్ ఒక చేత్తో పట్టుకొని,

**కొత్తగాలి...**

**నిజమైన స్నేహం**
**మంచి గంధం**
**నిజమైన ఆత్మీయత**
**తరగని సుగంధం**

– శ్రీకాళహస్తి వెంకటశేషగిరి రావు,
వాకాడు

బ్యాగ్ భుజాన తగిలించుకొని కాలువగట్టెంబడి నడుస్తున్నా. చల్లని పైరగాలి వళ్ళంతా తడిమి చాలారోజులకొచ్చావ్ అన్నట్టుంది. ఎండ అలవాటు తప్పిపోవడం వల్ల దినకరుని కిరణాలు చుర్రుమంటున్నాయి. గున్నమావికొమ్మ మీద కోయిల స్వరం నేను నిన్ను గుర్తించాలే అంటోంది. స్వచ్ఛమైన ఇలాంటి వాతావరణంలో అడుగుపెట్టి ఎన్ని సంవత్సరాలయిందో? అనే ఆలోచనల్లో ఉండగానే కాలువగట్టున మట్టిపెళ్ళ విరగడం, దబ్బున నీళ్ళలో జారిపడడం జరిగింది. చేతిలోని సూట్‌కేస్ జారి కాలిమీద పడటంతో "అమ్మో!" అని అరిచా. వెంటనే కిలకిల నవ్వులు చెవుల్ని సోకాయి.

ఈ దొరబాబులకు కళ్ళు నెత్తిమీదుండి ఊహాలోకంలో తేలుంటారు. కాలువగట్టున నడిచేటప్పుడు చూసుకొని నడవాలని తెలీదూ!" అంటూ కొంటెగా నవ్వుతున్న వయ్యారి కళ్ళముందు మెరిసింది. సూట్‌కేస్ చేతిలో తీసుకోబోయి నిలదొక్కుకోలేక మళ్ళా పడ్డా.

"ఏమండోయ్! పైత్యం ప్రకోపించినట్టుంది. మా ఊరి ఆచారిగారు మంచి మందిస్తారు. దెబ్బకు దెయ్యం వదులుతుంది" అంటూ నవ్వుతూ పోతున్న ఆమె సన్నని ముక్కుపుడక మీద సూర్యకాంతి పడి వింత అందాన్నిస్తున్నది. ఇంకా

చూడటం సభ్యత కాదనుకొని దులుపుకొని మామయ్య గారింటివైపు అడుగులేశా.

"ఏమిటోయ్? చెప్పాపెట్టకుండా వూడిపడ్డావ్? నువ్వు వస్తున్నావని ఒక ఉత్తరం రాస్తే బండి పంపించేవాడినికదా! అయినా వూర్లోకి బస్సు వస్తుంది. అందులో రాలేదా? " అన్నాడు బుల్లిమామయ్య.

"పల్లె అందాలను చూద్దామని నడిచి వచ్చా" అన్నా.

"అందుకేనటయ్యా అల్లుడూ! వళ్ళంతా బురదపులుముకొని వచ్చావ్? సూట్ కేస్ అక్కడ పెట్టి ముందు స్నానం చేద్దువుగాని రా" అంటూ అత్తయ్య లోపలికి దారితీసింది.

లంకంత కొంప. గొడ్డూగోదా, మందీమార్బలం కావలసినంత. ఒక జత కళ్లు తలుపువారగా నిల్చుని నన్ను గమనిస్తున్నాయి. అయితే ఆ శాల్తీని ఆ తలుపు దాచిపెట్టలేక సగం శరీరం బయటికే కనిపిస్తోంది. మనకెందుకులే అని స్నానానికి వెళ్లా.

"అమ్మా లక్ష్మీ! బావకు టిఫిను తీసుకురా!" అని బుల్లి మామయ్య పిలుపు పూర్తవ్వకముందే ఒక పెద్ద వెండి పళ్ళెంలో జంతికలు, బూంది, తొక్కుడు లడ్డు మొదలయినవి తీసుకొని వచ్చిన లక్ష్మిని చూస్తుంటే గున్న ఏనుగు నడిచి వచ్చినట్టనిపించింది. ఇందాకటి శాల్తీ తనే అని గుర్తుపట్టాను. పట్టు పావడా, బుట్టచేతుల జాకెట్టు, కాసులపేరు, జడకుచ్చులు, గజ్జెలు ఘల్లుఘల్లుమంటుంటే భూకంపం వచ్చినట్టుంది. తలవంచుకొని ప్లేటందుకున్నా. "ఏందల్లుడూ సిగ్గుపడుతున్నావు. మా ఒక్కగానొక్క కూతురు గజలక్ష్మి. మన ఊరి హైస్కూలులో పదో తరగతి వరకు చదివింది" అన్నాడు బుల్లి మామయ్య.



"అదేమిటి? పూతరేకులు రెండే తిన్నావ్? అన్నీ రుచి చూడు. మా గజంకు ఇష్టమని మా ఇంట్లో ఎప్పుడూ ఇవన్నీ స్టాకు పెట్టిస్తా" అంది అత్తయ్య గర్వంగా.

"బావా! పాలు" అంటూ గజం ఒక పెద్ద కంచు గ్లాసుతో తెచ్చింది. ఇది తాగకపోతే మళ్లీ ఏ ఉపన్యాసం వినాల్సివస్తుందేమోనని గడగడతాగేసి గ్లాసు ఇచ్చా.

"అమ్మా గజం! బావను తీసుకెళ్ళి మన పొలాలు, చెరకుతోట చూపించు. నేనూ వస్తున్నా" అని బుల్లి మామయ్య అనేసరికి



తప్పించుకోలేక బయలుదేరా.

ఒక ఫర్లాంగు దూరం నడిచేసరికి కొబ్బ రితోట వచ్చింది. అక్కడ ఒక్క బోండాం నీళ్ళు తాగేసరికే నాకు కడుపు నిండిపో యింది. గజం మాత్రం నాలుగు బోండాలు నిమిషంలో తాగేసి "పద బావా" అంది.

ఇంకొక్క ఫర్లాంగు నడిచేసరికి తాటి తోపు వచ్చింది. "ఆగు బావా!" అంటూ ప నివాడితో తాటిముంజలు కొట్టించి తెచ్చింది. నాలుగు ముంజలకే నాకు కడుపు నిండినట్టయ్యింది. "లేత ముంజలు భలే బాగున్నాయి" అంటూ పది పదిహే నుదాకా లాగించింది గజం. తలగుడ్డ నోటి కడ్డం పెట్టుకొని నవ్వుతున్న తోటమాలిని ఓరకంట చూశా. నాకు మాయాబజార్‌లో ఘటోత్కచుని పాట "వివాహ భోజ నంబు" గుర్తొచ్చి పొలమారింది.

"బావా! మీ దేశంలో తేగలు, సీమ చింతకాయలు, రేగు పండ్లు దొరుకు తాయా? " అంది.

"ఈ మహాతల్లి తినడానికే పుట్టినట్టుం దని మనసులో అనుకొని బుల్లి మామ య్యకు, అత్తయ్యకు చెప్పి వచ్చేశా" అన్నాడు మాధవ్ ముగింపుగా.

"భలే ఇంట్రెస్టింగ్ ఉందోయ్ నీ ట్రావెలాగ్. ఇంతకూ అసలు విషయమేమి చెప్పకుండా ఈ నాన్చుడెందుకూ?" అన్నా.

"రాక రాక పిల్లాడొస్తే వాణ్ని ఎందుకే అందరూ కలిసి హైరానా పెడ్తారు" అంది అమ్మమ్మ మనవడిని మురిపెంగా చూస్తూ.

"పది రోజులలో అన్నయ్య వాళ్లు వస్తారు. అప్పుడు మనం ఏదో ఒకటి తేల్చి చెప్పాలి. లేకపోతే అయినవాళ్ల దగ్గర నిష్టూరాలు పడాల్సి వస్తుంది" అంది అమ్మ.

"నీవు ఏ సీమ దొరసానిని వెంబడి పెట్టుకొని జంటగా వస్తావేమో? నా కొచ్చె ఆడబిడ్డ లాంఛనాలు అన్నీ చెట్టెక్కిపోతా యని భయపడి చస్తున్నా. థాంక్‌గాండ్! ఒక్కడివే వచ్చావ్" అన్నా వాతావరణాన్ని తేలిక పరచాలని.

"మాధవ్! పెళ్లి అనేది పెద్దవాళ్ళ మాట కోసమో, మొహమాటం కోసమో తీసుకునే నిర్ణయం కాదు. నీ ఆలోచనలకు అనుగుణంగా వుండాలి. నీ నిర్ణయం భగవంతుడేదో నిర్ణయించే వుంటాడు. కాని మానవ ప్రయత్నంగా మన కర్తవ్యం మనం చేయడమే. అయితే ఆ నిర్ణయంలోని కష్టసుఖాలకు నీవే బాధ్యుడివవుతావు" అన్నాడు తాతయ్య సూటిగా.

"తాతయ్యా! మన మాస్టారు చనిపోయారని తెలిసింది. మరి ఆయన భార్య, వాళ్ళ అమ్మాయి ఇక్కడే వున్నారా?" అన్నా నా బాల్యాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ.

"మాస్టారు భార్య, వాళ్ళ అమ్మాయి పెంకుటింట్లోనే వుంటున్నారు. ఆయన ఎన్నో సంవత్సరాల క్రితం మన వూరు వచ్చారు. అందరికీ తలలో నాల్కలా వెలుగుతూ పెద్దల మన్ననలు పొంది 'మంచి మాస్టారుగా గుర్తింపు పొందారు. పదవీ విరమణ తర్వాత ఆయన కాన్సరు బారినపడి పోయారు. రిటైరవగానే వచ్చిన డబ్బంతా జబ్బుకు, వచ్చిపోయే బంధు జనాలకు మేపడానికి సరిపోయింది. ఆమె ఆ పెన్షనుతోనే వాళ్ళ అమ్మాయి సత్యను పట్నంలో హాస్టలులో ఉంచి చదివించింది. సత్య చాలా బుద్ధిమంతురాలు. చక్కనిది. ఇంటర్వ్యూల కోసం పట్నం వెళ్లి వస్తూ ఇక్కడే ఉంటోంది. ఆ అమ్మాయికి ఉద్యోగం చేసి వాళ్లమ్మను సుఖ పెట్టాలని తాపత్రయం. ఆమెకేమో పిల్లకు పెండ్లి చేయాలని. మాస్టారు చనిపోగానే బంధువులంతా మొహం చాటేశారు. లక్షలకొద్దీ కట్నమిచ్చి చేసే స్థోమతలేదు. అందుకే నేను మాస్టారి స్నేహాన్ని పురస్కరించుకొని ఆ పెళ్ళి నేను మా యింట్లో చేయిస్తాను. మీరు అధైర్యపడవద్దు అని చెప్పి వచ్చాను. ఊర్లో వాళ్ళు అందరూ ఆయన సహాయం పొందినవారే. వాళ్లంతా తమ వంతు సహకార మందిస్తున్నారు" అన్నాడు తాతయ్య.

"పోయిన సారి వచ్చినప్పుడు నేను సత్యను కలుసుకోలేదు. రేపు వెళ్ళి రావాలి" అన్నా.

"నేను కూడా వస్తాను. మనమంతా చిన్నప్పుడు మాస్టారి భార్యను అత్తయ్య అంటూ పిలుస్తూ ఆవిడ చేతి గోరుముద్దలు తిన్నాం. గుర్తుందా శాంతీ?" అన్నాడు మాధవ్.

★ ★ ★

సాయంకాలం నాలుగంటలకల్లా బయలుదేరి పొలాల గట్ల మీదుగా పైరుగాలిని ఆస్వాదిస్తూ నేను, మాధవ్ నడుస్తున్నాం. మధ్యలో తెలిసిన వాళ్ళు "ఎప్పుడొచ్చావ్? మాధవయ్యా! చాలా పెద్దవాడి అయిపోయావే?" అనీ, "తాతయ్యను చూడటానికి వచ్చావా? మీ అమ్మవాళ్లంతా వచ్చారా? పప్పన్నం ఎప్పుడు పెడ్తావ్" అని రకరకా

లుగా పలకరిస్తూనే ఉన్నారు. నవ్వుతూ సమాధానాలిస్తూ ఏటి ఒడ్డుకు చేరి పిచ్చుక గూళ్ళు కట్టడంలో పిల్లలు పోటీ పడుతుంటే తమాషాగా చూస్తున్నాడు వాడు.

"శాంతీ! ఏటి ఒడ్డున మనం 'ఎర్రతేలుని' ఏడ్పించడం గుర్తుందా?" అన్నాడు నవ్వుతూ.

"అవున్రా! నాకు తెలీకడుగుతాను. అప్పట్లో నవ్వు దాగుడుమూతలులో ఎప్పుడూ! 'ఎర్రతేలు'నే పట్టుకునే వాడివేంట్రా?" అన్నా గుర్తు తెచ్చుకుంటూ.

"నువ్వు, రాధిక నా కంటే పెద్దవారు కదా! బాగా పరుగెడతారు. పైగా పట్టుకుంటే తంతారని భయమే" అన్నాడు వాడు.

నేను నవ్వుతుంటే- "నాకంటే ఎర్రతేలు చిన్నది కావడం వల్ల తొందరగా దొరికిపోయేది" అన్నాడు మాధవ్.

చేతులు తలకింద పెట్టుకొని ఇసుకలో పడుకొని వాడు ఆకాశంలో క్యూలో ఎగురుతున్న కొంగల గుంపును చూస్తూ, "వీటికెవరు నేర్పారో ఇంత క్రమశిక్షణ. మనకు మాస్టారు వేసిన 'పునాది' మన జీవితానలను తీర్చిదిద్దుకోవడానికి సాయపడింది. ఆయనకు మనమెంతో ఋణపడివున్నాం" అన్నాడు మాధవ్, తనలోతనే అనుకుంటూ.

ఇంతలో పశువుల కాపరులు ఇంటికెళ్తూ "బాబూ! చీకట్లు ముసురుతున్నాయి. బేగి ఇంటికెళ్ళండి. శాంతమ్మా ఎల్లండి" అని చెపుతున్నారు.

"అవును. నాకు సైన్స్ చదవడంపట్ల ఆసక్తి కలగడానికి, రీసెర్చి చేయడానికి కూడా నాకు మాస్టారే ప్రేరణ. నేనీరోజు ఇంతవాడిని కావడానికి నాకు అడుగడుగునా మాస్టారే స్ఫూర్తి. సమయానికి ఆయన చేసిన సహాయం కూడ మరువలేను" అన్నాడు మాధవ్.

ఇద్దరం లేచి బయలుదేరాం. "మరి అందరూ నువ్వు సాఫ్ట్‌వేర్ ఇంజినీర్‌వి

## కొత్తగాలి...

**నేను రుమాలుని**
**సెంటుతో ఉబ్బి తబ్బిబ్బయ్యే దాన్ని!**
**ఇప్పుడు స్వైన్‌ఫ్లూతో**
**ఉక్కిరిబిక్కిరవుతున్నా!**

*-జి.వి.యస్.ప్రియంవద,*
*శ్రీకాకుళం*

అంటుంటే నువ్వు రీసెర్చి అంటున్నావు?" అన్నా సందేహంగా.

"అమెరికా పోయే వాళ్లంతా సాఫ్ట్‌వేర్ ఇంజినీర్లే అయి ఉంటారని మనవారి నమ్మకం. వాళ్లకయితేనే నేటి సమాజంలో హోదా, గుర్తింపు. అలాంటి జనాలతో నాకిష్టమైన వృత్తిలో నేను కొనసాగడం గురించి చెప్పవలసిన అవసరం నాకు లేదు. నా రీసెర్చి నాకు ఎంతో ఆసక్తికరమైనది. కంప్యూటర్‌తో అనుసంధానమైనది. పేరు ప్రతిష్ఠలు తెచ్చేది కూడా. కొంతకాలం అమెరికాలో ఉండి అనుభవం సంపాదించాక అప్పుడు వస్తా" అన్నాడు మాధవ్.

మాటల్లో పడి మరిచేపోయాం. మాస్టారి ఇల్లొచ్చింది. ఇద్దరం గేటు తెరుచుకొని కాంపౌండులోకి అడుగుపెడుతూనే బాటకిరువైపులా ఉన్న పూల చెట్లనుండి వీస్తున్న గాలి మత్తెక్కించినట్టనిపించింది.

"లోపలికి రా శాంతీ! ఎన్నాళ్లయ్యింది మిమ్మల్ని చూసి. అమ్మవాళ్లు అందరూ బాగున్నారా? మాధవ్ ఎప్పుడొచ్చాడు?" అంటూ ప్రేమగా ప్రశ్నిస్తూ ఎదురొచ్చింది అత్తయ్య. అప్పుడే తలుపు చాటునుండి ఒక జతకళ్లు మమ్మల్ని చూసి లోపలికెళ్లడం గమనించాం.

"సత్య లేదా అత్తయ్యా ఇంట్లో?" అన్నా. అంతలోనే రెండు ప్లేట్లలో జంతికలు,

మినప సున్నుండలు తెచ్చి ఇచ్చింది సత్య. "మమ్మల్ని మరిచిపోయావా? కొత్తవాళ్లను చూసినట్టు చూస్తున్నావ్? చదువైపోయిందా? పోయినసారి వచ్చినప్పుడడిగితే పట్నంలో ఉన్నావ్ అన్నారు" అన్నా మాట కలుపుతూ.

"నేనేం మరిచిపోలా? మీరే పెద్దవాళ్లయిపోయారు గదా. మేం గుర్తుంటామా? " అంది నిష్టూరంగా సత్య.

"ఎర్ర తేలుని ఎవరైనా మరిచిపోతారా? ఎప్పుడూ పోట్లాడటం అలగడమే కదా సత్యభామ పని" అన్నాడు మాధవ్ కొంటెగా నవ్వుతూ.

"నేనిప్పుడేమీ అలగడం లేదు. కావలిస్తే మా అమ్మనడుగు. నా పేరు 'సత్య' మాత్రమే. ఇంకెట్లా పిలిచినా పలకను" అంది సత్య బుంగమూతి పెడ్తూ.

అలా బుంగమూతి పెడ్తే నాకు ఒక్క క్షణం కన్నార్పకుండా సత్యనే చూడాలన్పించింది. 'నవ్వినప్పుడల్లా సొట్టలు పడిన బుగ్గలపై జూకాల కాంతి పడుతూ, సన్నగా ఊగుతుంటే, పరికిణీ, వోణీలలో కూడ ఇంత అందం దాగి ఉంటుందా అన్పించింది. దానికి తోడు వినయ విధేయతలు ఎదుటివారిని కట్టిపడేస్తాయి. నాకే ఇలా అన్పిస్తే అని మాధవ్‌ని క్రీగంట గమనిస్తే 'సత్య'నే చాలా అడ్మైరింగ్‌గా చూస్తున్నాడు. రెండు గ్లాసులలో పాలతో అత్తయ్య రావడంతో మా ఆలోచనలకు అంతరాయమొచ్చింది.

"శాంతీ మీ తాతయ్యకు చెప్పాను. మంచి సంబంధముంటే చెప్పమని. నాకేమి ఆశలు లేవు. కుర్రవాడు తన భార్యను తాను పోషించుకోగలిగితే చాలు. అలవాటైన ఈ పల్లెలో అందరి మధ్య హాయిగా వుండగలను" అంది అత్తయ్య.

"అమ్మ మాటలకేంగాని శాంతీ! నేను వెళ్లిపోతే అమ్మనెవరు చూస్తారు? చాదస్తం ఎక్కువయ్యింది. చెప్పిన మాట వినదు" అంటూ ఆత్మీయతతో కూడిన మందలింపుతో సత్య అంది.

"పోనీ! నీకెలాంటి రాకుమారుడు కావాలో అత్తయ్యకు చెబితేనే కదా తెలిసేది" అన్నాడు మాధవ్.

"నేనేం రాకుమారుడిని కావాలనలేదు. నువ్వు ఏ రాజకన్యను వరించావో చెప్పరాదూ! మా అమ్మను నాతోనే ఉండనిచ్చే వాడిని చేసుకుంటా" అంది సత్య.

చూస్తాలే అన్నట్టు నవ్వుతూ మాధవ్ తను కాలువ గట్టునుండి జారిపడినప్పుడు నవ్వింది ఈ భామే అని ముక్కున మెరుస్తున్న ముక్కు పుడకను బట్టి గుర్తుపట్టాడు. మనసులోనే ఒక స్థిర నిర్ణయానికి వచ్చిన వాడిలా వున్నాడతను. "మళ్ళీ వస్తాంలే!" అత్తయ్యా అని చెప్పి ఇద్దరం వచ్చేసాం.

★ ★ ★

"ఏమిటి? మాధవా? నువ్వేమి చెప్పలేదు. మామయ్యలంతా రెండు రోజుల్లో వస్తారు. అప్పుడే నువ్వొచ్చి వారం రోజులవుతోంది. 'ఈనాడు పెళ్లిపందిరి'కి ప్రకటనలిస్తే వాళ్లు పంపిన అమ్మాయిల ఫోటోలు, జాతకాలున్నాయి. వాటినొకసారి నీవు చూసి ఏ అమ్మాయి బాగుందో చెబితే పంతులుగారిని పిలిచి జాతకాలు చూపిస్తాం. లేకుంటే టౌన్‌కెళ్తే నెట్‌లో కూడా కొన్ని సంబంధాలు వచ్చి ఉన్నాయి. అవి చూసి రావచ్చు. తొందరపడకపోతే టైం చాలదు" అంది అమ్మ.

"మాధవా? నీ ఆలోచన ఏమిటో చెప్పు... అన్నీ తెలిసిన వాడివి. నిన్ను ఒక్కడినే అంత దూరం మరల పంపించే కంటే పెండ్లిచేసి జంటగా పంపిస్తే మాకు సంతోషంగా ఉంటుంది. పైగా ఏ వయసులో ముచ్చట ఆ వయస్సులో జరగాలి" అన్నారు నాన్న.

# ట్రాఫిక్‌లైట్ల పుట్టుపూర్వోత్తరాలు!



ట్రాఫిక్‌లైట్లని మొదటిసారి లండన్‌లోని బ్రిటిష్ పార్లమెంట్ హౌస్ డిసెంబర్ 10, 1868న ఏర్పాటు చేసింది. దీన్ని రైల్వే ఇంజనీర్ జెపి నైట్ కనిపెట్టాడు. రాత్రిళ్లు ఆకుపచ్చ, ఎరుపు గ్యాస్ లైట్లు వెలిగేవి. ఈ లాంతర్లను లీవర్‌తో అటూ ఇటూ తిప్పి ట్రాఫిక్ కంట్రోల్ చేసేవారు. అయితే జనవరి 2, 1869న ఆ లాంతరు పేలిపోయింది.



ఆధునిక ఎలక్ట్రిక్ ట్రాఫిక్‌లైట్‌ని అమెరికాలో సాల్ట్‌లేక్‌సిటీలో 1912లో లెస్టర్ వైర్ కనిపెట్టాడు. ఓహియోలోని క్లేవ్‌లాండ్‌లో 5, ఆగస్టు 1914న 'అమెరికన్ ట్రాఫిక్ సిగ్నల్ కంపెనీ' నాలుగు రోడ్ల కూడలిలో ఏర్పాటు చేసింది. జేమ్స్ హోగ్ డిజైన్ చేసిన ఈ ట్రాఫిక్ లైట్ మారినప్పుడల్లా ఓ బజ్జర్ హెచ్చరికగా మోగేది. 1920లో డెట్రాయిట్‌లో ఓ కూడలిలో మూడురంగుల లైట్లని ఏర్పాటు చేశారు. పోలీసు ఆఫీసర్ విలియం పోట్స్ దీన్ని కనిపెట్టారు. 1923లో గేరిట్ మోర్గాన్ ట్రాఫిక్ లైట్ల యంత్రానికి తొలిసారిగా పేటెంట్ తీసుకున్నాడు. ఒకదానికొకటి అనుసంధానించిన, చేత్తో లివర్ లాగే ట్రాఫిక్‌లైట్ల సముదాయాన్ని 1917లో సాల్ట్‌లేక్ సిటీలో ఏర్పాటు చేశారు. 1922లో టెక్సాస్‌లోని హ్యూస్టన్‌లో యాంత్రికంగా పనిచేసే ట్రాఫిక్‌లైట్లు ఏర్పాటు చేశారు. అమెరికాలోనే పాదచారుల కోసం క్రాస్‌వాక్ సిగ్నల్‌గా పేర్కొనే ఈ లైట్లు కౌంట్‌డౌన్ పద్ధతిలో పనిచేస్తాయి. ప్రస్తుతం అమెరికాలో సెన్సార్ కెమెరాలని ఉపయోగించి, రెడ్‌లైట్ ఉండగా వెళ్ళే వాహనాలని ఫోటోలు తీసే కెమెరాలని ట్రాఫిక్ సిగ్నల్స్ దగ్గర ఉపయోగిస్తున్నారు.

"బెండకాయ ముదిరినా బ్రహ్మచారి ముదిరినా పనికిరారు" అన్నా.

"నువ్వూరుకోవే! నీ గోల ఏమిటి? " అంటూ, "అమ్మా! మీకు ఆస్తి, అంతస్తు కావాలా? చదువుకున్న చక్కని అమ్మాయి కోడలుగా కావాలా? చెప్పండి ముందు" అన్నాడు మాధవ్.

"మాధవా! నీకు నచ్చిన అమ్మాయిని చెప్పరా అంటే ఈ ప్రశ్నలేమిటి? నీ మనసులో మాట చెప్పరాదూ!" అంది అమ్మ.

"శాంతీ నీకేమైనా చెప్పాడా మాధవ్!" అన్నాడు తాతయ్య.

"నాకేం చెప్పలేదు. వాడు మనసులో ఏదో నిర్ణయించుకున్నట్టున్నాడు. కాని బయట పెట్టడానికి సందేహిస్తున్నాడేమో? " అన్నా సందేహంగా మాధవ్‌ని చూస్తూ, "ఔనా? " అన్నట్లు.

"సస్పెన్స్‌తో జనాలను చంపక చెప్పరా బాబూ!" అన్నారు నాన్న నవ్వుతూ.

"నేను సత్య'ను చేసుకుందామనుకుంటున్నా. ఆస్తి, అంతస్తు లేకపోయినా మర్యాద, మన్నన ఉంది. పైగా నా ఉన్నతికి కారకులైన మాస్టారికి నేనెంతో రుణపడివున్నాను. ఆ రుణం ఈ రూపేణా తీర్చుకుందామనుకుంటున్నా" అన్నాడు.

"భార్యాభర్తల మధ్య రుణ సంబంధాలుండవు. ఒకరిపట్ల ఒకరికి అవగాహన, నమ్మకం, సర్దుకుపోవడం ఉండాలి. నేనేదో రుణం తీర్చుకుంటున్నానన్న భ్రాంతితో చేసుకోవద్దు. మీరిద్దరు ఒకరికొకరు నచ్చితే అప్పుడు ఆలోచిద్దాం" అన్నారు నాన్న.

"అమ్మా! మామయ్యలకు నీవే సమాధానం చెప్పాలి. నేను వారితో మాట్లాడలేను. మీరు నా నిర్ణయం గురించి ఏమీ మాట్లాడరేం? " అన్నాడు మాధవ్ అందరిని ఒకసారి చూస్తూ.

"నీవు పెద్దవాడివయ్యావు. నీకన్నీ తెలుసు. అందుకే మేం నిన్ను ఒత్తిడి చెయ్యలేదు" అంది అమ్మ.

"అమ్మా! మనకున్న సంపద చాలు. నేను సంపాదిస్తున్నా.. అందుకే నేను ఈ నిర్ణయానికి వచ్చా" అన్నాడు మాధవ్.

"అబ్బ! పెళ్లి చూపులకు ఎన్ని ఊళ్లు నీతో తిరగాలా? ఎన్ని చీరలు మార్చాలో ననే ఆలోచనలతో నేను తలమునలై ఉంటే ఇలా తేల్చేసావేమిటిరా? " అన్నా నవ్వుతూ నాకు తెలుసులే అన్నట్టుగా.

మరుసటిరోజు తాతయ్య, అమ్మ, నాన్న, అందరూ కలిసి మాట్లాడుకున్నారు. "సత్య అభిప్రాయం కూడా తెలుసుకుంటే మంచిది కదా" అన్నారు తాతయ్య.

"నేను రేపు ఉదయం పొలానికి వెళ్లే ముందు మాట్లాడి వస్తాలే" అని చెప్పారు.

వస్తూనే తాతయ్య "సత్య, వాళ్లమ్మ ఆశ్చ ర్యానందాలతో నమ్మలేకపోయారు. పంతు లుగారిని కనుక్కొని మంచిరోజు చూసు కొని రమ్మని చెప్పి వచ్చా. ఏమంటావు అమ్మా!" అన్నారు తాతయ్య అమ్మతో.

"వాడిష్ట ప్రకారమే చేద్దాం. మనకూ తెలి సిన అమ్మాయి. ఇంతకంటే ఏం కావాలి? " అంది అమ్మ.

"మరి పెండ్లి ఎక్కడ చేద్దాం? " అన్నారు నాన్న.

వెంటనే తాతయ్య అందుకొని "సత్య పెండ్లి నా చేతుల మీదుగా ఇక్కడే చేస్తా నని మాటిచ్చా. అందుకని పెండ్లి మన ఊరిలోనే మన ఇంట్లోనే జరుగుతుంది. కావాలంటే మీ నవనాగరిక పద్ధతిలో మీ పట్టణంలో రిసెప్షన్ ఏర్పాటు చేసుకోండి అల్లుడూ!" అన్నారు నాన్నతో.

"మాధవా! ఆడపడచు లాంఛనాలన్నీ ఎవరిస్తారు నాకు" అన్నా నవ్వుతూ.

"ఆడపడుచు లాంఛనాలంటూ వచ్చిన ప్పటి నుండి గలభా చేస్తున్నావ్? ఏమేమి కావాలో లిస్టు రాసివ్వు. ఆ లిస్టు ప్రకారం తెచ్చిస్తా" అన్నాడు మాధవ్ ఉత్సాహంగా.

"ఎర్ర తేలుని మరదలుగా తెస్తున్నావు అది చాలు. కొత్త అమ్మాయి కాబోలు ఎలా ఉంటుంది? ఎలా మాట్లాడుతుంది? ఆమె ప్రవర్తన ఎలా ఉంటుంది అని తెగ సందేహాలతో ఆరాటపడిపోతుంటే అంద రిని గాలి తీసిన బెలూన్‌లాగ చేసి పరిచ యమైన అమ్మాయినే ఎన్నుకున్నావు? పోనీలే నా చిన్ననాటి నెచ్చెలి నాకు మర దలు అయ్యింది. మనలో కలిసిపోతుంది. కంగ్రాట్స్" అన్నా నవ్వుతూ.

"ఇక పెండ్లి పనులతో అందరం బిజీ... బిజీ..." అని తాతయ్య అంటూంటే అందరం నవ్వాం.

★ ★ ★

రాత్రి ఆరుబయట మంచాలేసుకొని అందరూ మాట్లాడుకుంటున్నారు. నేను ఆలోచనా ప్రవాహంలో కొట్టుకుపోతున్నా. వైవిధ్యభరితమైన ఈ జీవనయానంలో భిన్న ప్రవృత్తి గల మనుషులతో కలసి మెలసి జీవిస్తూనే 'భిన్నత్వంలో ఏక త్వంలా' మన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకో వడం ఎంత కష్టమోనన్పిస్తుంది. మన సంస్కృతీ సంప్రదాయాలు స్త్రీని గొప్పగా చూపిస్తూనే మళ్లీ 'అబల' అని ముద్ర వేశాయి. కాని నేటి సమాజంలో నేర్పు, సమయస్ఫూర్తి, ధైర్యం, సర్దుబాటుతత్వం ఉన్నవారు సమస్యలను సులభంగా పరి ష్కరించుకోగలరు అన్పించింది. సుజాత లాంటి అమాయకులు మాత్రమే 'అగ్ని పునీత'లవుతున్నారు. తను అనుకున్న లక్ష్యాన్ని ధైర్యంగా చేరిన స్వర్ణ, పరిస్థితు లకు ఎదురొడ్డి నిల్చి తామేమిటో నిరూపిం చుకున్న సుమ, లత, సుధ.. స్త్రీ సబల అని నిరూపించారు. విధివంచిత అయిన 'రమ' జీవితంతో రాజీపడి పిల్లల భవిష్య త్తును తీర్చిదిద్దుతోంది. అమాయకత్వంతో

మోసపోయిన రాధిక జీవితం కూడా సర్దుకున్నది అనుకుంటే మా స్నేహ సౌరభంలోని బంధం ఎంత ఆత్మీయతను పంచి ఇచ్చిందనిపించింది. ఒకసారి మేం మద్రాస్ వెళ్లినప్పుడు అక్కడ 'కదంబమాల' నన్నెంతో ఆకర్షించింది. అందులో మల్లె, సంపంగి, కనకాంబరం, మరువం, దవనం, కస్తూరిపట్టెలు, విరజాజులు కలిపి చక్కగా అరటినారతో కడతారు. వివిధ రంగుల పూలు కలిపి కట్టడంలో ఒక విధమైన ఆకర్షణీయత ఏ పూవుకా పూవు దాని ప్రత్యేకమైన సుగంధాన్ని వెదజల్లుతూ ఉంటుంది. కాని అన్నింటిని కలిపి ఉంచేది దారం. పూవులు వాడిపోయినా దాని వాసన ఆ పూలను కట్టిన దారాన్ని అంటిపెట్టుకొని ఉంటుంది. అలాగే స్నేహమనే దారం వివిధ వ్యక్తిత్వాలు కలిగిన మమ్మల్ని కలిపింది. మేమంతా వివిధ ప్రాంతాల్లో ఉన్నా దారాన్ని అంటిపెట్టుకున్న సువాసనలాగా మా స్నేహ సౌరభాన్ని మరిచిపోలేం. అందుకే 'సృష్టిలో తీయనిది స్నేహమేనోయీ' అన్నాడో కవి. అందులో మాధవ్ చెప్పినట్టు మా బెటాలియన్ అందరినీ మాధవ్ పెండ్లికి ఆహ్వానించాలి అనుకుంటూంటే కనులు ఎప్పుడు మూత పడ్డాయో తేలీదు.




**శ**ని, ఆదివారాలు కావడం వల్ల, పిల్లలు ఆయన కూడా పల్లెకు వచ్చారు. ఇక సందడే సందడి. మాధవ్‌కు అమెరికా నుండి తెచ్చిన ప్రెజెంటేషన్స్ పంచడంతో సరిపోయింది. అమ్మమ్మ నిశ్చితార్థానికి కావలసిన లిస్ట్ రాయడంలో మునిగిపోయింది. అమ్మా నాన్న, తాతయ్యా పెండ్లికి ఎవరెవరిని పిలవాలో లిస్ట్ తయారుచేస్తున్నారు.

పెండ్లి తొందరలోనే కాబట్టి అంతా దగ్గరి చుట్టాలనే పిలవాలని నిర్ణయించుకున్నారు. అందరికి సెలవు కలిసి వస్తుందని, ఆదివారం బాగుంటుందని నిశ్చితార్థం నిర్ణయించారు. సత్యవాళ్ల అమ్మ వాళ్లింట్లో నిశ్చితార్థం చేయండి అని అడిగింది. కాని తాతయ్యా "అమ్మా! నువ్వు ఒంటరిదానవు. మాకా బంధు బలగాలు ఎక్కువ. అందుకని అవస్థ పడతావు. వేరే విధంగా అనుకోకుండా ఒప్పుకో తల్లీ" అన్నారట.

వెంటనే ఆమె రెండు లక్షలు తెచ్చి ఇచ్చి ఈ డబ్బు పెండ్లి ఖర్చులకు దేన్నికైనా వాడండి. ఇవి అమ్మాయికి పెండ్లికని దాచినవి అందట. మీరేమీ తీసుకోకపోతే మీ మాస్టారి ఆత్మ శాంతించదండి అంటూ కన్నుల నీరు నింపుకుందమ్మా అంటూ తాతయ్యా చెప్పారు. ఇక ఎవ్వరమూ ఏమీ మాట్లాడలేదు.

అమ్మ ముందే కోడలికి పెట్టవలసిన చీర, నగలు కొని పెట్టింది. రాత్రి భోజనాలయ్యాక అందరం హాలులో చేరి ముచ్చట్లాడుకుంటున్నాం.

నేను మా స్నేహితులందరినీ పెండ్లికి ఆహ్వానిస్తూ ఉత్తరాలు రాయడంలో లీనమయ్యా. 'కదంబమాల' కనుల ముందు కదలాడుతూ నాకు నూతనోత్సాహాన్నిస్తూంటుంది. 'స్నేహమేరా జీవితం, స్నేహమేరా శాశ్వతం' అనే పాట మైకులో వినిపిస్తోంది గట్టిగా. ©

# కాలాతీతం


లూయీ స్టీవెన్సన్

# కిడ్నాప్డ్

**(1886)**




కథానాయకుడు డేవిడ్ బాల్ఫోర్ పదహారేళ్ల కుర్రాడు. తల్లిదండ్రులు మరణించారు.

అది 1751 జూన్‌లో ఒక ఉదయం. తను పుట్టి పెరిగిన ఇంటికి తాళంవేసి బయల్దేరాడు డేవిడ్. కొత్త జీవితం ప్రారంభించాలి. ఏమైనా సరే, మళ్లీ ఈ ఎస్సెండీన్ గ్రామానికి మాత్రం తిరిగి రాకూడదు. విశాలమైన ప్రపంచంలో బతకటానికి అవకాశాలే దొరకవా? మొదట దేశమంతా తిరిగి చూడాలి. తరువాత అనుకున్నది సాధించాలి. గాలి వెచ్చగా వీస్తోంది. అలాక్ పొదల్లో పక్షులు కిచకిచమంటున్నాయి. గేటు దాటి నాలుగడుగులు నడిచాడో లేదో గ్రామప్రీస్టు మిస్టర్ కాంప్‌బెల్ ఎదురుపడి, డేవిడ్ తండ్రి అలెగ్జాండర్ చివరి రోజుల్లో రాసిన లేఖ ఒకటి అందజేశాడు. దాని ప్రకారం క్రామండ్‌లో వున్న 'షా'ల ఇంటికి వెళ్లాలి డేవిడ్. రెండు రోజుల ప్రయాణం. అక్కడుంటున్న అంకుల్ ఎబెనెజర్ బాల్ఫోర్‌ను ఆస్తిలో వాటా అడగాలి. వాస్తవానికి అదంతా డేవిడ్ తండ్రి అలెగ్జాండర్ సంపాదనే.

"ఒకవేళ అక్కడ సౌకర్యంగా లేకపోతే తిరిగి రా. ఇక్కడ నీకేలోటూ రాకుండా చూస్తాను" అని అభయమిచ్చాడు ప్రీస్ట్.

కొత్త ఉత్సాహంతో పరిగెత్తినంత వేగంగా నడిచి ఎడింబరో చేరుకున్నాడు డేవిడ్. ఒక గొర్రెలకాపరి క్రామండ్‌కు దారిచూపాడు. ఇక 'షా'ల చిరునామా కనుక్కోవాలి. అదేమిటో ఎబెనెజర్ గురించి వాకబు చేస్తే ఒక్కరూ ఒక్క మంచిమాట చెప్పలేదు. ఒకడు 'ఛీ' అంటాడు. మరొకడు 'అమ్మో వాడా?' అంటాడు. ముసలావిడ జెన్నెట్ క్లూస్టన్, కాండ్రించి ఉమ్మేసి ఒక శిథిల భవనంవైపు వేలు చూపింది.

అప్పటికి సూర్యుడస్తమించాడు. చీకట్లు

ముసురుకుంటున్నాయి. తాతలనాటి దయ్యాల కొంప భయానకంగా కనిపించింది. ఇంటి ముందరి భాగం సగం కట్టి మధ్యలో వదిలేశారు. కిటికీల తలుపులు పగిలి గబ్బిలాలకు ఆవాసయోగ్యంగా మారాయి గదులు. ఏవో గరగరా బరబరా శబ్దాలు వినిపించాయి. లోపల మనిషి ఉన్నట్టే ఉంది. దగ్గుతున్నాడు. సందేహిస్తూనే తలుపు తట్టాడు డేవిడ్. సమాధానం లేదు. మరోసారి భయంగా గడియ చప్పుడు చేశాడు. గబ్బిలం ఒకటి తలమీద మొట్టికాయ వేసి విసురుగా తలుపు సందులో దూరింది. ప్రధాన ద్వారానికి ఇనుప బొడిపెలున్నాయి.




తనకేమైనా జరిగితే రక్షించేవాళ్లెవరు? కీచు గొంతుతో కేకేశాడు. మరోసారి నిశ్శబ్దమే సమాధానం. ఇక వెనుదిరిగి వెళ్లిపోవాలనుకున్నాడు. అంతలో తలుపు కిర్రుమంది. దగ్గు శబ్దం దగ్గరైంది. తలమీద ముసుగు కప్పుకున్న వ్యక్తి ఓరగా తలుపు తెరిచి, ఛాతీకి తుపాకి గురిపెట్టి 'ఎవర్నువ్వు?' అంటూ గద్దించాడు.

వణికే చేతుల్తో కోటు జేబులోంచి ఉత్తరం తీసి చూపాడు డేవిడ్. వృద్ధుడు దానివైపు పరిశీలనగా చూసి, లోపలికి రమ్మని సైగచేశాడు. సంపన్నుల ఇల్లులాగే వుంది. కానీ తినటానికి సంగటి మాత్రమే ఇచ్చాడు యజమాని. డేవిడ్ తిన్నంతసేపూ పక్కనే కూర్చుని ఉత్తరాన్ని మరోసారి జాగ్రత్తగా చదివాడు. ఆ తర్వాత తన మంచితనం నిరూపించుకోవడానికన్నట్టు డేవిడ్‌కు నలభై గినీలిచ్చి, మేడపైన టవర్‌లో ఉన్న ఒక పెట్టె తీసుకురమ్మని చెప్పాడు. మెట్లమీద దీపం లేదు. అంతా చీకటి. కొన్ని మెట్లు విరిగినట్టుగా ఉన్నాయి. ఎబెనెజర్ అసలే ముక్కోపి. తిక్కమనిషి. చెప్పినమాట వినకపోతే ఏమైనా చేస్తాడు. అయితే ఒక్క మెట్టు జారినా కింద చీకటి గుయ్యారంలో పడిపోవటం ఖాయం. ఆస్తిలో వాటా ఇచ్చే ఉద్దేశం లేనట్టుంది. తనను చంపటానికి ప్రయత్నిస్తున్నాడు.

తనకు డబ్బక్కర్లేదు. అంతా ఆ ముసలాడే దాచుకొని, తన మానాన తనను పోనిస్తే చాలనుకున్నాడు డేవిడ్. కాని ఎబెనెజర్ దేనికీ సూటిగా సమాధానం చెప్పడు. కళ్లలో దుష్టత్వం కనిపిస్తుంది. డబ్బు పిచ్చి వృద్ధులకే ఎక్కువ.

మరునాడు రాన్సమ్ అనే కుర్రవాడొచ్చి, కొవెనెంట్ షిప్పులో కెప్టెన్ హోసీజన్, వ్యాపార విషయాలు చర్చించటానికి ఆహ్వానించాడని ఎబెనెజర్‌కు రహస్యంగా వర్తమానం చేరవేస్తాడు. తక్షణమే డేవిడ్‌ను వెంటబెట్టుకుని సౌత్‌క్వీన్స్ ఫెర్రీలో ఉన్న హోసీజన్ వద్దకు పోతాడు ఎబెనెజర్. అక్కడ ఆ అంకుల్‌ని ఒంటరిగా వదలటమే డేవిడ్ చేసిన పెద్ద పొరపాటు. మొదటిసారిగా డాక్‌యార్డ్ చూసిన సంతోషంలో రాన్సమ్‌తో కలిసి హార్బరంతా తిరుగుతాడు. షిప్పు మీద ఉద్యోగమిస్తానంటాడు హోసీజన్. ఆ మరుక్షణమే అంకుల్ చూస్తుండగానే ఎవరో తలమీద బలంగా కొట్టటంతో స్పృహ కోల్పోతాడు.

కొన్ని గంటల తర్వాత మెలకువ వచ్చేసరికి, కాళ్లూ చేతులూ కట్టేసి, షిప్పు కింది భాగంలో తనను నిర్బంధించినట్టుగా తెలుసుకుంటాడు డేవిడ్. గాయంవల్ల అతడి ఆరోగ్యం క్షీణిస్తుంది. కొవెనెంట్‌లోని ఒక

# రాబర్ట్ లూయీ స్టీవెన్సన్

## ( 1850 - 1894 )

జీవితమంతా మృత్యువుతో పోరాడుతూ దినదిన గండంగా బతికిన ఈ అల్పాయుష్కుడు, తన రచనలతో రుడ్యార్డ్ కిప్లింగ్, జి. కె. చెస్టర్‌టన్, జె.ఎం. బ్యారీ, జార్జ్‌లూయిస్ బోర్గ్స్ ఎర్నెస్ట్ హెమింగ్వే, వ్లాడిమిర్ నబకోవ్‌లాంటి మహారచయితలనెందరినో ప్రభావితం చేశాడు. గుక్కతిప్పుకోనివ్వని కథనంతో పాఠకుణ్ణి క్షణ క్షణం సంభ్రమాశ్చర్యాలకు గురిచెయ్యటం ఎలాగో తెలుసుకోవాలంటే స్టీవెన్సన్‌ను చదవక తప్పదంటారు.

రాబర్ట్ లూయి బాల్ఫోర్ స్టీవెన్సన్ స్కాట్లండ్‌లోని ఎడింబరోలో జన్మించాడు. తండ్రి లైట్‌హౌస్ ఇంజనీర్. పూర్వీకుల నుండి వచ్చిన ఊపిరితిత్తుల వ్యాధి స్టీవెన్సన్‌కు సంక్రమించింది. చలి ప్రదేశాలలో ఆరోగ్యం క్షీణిస్తుంది. పదకొండేళ్లదాకా తెరిపిలేని దగ్గుతో స్టీవెన్సన్ మంచం దిగలేదు. అది బ్రాంకియోక్టాసిస్ లేదా సార్కోయిడోసిస్ అయ్యుండవచ్చని నిర్ధారించారు డాక్టర్లు.

"నాకే లోటూ లేదు. ప్రకృతి నాకన్నీ ప్రసాదించింది ఆరోగ్యం తప్ప. కాని ఇదీ ఓ వరమే. అనారోగ్యంతో ఉన్నప్పుడే జీవితం ఎంత విలువైనదో తెలుస్తుంది. నా రచనలకు ప్రేరణ అదే" అన్నాడు స్టీవెన్సన్.

యూనివర్సిటీ ఆఫ్ ఎడింబరోలో ఇంజనీరింగ్ చదవటానికి చేరాడుగాని, అక్కడ ఉన్న న్నాళ్ళూ వక్తృత్వపోటీలు నిర్వహించే స్పెక్యులేటివ్ క్లబ్బులో చేరి తన ప్రతిభ కనపర్చాడు. స్టీవెన్సన్‌కు యాత్రలంటే మహాయిష్టం. తండ్రి కున్న ఇంజనీరింగ్ సైట్స్ చూసే నెపంతో స్కాట్లండంతా తిరిగాడు. కొడుకు భవిష్యత్తు గురించి బెంగ పెట్టుకున్న తండ్రి స్టీవెన్సన్‌ను 'లా' చదవమన్నాడు. స్టీవెన్సన్‌ది తిరుగుబాటు స్వభావం. జుత్తు పెంచి, విచిత్ర వస్త్రధారణతో

---

ఉద్యోగి మిస్టర్ రియాచ్ డేవిడ్‌కు సాయం చేస్తాడు. అందరికన్నా రాన్సమ్ పరిస్థితి మరీ అధ్వాన్నం. క్రూరంగా హింసించటానికే వాణ్ణి పనిలో పెట్టుకున్నారు కాబోలు ననుకుంటాడు డేవిడ్. ఒకనాడు కోపంతో మరో ఉద్యోగి మిస్టర్ షువాన్ వాణ్ణి కొడితే చచ్చిపోతాడు. సిబ్బంది ప్రవర్తన డేవిడ్‌కు అత్యంత హేయంగా, నీచంగా, జుగుప్సాకరంగా కనిపిస్తుంది. తనను కరోలినాస్‌లో బానిసగా అమ్మటానికి తీసుకుపోతున్నారని కూడా తెలుస్తుంది.

ఇప్పుడు రాన్సమ్ లేడు గనక, డేవిడ్‌కు కేబిన్‌బాయ్‌గా బాధ్యతలప్పగించాడు కెప్టెన్. పొగమంచువల్ల ఫ్రాన్స్ నుండి వస్తున్న ఒక పడవను ఢీకొడుతుంది కొవెనెంట్. అలాన్ బ్రెక్ స్టువార్ట్ అనే యువకుడు తప్ప, ఆ పడవలోని ప్రయాణికులందరూ మరణిస్తారు. అలాన్ బ్రెక్ కూడా ఇప్పుడు బందీ.

తనను విడుదల చేస్తే కావలసినంత డబ్బిస్తానని ఆశ చూపుతాడతడు. కాని షిప్పులోని సిబ్బంది అలాన్‌ను చంపి, సముద్రంలో పడవేయాలనుకుంటారు. ఆత్మరక్షణ కోసం ప్రయత్నించమని డేవిడ్ కూడా హెచ్చరిస్తాడు. ఆ తర్వాత సిబ్బంది దాడి చేసినప్పుడు అలాన్, డేవిడ్‌లు ఒక జట్టుగా వాళ్లతో యుద్ధం చేస్తారు. షువాన్‌ను చంపుతాడు అలాన్. హోసీజన్‌ను తీవ్రంగా గాయపరుస్తాడు డేవిడ్. అయిదుగురు సిబ్బంది హతులవుతారు.

అలాన్ ఓ జాకొబైట్ కాథలిక్ తిరుగుబాటుదారు. అతను ఇంగ్లండు, స్కాట్లండ్, ఐర్లండ్‌ల మీద స్టువార్ట్ వంశ పాలనను సమర్థిస్తాడు.

బోహిమియన్‌గా మారాడు. మతాచారాలను నిరసించాడు. మద్యశాలలూ, వ్యభిచార గృహాలూ అతణ్ణి ఆకర్షించాయి.

1876లో ఇరవైఆరేళ్ల స్టీవెన్సన్, భర్త నుండి వేరుగా వుంటున్న ముప్పైనాలుగేళ్ల అమెరికన్ వనిత ఫానీ ఆస్బోర్న్ వాండెగ్రిఫ్ట్‌తో ప్రేమలో పడ్డాడు. పెళ్లికి తల్లి దండ్రులు నిరాకరించారు. నానాకష్టాలూ పడి నాలుగేళ్ల తర్వాత ఆమెను వివాహమాడాడు.

దంపతులు స్విట్జర్లాండులో స్థిరపడ్డారు. కాని స్టీవెన్సన్ ప్రతిరోజూ ఆరిపోయే దీపంలాగే బతికాడు. 1887లో వైద్యుల సలహాననుసరించి కొలరాడో వెళ్లాడు. అమెరికాలో అతడికి ఘన స్వాగతం లభించింది. 1888లో ఒక పడవ మీద సౌత్‌సీస్‌కు పయనమై, చివరిదాకా అక్కడే బతికాడు. సెమోవాలో మరణించాడు. జీవితకాలంలోనే సెలిబ్రిటీ స్టేటస్ అనుభవించిన రచయిత స్టీవెన్సన్.

ట్రెజర్ ఐలండ్ (కాంచనద్వీపం) (1883), స్ట్రేంజ్ కేస్ ఆఫ్ డాక్టర్ జెకిల్ అండ్ మిస్టర్ హైడ్ నవలల గురించి తెలియని తెలుగు పాఠకులు ఉండరు. ఇవికాక ది బ్లాక్ ఆరో (1883), ది మాస్టర్ ఆఫ్ బల్లాంట్రే (1889) వగైరా నవలలూ, న్యూ అరేబియన్ నైట్స్ (1882), మెర్రీ మెన్ (1887), సౌత్ సీ టేల్స్ (1893)లను పాఠకులు ఇప్పటికీ చదువుతూనే వున్నారు.

స్టీవెన్సన్ రచనలు చదివి కథ చెప్పటంలోని మెళకువలు నేర్చుకున్నామన్నారు ప్రఖ్యాత నవలాకారులు జోసెఫ్ కోన్రాడ్, హెన్రీజేమ్స్‌లు.

ఈయన నవల 'ట్రెజర్ ఐలండ్' అంత పాఠకాదరణ 1886లో వెలువడిన 'కిడ్నాప్డ్'కు లభించకపోయినా, ఇదే ఎక్కువ పరిణతి చెందిన రచన అంటారు విమర్శకులు.

చారిత్రక నేపథ్యమున్న నవల కిడ్నాప్డ్, మొదట 'యంగ్ ఫోక్స్' పత్రికలో సీరియల్‌గా వచ్చింది. ఇప్పటిదాకా మనం చెప్పుకున్న రచయితలందరూ ఇదే తమ అభిమాన నవల అన్నారు.

స్కాట్‌లాండ్‌లో ఒక వర్గమైన జాకోబైట్లు తిరుగుబాటు చేసినప్పుడు 1752లో 'అప్పిన్' హత్య జరిగింది. అదే ఈ నవలలో ముఖ్యాంశం.

యుద్ధంలో కెప్టెన్ ఓటమిని అంగీకరించి అలాన్, డేవిడ్‌లకు కొవెనెంట్ మీద సౌకర్యాలు కలిగిస్తాడు. తిరుగుబాటు ప్రయోజనం గురించి చర్చించుకుంటారు డేవిడ్, అలాన్.

తన మాతృదేశం ఒక దుష్ట బ్రిటిష్ అధికారి రెడ్‌ఫాక్స్ నియంతృత్వ పాలనలో మగ్గిపోతున్నదనీ, దానికి విముక్తి కలిగించటమే తన జీవిత లక్ష్యమనీ ప్రతిజ్ఞ చేస్తాడు అలాన్. అంతేకాదు. రెడ్‌ఫాక్స్ కనిపిస్తే తక్షణం మట్టుపెట్టడానికి కూడా వెనుకాడడు.

తమ ఓడ కొవెనెంట్ తుపానులో చిక్కుకుంటుంది. చిన్న పడవల్లో ఎక్కి ప్రాణాలు రక్షించుకోవటానికి ప్రయత్నిస్తారు ప్రయాణికులు. డేవిడ్ ఎక్కిన పడవ ఆ ప్రళయ ఝంఝామారుతంలో డికో పయనించి మల్ ద్వీపానికి చేరుకుంటుంది చివరికి. అక్కడ ఒక స్కాటిష్ విప్లవకారుడు కనిపించి, అలాన్ సజీవంగానే ఉన్నాడనే తీపి కబురందిస్తాడు. డేవిడ్ మరో ప్రదేశం టూరోసేకు వెళ్లటానికి నడక ప్రారంభిస్తాడు. దారిలో ఇద్దరు దోపిడి దొంగలతో తలపడి, తెలివిగా వాళ్లనుండి తప్పించుకుంటాడు. ఆ తర్వాత టూరోసే చేరుకుని, అలాన్ సన్నిహిత మిత్రులు నీల్‌రాయ్ మెక్రాబ్, మిస్టర్ హెండర్లాండ్‌లను వెంట బెట్టుకుని ప్రయాణం తిరిగి కొనసాగిస్తాడు.

అలాన్ ఎక్కడో అజ్ఞాతంలో ఉన్నాడు. తన శత్రువు కోసం గాలిస్తున్నాడు కాబోలు. కాని ఒకనాడు అనూహ్యంగా, డేవిడ్ ఎదుట ప్రత్యక్షమవుతాడు రెడ్

ఫాక్స్. వెంట ఒక లాయర్, షెరిఫ్‌కు సేవకుడైన అధికారి ఒకడు ఉన్నారు. డేవిడ్ అతణ్ణి పలకరించేలోగానే చెట్లచాటు నుండి ఎవరో తుపాకీతో కాలుస్తారు. ఉన్నఫళంగా నేలకు తాకుతాడు రెడ్‌ఫాక్స్. తన క్లయింట్ హత్యకు ప్రధాన కుట్రదారుడు డేవిడ్ అని ఆరోపిస్తాడు లాయర్. ప్రాణభయంతో కొండల్లోకి పారిపోతాడు డేవిడ్. అక్కడ ఒక రహస్య స్థావరంలో కనిపిస్తాడు అలాన్. అతడు రెడ్‌ఫాక్స్‌ను చంపింది తను కాదని ఒట్టు పెట్టుకుంటాడు. ఇద్దరూ కలిసి, వెంటాడే అధికారుల కళ్లుగప్పి అలాన్ ఆంతరంగిక మిత్రుడు జేమ్స్ ఆఫ్ ది గ్లెన్స్ నివాసానికి చేరుకుంటారు. అతడు అప్పటికే తన వద్ద వున్న ఆయుధాలను నేలలో భద్రపరిచాడు. పోలీసులు తిరుగుబాటుదారులందర్నీ వేటాడుతున్నారు. ఆయుధాలతో పట్టుబడితే తీవ్రమైన శిక్షలు తప్పవు.

"మిమ్మల్ని నేను రక్షించలేను సరికదా, మీవల్ల నేను అనేక ఇబ్బందులకు గురవ్వాల్సి ఉంటుంది. మీరు పారిపోదలిస్తే ఆయుధాలూ, భోజనం సప్లై చేస్తాను" అంటాడు జేమ్స్.

ఒక చిన్నదేశంలో వెంటాడే, వేటాడే అధికారుల నుండి, వేగుల నుండి తప్పించుకోవటం ఎంతకష్టం! ఎటుచూసినా పదాతి సైనికులు, అశ్విక దళాలు, పొంగెత్తే నదులు. తలదాచుకోవటానికి చోటే కరువైంది. ఎవరూ ఆశ్రయమివ్వరు. తమకు సహాయం చేయగలిగిన వీరుడు జాన్ బ్రేక్ ఒక్కడే. కాని ప్రభుత్వం అప్పటికే అతణ్ణి అరెస్టు చేసింది. ప్రాణాలరచేతపట్టుకుని అలాన్, డేవిడ్‌లు తమ రహస్య ప్రయాణం కొనసాగించారు. ఒకచోట తిరుగుబాటుదారుల బృందం కనిపించింది. వాళ్ల నాయకుడు క్లూనీ మెక్ఫెర్సన్ కూడా అధికారుల కళ్లు గప్పి తిరుగుతున్నాడు. అయితే డేవిడ్‌కు క్లూనీ ప్రవర్తన నచ్చదు. డేవిడ్ జెంటిల్మన్. క్లూనీ జూదరి. జూదమాడిన అలాన్ తన వద్దనున్న డబ్బంతా పోగొట్టుకుంటాడు. డేవిడ్‌ను డబ్బు అడిగి తీసుకుని అదీ ఆటలో సమర్పించుకొంటాడు. దారి క్లియర్‌గా ఉందని వేగులవాళ్లు సమాచారమందించటంతో డేవిడ్, అలాన్‌లు తమ ప్రయాణం తిరిగి ప్రారంభిస్తారు.

అలాన్‌కు జూదమాడే బలహీనత వుంది. డేవిడ్ ఎంత చెప్పినా అతడు తన పద్ధతి మార్చుకోడు. డేవిడ్‌కు కోపం వస్తుంది. పోట్లాట కూడా జరుగుతుంది. అలాన్‌ను మల్లయుద్ధానికి ఛాలెంజి చేస్తాడు డేవిడ్. కాని మిత్రుడి మీద, తన కన్న చిన్నవాడి మీద యుద్ధం ప్రకటించడానికి సిగ్గుపడతాడు అలాన్. ఖడ్గం కింద పడేస్తాడు. బాల్కుహిడ్డర్‌లో డేవిడ్‌కు సురక్షితమైన ఆశ్రయం కల్పిస్తాడు. ఆ తర్వాత ఇద్దరూ కలిసి ఒక గొప్ప పైప్ వాద్యకారుడు డంకన్ ధూ ఇంటికెడతారు.

అక్కడ ప్రజాద్రోహి, హంతకుడు రాబిన్ ఓగ్గన్ ఆఫ్ రాబ్‌రాయ్ మెక్ గ్రెగర్ కనిపిస్తాడు. కోపంతో కత్తి దూస్తాడు అలాన్. ఇద్దర్నీ శాంతింపచేసి కత్తులు దింపి, సంగీతంలో పోటీపడమంటాడు డంకన్. ఇద్దరూ ఒకరికన్నా బాగా ఒకరు పైప్ వాయిస్తారు. కాని రాబిన్‌దే పైచేయి అని అందరూ అంగీకరిస్తారు. అలాన్, డేవిడ్‌ల యాత్ర కొనసాగుతుంది.

కొన్నాళ్ల ప్రయాణం తర్వాత వీళ్లకు ఎబెనెజెర్ తరఫు లాయర్ రాన్‌కెయిల్లర్ తారసపడతాడు. తన పరిస్థితి అతడికి వివరిస్తాడు డేవిడ్. ఆస్తిలో వాటా ఇప్పిస్తానని వాగ్దానం చేస్తాడు లాయర్. అందుకోసం, అలాన్ ఓ వ్యూహం రచిస్తాడు.

డేవిడ్, రాన్‌కెయిల్లర్‌లను పొదల్లో దాచి, తను ఎబెన్‌జెర్ వద్దకెళ్లి ఒక కోటలో డేవిడ్ బందీగా వున్నాడనీ, ఇక ఎక్కువ

# అప్పుల అప్పారావు



జైలునించి తప్పించుకున్న నేరస్థుడు గ్రాహంలీవర్(53) ఇంగ్లండ్‌నుంచి అమెరికా పారిపోయాడు. అక్కడ అతను మారుపేరుతో చలామణి అయ్యాడు. తను డిప్లొమేట్‌ననో, బ్రిటిష్ సీక్రెట్ సర్వీస్ ఏజెంట్‌ననో కట్టుకథలు చెప్పి ఆడవాళ్లను లాస్‌ఏంజెలెస్‌లో మోసగించి చాలా డబ్బు గడించాడు.



ఓ మహిళకి ముందుగా తను రాసే పుస్తకం గురించి చెప్తాడు. ఆ పుస్తకంవల్ల అడ్వాన్స్‌గా రాయల్టీ వచ్చిందని, దాన్ని సినిమాగా తీస్తున్నారని, తాను బ్రిటీష్ క్వీన్ ఒకప్పటి రహస్య ప్రియుడినని, ఆ రహస్యాలు ఆ పుస్తకంలో ఉంటాయని నమ్మిస్తాడు. తనకి మిగిలిన రాయల్టీ రాగానే డబ్బు వెనక్కిస్తానని వారినుంచి అప్పు తీసుకుంటాడు. ఇందుకు పబ్లిషర్స్‌తో, సినిమా స్టూడియోతో చేసుకున్న దొంగ ఒప్పంద పత్రాలను చూపిస్తాడు. హాలీవుడ్‌లోని ప్రముఖులతో తీయించుకున్న ఫొటో ఆల్బమ్‌నూ చూపిస్తాడు. తన మాటలతో చాకచక్యంగా ఆకట్టుకుని తను ఓ గొప్ప వ్యక్తిగా వాళ్ళకి ఇంప్రెషన్ ఇస్తాడు. అలా అమెరికా అంతటా ఇరవై లక్షల డాలర్లని రెండేళ్ళలో అనేక మంది మహిళల నుంచి అప్పు తీసుకుని ఎగ్గొట్టాడు. ఖరీదు చేసే సూట్లు ధరించి, ఖరీదైన రెస్టారెంట్స్‌కి తీసుకెళ్లి అతను వారికోసం 500 డాలర్ల బిల్లును చెల్లిస్తాడు. వారిని వివాహం చేసుకునే ఆసక్తి ఉన్నట్లు నటిస్తాడు. తను వారికి మానసికంగా దగ్గరయ్యేలా నటించి అప్పుడు అప్పు అడుగుతాడు. ఆ తర్వాత మాయమవుతాడు. ఫ్లోరిడా పోలీసులు అతడి కోసం తీవ్రంగా వేటాడుతున్నారు. ఇతని మీద కొత్త ఫిర్యాదులు ఎఫ్‌బిఐకి వివిధ పోలీస్ స్టేషన్స్‌నుంచి అందుతూనే ఉన్నాయి.

కాలం బతకడనీ చెబుతాడు. అసలు డేవిడ్‌నెవరూ అపహరించలేదని మొదట బుకాయిస్తాడు ఎబెనెజర్. అయితే అలాన్ మాటల గారడీకి లొంగి, డేవిడ్ కిడ్నాప్ కోసం హోసీజన్‌కు ఇరవై పౌండ్లు ఆశ చూపానని అంగీకరిస్తాడు. మరుక్షణమే, డేవిడ్, రాన్‌కెయిల్లర్‌లు ప్రత్యక్షమై, అతడి దుష్టబుద్ధి గురించి అధికారులకు ఫిర్యాదు చేస్తామని బెదిరిస్తారు. భయపడిన ఎబెనెజర్, లాయర్ చెప్పినట్టే చేయటానికి అంగీకరిస్తాడు. డేవిడ్‌కు మూడింట రెండువంతుల ఆస్తి సంక్రమిస్తుంది. అలాన్ ఫ్రాన్స్ వెళ్లిపోతాడు. డబ్బు డిపాజిట్ చెయ్యటానికి బ్యాంకు కోసం వెదుకుతాడు డేవిడ్.

★ ★ ★

ఇందులో కథకన్నా వర్ణనలు అద్భుతమంటాడు ప్రముఖ ఐరిష్ కవి, నోబెల్ గ్రహీత సీమస్ హీనీ.

ఇందులోని తరువాతి కథ రచయిత స్టీవెన్సన్ 1893లో ప్రచురించిన మరోనవల 'కాట్రియోనా'లో కొనసాగుతుంది.

★ ★ ★

అలాన్ బ్రెక్ స్టువార్ట్, క్లూనీ మెక్ఫెర్సన్, రాబిన్ ఓగ్ మెక్‌గ్రెగర్‌లు వాస్తవ వ్యక్తులు.

వీళ్లంతా తిరుగుబాట్లలో పాల్గొన్నారు. ప్రచురణ అయిన వెంటనే ఈ నవల పాఠకులను విశేషంగా ఆకట్టుకోవటానికి అది కూడా ఒక కారణం.

ఈ కథ ఇప్పటికి కనీసం ఇరవైసార్లు సినిమాగా, టీవీ సీరియల్‌గా వచ్చింది.

–ఎం.వసంత

అపార్ట్‌మెంటాలజీ 22

# 'లై'డిటెక్టర్



యర్రంశెట్టి శాయి

(గత సంచిక తరువాయి)

**"ద**ణ్ణం పెడతాన్సార్! ఇంక దాని జోలికి పోన్సార్" అన్నాడు దణ్ణం పెడుతూ. ఫుల్‌గా మందు కొట్టి ఉన్నాడు కాబట్టి మేము అంతకంటే చేసేదేమీ లేక వెనక్కు వచ్చేశాం.

కాసేపటి తర్వాత లావణ్య మేమందరం మాట్లాడుతూంటే ఏడుస్తూ వచ్చింది.

"అన్నయ్యా! ఈ మనిషేమంటున్నాడో తెలుసా? మీరంతా వార్నింగిచ్చారు కనుక నన్నింక కొట్టడంట. కాని రేపే ఆ 'లైడిటెక్టర్' పరీక్ష చేయిస్తాడంట! అబద్ధం చెప్పినట్లు తెలిసిందంటే నన్ను నరికేస్తాడంట"

అందరం షాకయ్యాం- రాజనర్సింహ సంగతి మాకు బాగా తెలుసు! అతనికి ఇదివరకే క్రిమినల్ రికార్డ్ ఉంది.

ఆ లైడిటెక్టర్ వల్ల క్రైమ్ పుట్టటానికి అవకాశముందన్న సంగతి అర్థమైంది. పైగా లావణ్య సంసారం నాశనమైపోవచ్చు.

వెంటనే ఆమెను షైనీ దగ్గరకు తీసుకెళ్ళాం. లావణ్య చెప్పిందంతా వినేసరికి షైనీకీ కొంచెం భయం వేసినట్లయింది.

"కానీ ఇది లేడీస్‌ని టెస్ట్ చేయడానికి తీసుకొచ్చింది కాదు" అందామె తప్పించుకోడానికి చూస్తూ!

"అంటే ఎంతసేపూ మగాళ్ళనే వేధిద్దామనా? " అంటూ ఎదురు తిరిగాడు విజయ్ యాదవ్.

షైనీ కొంతవరకూ డిఫెన్స్‌లో పడింది.

"అలా అని కాదూ! కానీ మా కమిటీ అంతా డిసైడ్ చేయాలి! వాళ్ళంతా ఎలా డిసైడ్ చేస్తే అలా" అంది తప్పించుకోడానికి మార్గం వెతుకుతూ.

సరిగ్గా అప్పుడే లావణ్య అన్నలిద్దరూ వచ్చారు. వాళ్ళు సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లు. మార్కెటింగ్‌లో ఉన్నారు.

లావణ్య జరిగిందంతా చెప్పి వాళ్ళను ఇంటికి తీసుకెళ్ళింది.

మర్నాడు ఉదయం మేము మా సొసైటీ రీడింగ్ రూమ్‌లో ఉండగా ఒక మినీ వ్యాన్‌లో ఇద్దరు చైనావాళ్ళొచ్చారు.

"మాకు షైనీ మేడమ్ కావాలి" అన్నారు వచ్చీరాని హిందీలో.

"పర్మనెంటుగా తీసుకెళ్ళిపోతారా

ఆమెని? " ఆశగా అడిగాడు బోసు.

"ఓ! నో! మాక్కావలసింది ఆమె కాదు. మా కంపెనీ నుంచి ఆమె కొన్న లైడిటెక్టర్ వాపస్ తీసుకెళ్ళడానికొచ్చాం"

ఆ మాటతో ఒక్కసారిగా మా అంద రిలో ఎక్కడలేని ఉత్సాహం వచ్చింది.

"ఏంటి? ఆ మిషన్ వాపస్ తీసుకెళ్త న్నారా? "

"అవును"

"ఎందుకు? "

"మా కంపెనీ తయారుచేసిన 2008 బ్యాచ్ మిషన్ ఇది. ఆ మిషన్లన్నిటికీ మాన్యుఫాక్చరింగ్ డిఫెక్ట్స్ ఉన్నాయ్. అందుకని ఇండియాలో మేము అమ్మిన మిషనుల్ని వాపస్ తీసుకెళ్ళి రిపేర్ చేసి ఇస్తాం"

ఆ వార్త షైనీకి చేరవేశాం!

షైనీ హడావుడిగా వచ్చింది.

"ఏంటి డిఫెక్ట్? " అడిగిందామె

"అబద్ధం చెప్పినా, నిజం చెప్పినా సైరన్ వస్తోంది"

రెడ్డి 'యాహూ' అని గావుకేక పెట్టేస రికి అందరూ గాబరాపడ్డారు.

"అదేంటలా అరిచావ్? " అడిగారు అందరూ.

"అంటే నేను నిర్దోషిననేగా అర్థం? "

"అంటే నేనూ నిర్దోషినే! టీవీలో కనబ డింది నేను కాదు" అరిచాడు శాస్త్రి.

షైనీకి నోటమాట లేదు. మొఖం వాడి పోయింది.

"చెత్త మిషన్ మాకెందుకమ్మారు? "

"మా చైనా కంపెనీలు ఏ వస్తువమ్మినా చౌకబారు పార్ట్సుతోనే తయారు చేస్తారని మీకూ తెలుసు. అందుకే మార్కెట్లో మంచి వస్తువు యాభైవేలుంటే.. మేము అయిదువేలకిస్తున్నాం. కొనేవాళ్ళు కూడా ఆ మిషన్ నాల్రోజులు పనిచేస్తే చాల్లే అని కక్కుర్తిపడి కొనుక్కుంటారు. అలాం టప్పుడు అది చెత్తంటూ కంప్లెయిన్



చేయటం మీనింగ్‌లెస్" అన్నారు వాళ్ళు.

షైనీకేం చేయాలో అర్థంకావట్లేదు.

"ఇంతకూ ఇప్పుడేం చేయబోతున్నారు"

"ఆ మిషన్ తీసుకెళ్ళి దాన్ని సరిచేసి మళ్ళీ తెచ్చిస్తాం"

"సరే తీసుకెళ్ళండి"

వాళ్ళు వెంటనే ఒక రశీదు రాసిచ్చి మిషన్ వ్యాన్‌లో వేసుకుని వెళ్ళిపోయారు.

టెంపరరీగా ప్రాబ్లెమ్ సాల్వ్ అయింది గదాని అందరం హాపీగా ఫీలయ్యాం! సీక్రె ట్‌గా స్వీట్లూ పంచారు కొంతమంది.

అయితే కొద్ది రోజుల తరువాత లైడిటె క్టర్ రిపేర్ అయిందేమో తెలుసుకోడా నికి... షైనీ ఆ కంపెనీ సర్వీస్ సెంటర్ కెళ్ళినప్పుడు ఓ షాకింగ్ న్యూస్ తెలిసింది. అదేమంటే ఆ లైడిటెక్టర్‌లో డిఫెక్ట్స్ లేనేలే వనీ, తమ కంపెనీ తరపున ఎవరూ మిషన్లు వాపస్ తీసుకోలేదనీనూ!

షైనీ తెచ్చిన రశీదుచూసి "ఇది బోగస్. మా కంపెనీ కాదు" అన్నారు వాళ్ళు.

"మరిప్పుడు మేమేం చేయాలి? "

"పోలీస్ కంప్లెయింట్ ఇవ్వండి"

షైనీ పోలీస్ కంప్లైంట్ ఇచ్చింది.



ఇచ్చి సంవత్సరం అవుతోందిగానీ ఇంత వరకూ ఇన్వెస్టిగేషన్ పూర్తవనేలేదు. లక్ష లకొద్దీ కేసుల్లాగానే అదీ 'పెండింగ్' లెవ ల్లోకెళ్ళిపోయింది.

ఆ తర్వాత షైనీ మళ్ళీ ఎప్పుడూ లైడిటెక్టర్ టాపిక్ ఎత్తలేదు.

"పోతే పోనీ.. వెధవ మిషన్" అనీ ఆడా మగా కూడా చిరాకు పడటం మొదలు పెట్టారు.

ఆ తర్వాత మా కమిటీ వాళ్ళం చాలా సీక్రెట్ మీటింగ్స్ కండక్ట్ చేశాంగానీ ఆ మిషన్‌ని అంత తెలివితేటలతో మాయం చేసిందెవరో తెలియలేదు.

"ఇది స్టూడెంట్స్ పనే బ్రదరూ! ఆ సుస్మిత లవ్‌టెస్ట్ పెడతానందని భయపడి మిగతా ఫ్రెండ్స్‌తో కలిసి నాటకమాడి ఉంటారు" అన్నాడు కృష్ణమూర్తి.

"నా అనుమానం ఏంటంటే లావణ్య అన్నలే ఆ పనిచేయించి ఉంటారని అనిపిస్తోంది. లేకపోతే తమ చెల్లెలి జీవితం ప్రమాదంలో పడుతుందని అనుకుని ఉంటారు" అన్నాడు విజయ్ యాదవ్.

అసలు విషయం సీక్రెట్‌గా తెలిసింది మాకు. అది షైనీ ఆడిన నాటకం అని!

"ఆ లైడిటెక్టర్ వల్ల లేడీస్‌కే ఎక్కువ సమస్యలు వస్తాయని తెలుసుకుని అలా చేసి ఉంటుంది" అన్నాడు శంకరమూర్తి.

ఏదేమయితేనేం! మా రామ్‌భరోసా అపార్ట్‌మెంట్స్ తాలూకు మేజర్ ప్రాబ్లెమ్ సాల్వ్ అయిపోయింది.

## జంతువులారా! క్షమించండి!

మా రామ్‌భరోసా అపార్ట్‌మెంట్స్‌లో కొంచెం ఎక్కువగానే ఫామిలీస్ ఉండటం వల్ల ప్రాబ్లెమ్స్ కూడా కొంచెం ఓవర్‌గానే వస్తూంటాయ్.

అందుకని మా అపార్ట్‌మెంట్స్ సొసైటీ కమిటీ వాళ్ళందరూ ఎప్పుడూ బిజీగానే ఉంటారు.

ఇరుగుపొరుగు ఫ్లాట్ వాళ్ళు ఒక ఫ్లాట్‌లో లేట్‌నైట్ వరకూ జరుగుతున్న మందు పార్టీల న్యూసెన్స్ గురించి కొట్టుకోవటం దగ్గర్నించీ, ఇంకో ఫ్లాట్‌లో ఉండే ఆసామీ తాలుకూ ఇంజినీరింగ్ ఫైనలియర్ చదువుతున్న కూతురు బాయ్‌ఫ్రెండ్‌తో లేచిపోవటం వరకూ- ఒక ఫ్లాట్‌లో పెద్ద ఎత్తున పేకాటాడుతున్నారని తెలిసి రైడింగ్ చేసిన పోలీసుల వ్యవహారం దగ్గర్నుంచీ, ఇంకో ఫ్లాట్‌లో ఉండే స్టూడెంట్స్ మిడిలేజ్ ఫ్యామిలీ లేడీస్‌కి లైట్ కొట్టటం వరకూ.. అన్నీ హెడేక్సే!

వీటిల్లో ప్రతి గొడవకూ మా ఫ్లాట్స్‌లోనే ఉంటున్న తుగ్లక్ టీవీ జర్నలిస్ట్, వాళ్ళ ఛానెల్‌కు ఇన్‌ఫర్మేషన్ ఇచ్చి కవరేజ్‌కి పిలిపించటం, ఛానెల్ కెమెరా చూసి ఫ్లాట్స్‌లోని యూత్, యంగ్‌గాళ్స్, ఆంటీలు అందరూ పోటీలుపడి కెమెరాలో కనిపించడానికి తంటాలుపడటం నార్మల్ అయిపోయింది.

తుగ్లక్ టీవీ ఛానెల్లో అడపాదడపా కనిపించడమే కాకుండా, ఫ్లాట్స్‌లో వచ్చిన సమస్యల గురించి వివరణలిస్తూ, దేశ ప్రజలందరూ కూడా ఎలా నడుచుకోవాలో, ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలో పొలిటీషియన్స్ లెవల్లో సలహాలివ్వటం మొదలు పెట్టారు మా కమిటీ ప్రెసిడెంట్, అతని టీమ్ మెంబర్స్.

దాంతో తుగ్లక్ టీవీ ఛానెల్ వాళ్ళు కెమెరాలతోనూ, అవుట్‌డోర్ యూనిట్‌తోనూ మా అపార్ట్‌మెంట్స్‌లోనే మకాం పెట్టేశారు.

ఈ వ్యవహారం ఇలా ఉండగా ఒకరోజు మా సొసైటీ వర్కింగ్ కమిటీ మెంబర్ బోసు ఒక వార్త మోసుకొచ్చాడు.

అమెరికాలో ఉంటోన్న వాళ్ళ కజిన్ బ్రదర్ కిషోర్‌బాబుకి సడెన్‌గా కాష్ పోషణమీద విరక్తి కలిగి, కళాపోషణ మీద ఆసక్తి కలిగింది. అందుకని ఒక లో-బడ్జెట్ సినిమా తీయాలన్న కోరికతో ఇండియా వస్తున్నాడు.

సహజంగానే ఆ వార్తతో మా వాళ్ళందరిలో అలజడి కలిగింది. ఎందుకంటే అపార్ట్‌మెంట్స్‌లో ఉంటున్న మూడొందల పైచిలుకు ఫామిలీస్‌లో సుమారు సగం మంది పైగా లేడీస్‌కి తాము గొప్ప రచయిత్రులమన్న అనుమానం ఉంది.

అలాగే ఫ్లాట్స్‌లో ఉంటున్న నలభై మంది స్టూడెంట్స్‌లో సుమారుగా అందరూ తాము సినిమాల్లో హీరో కారెక్టర్‌కి సెంట్ పర్సెంట్ సూటవుతామనీ, నిజానికి ఇప్పుడు వస్తున్న యువ హీరోలందరి కంటే తామే గొప్ప నటులు కమ్ అందగాళ్ళనీ ఫీలవుతూంటారు.

ఇక డైరెక్టర్స్‌కి కొదవేలేదు.

ఛాన్స్ దొరికిందంటే ప్రతివాడూ కనీసం నలుగురయిదుగురు పక్క ఫ్లాట్ వాళ్లను పోగుచేసుకుని తను చూసిన లేటెస్ట్ సినిమా గురించీ, అందులోని డైరెక్షన్ లోపాల గురించీ, ఆ స్థానంలో తనే ఉండి




ఉంటే ఎలా విరగదీసేవాడో చెప్తూండటం అందరం వింటూనే ఉంటాం!

ఆఖరికి హమీద్‌మియా కూడా తనకు గాడ్‌ఫాదర్స్ లేకపోవటం వల్ల ఇలా ఒక మామూలు వ్యక్తిలాగా గవర్నమెంట్ జాబ్ చేస్తూ ఉంటున్నాడనీ, నిజానికి తను ఒక జీనియస్‌ననీ, కరెస్పాండెన్స్ కోర్సు ద్వారా అమెరికాలోని ఒక ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్ నుంచి డైరెక్షన్ కోర్సు ఫ్లయింగ్ కలర్స్‌తో పాసయ్యాడనీ- ప్రాజెక్ట్ వర్క్ కోసం తను తీసిన ఎక్స్‌పెరిమెంటల్ డిజిటల్ ఫిలిమ్‌చూసి ఆ అమెరికా వాళ్లు షాకయి తనకు వెంటనే అవుట్‌స్టాండింగ్ డైరెక్షన్ సర్టిఫికెట్ పంపించారనీ, ఛాన్స్ దొరికినప్పుడల్లా చెప్తూంటాడు.

ఆ కోర్స్ చేసినవాళ్లందరికీ అలాంటి సర్టిఫికెట్స్ పంపిస్తారని విజయ్ యాదవ్ ఎంత చెప్పినా వినిపించుకోలేదు.

అయితే ఒకసారి మా అపార్ట్‌మెంట్స్‌కి ఎదురుగ్గా ఉన్న చాయ్ దుకాణం ఓనరు కమ్ సర్వర్- కమ్- బాహర్‌వాలా- యాద

గిరి ఒకరోజు మా అందరికీ మీటింగ్‌లో చాయ్ సర్వ్ చేస్తున్నాడు. మాటల్లో తనూ ఒక ఫిలిమ్ డైరెక్టర్ననీ, త్వరలో చాయ్ లమ్మి వచ్చిన లాభంతో నాగార్జున హీరోగా సినిమా తీయాలన్న ప్లాన్‌లో ఉన్నాననీ చెప్పేసరికి మా అందరితోపాటు హమీద్‌మియా కూడా షాకయ్యాడు.

"నువ్ సినిమా డైరెక్ట్ చేస్తయ్?" నమ్మ లేనట్లు అడిగాడు హమీద్‌మియా.

"అవున్సార్. అసలు నాకు చిన్నప్పటి నుంచీ ఇంట్రెస్ట్ ఉందిలెండి!"

"ఖాలీ ఇంట్రెస్ట్ హైతో తుమ్ డైరెక్టర్ అయిపోతయ్?"

"ఉట్టి ఇంట్రెస్టే కాదులెండి! నేను సంవత్సరం నుంచీ అమెరికన్ ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్‌లో డైరెక్షన్ కరెస్పాండెన్స్ కోర్సు చేశాను" మళ్లీ అందరం షాకయ్యాంగానీ హమీద్‌మియా కొంచెం ఎక్కువయ్యాడు.

"ఏ ఇన్‌స్టిట్యూట్?? హాలీవుడ్ ఫిలిమ్ క్రాఫ్ట్స్ ఉన్నయ్?"

"అవున్సార్- మీకెలా తెలుసు?"

హమీద్ మొఖం వాడిపోయింది.

"దాని యాడ్ న్యూస్ పేపర్స్‌మే నేను చూశినయ్" అంటూ అసలు విషయం చెప్పకుండా తప్పించుకున్నాడు.

"మీకింకో విషయం చెప్తే ఇంకా షాకవుతారు! ప్రాజెక్ట్ వర్క్‌కింద డిజిటల్‌ఫిల్మ్ చేసి పంపమన్నారు. నేనేం చేశానో తెలుసా? ఊరకుక్కలమీద 'స్లమ్ డాగ్స్' అని ఓ డాక్యుమెంటరీ తీశాను. అది చూసి వాళ్లెంత థ్రిల్ ఫీలయ్యారంటే 'యూ ఆరే జీనియస్' అని ఈమెయిల్ ఇచ్చారు. 'ఎక్స్‌ట్రార్డినరీ ఫిలిమ్ ఆఫ్ ది డికేడ్' అని సర్టిఫికెట్ కూడా పంపించారు సార్"

అతనూహించినట్లే హమీద్‌మియా మొఖం షాక్‌తోనూ, ఆక్రోశంతోనూ, ఆవేదనతోనూ నిండిపోయింది.

ఆ ఇన్‌స్టిట్యూట్‌వాళ్ళు తనలాంటి గ్రేట్ డైరెక్టర్‌నీ, యాదగిరిలాంటి చాయ్ అమ్ము కునేవాడినీ ఒకే గాటన కట్టటం ఏమాత్రం జీర్ణించుకోలేకపోతున్నాడు.

తనెక్కడ? వాడెక్కడ?

చిన్నప్పటి నుంచీ వాటీజ్ డైరెక్షన్? వాటీజ్ స్క్రీన్‌ప్లే? తదితర పుస్తకాలన్నీ చదివి, తను చూసిన ప్రతి సినిమాలోనూ దర్శకత్వ ప్రతిభను విశ్లేషిస్తూ వ్యాసాలు తయారుచేస్తూ 'ఫిలిమ్ క్రిటిక్స్' అనే సంస్థ మీటింగ్స్‌లో లెక్చర్స్ చదువుతూ ఇంత పేరు ప్రఖ్యాతులు తెచ్చుకుంటే.. ఆఫ్టరాల్ ఒక చాయ్ బాహర్‌వాలా- చదువు సంధ్య లేని లో లెవల్ ఫెలో, తనకు పోటీగా అదే డైరెక్షన్ కరెస్పాండెన్స్ కోర్స్ చేయటమే కాకుండా- చేతిలో పైసా లేకుండా నాగార్జునతో సినిమా ప్లాన్ చేస్తున్నానంటాడా? వాడు నాగార్జునతో సినిమా చేస్తున్నాడనేసరికి- ఏమో.. ఏ పుట్టలో ఏ పాముందోనని వేషాల కోసం వాడి చుట్టూ మూగారు ఫ్లాట్స్‌లోని వాళ్ళు కొంతమంది. ఇది హమీద్‌మియాకి మరింత చిరాకు కలిగించింది.

ఇలాంటి నేపథ్యంలో బోస్ కజిన్ కిషోర్‌బాబు లోబడ్జెట్ సినిమా తీయడానికి వస్తున్నాడన్న విషయం ఒక పెద్ద అలజడిని లేపింది. ఆ రోజు నుంచీ హమీద్ మియా బోస్‌తో క్లోజ్‌గా మూవ్ అవుతున్నాడు. "నేను నిజం చెప్తున్నయ్ బోసూ! ఇతినే దిన్ పైకి చెప్పలేదుగానీ- ఈ అపార్ట్‌మెంట్స్‌లో నువ్వొక్కటే జెంటిల్మెన్ ఉన్నయ్" అంటూ డైలాగ్స్ కొట్టసాగాడు. రెండు మూడు రోజులు అలాంటి డైలాగ్స్ వదిలాక అసలు విషయంలోకొచ్చాడు.

"దేఖో బోస్ భాయ్! సినిమా డైరక్షన్‌లో నాకెంత నాలెడ్జ్ ఉన్నయ్యో నీకూ తెల్సు! ఆ సబ్జెక్ట్ మీద నేను రెండు బుక్స్ భీ రాసినయ్"

విజయ్ యాదవ్ ఉలిక్కిపడ్డాడు.

"బుక్స్ రాశావా! ఎప్పుడు? మాకెవరికీ కాపీలు ఇవ్వలేదేం? "

"వైసా నై హై! బుక్స్ రాసినయ్‌గానీ పబ్లిష్ అవలే! ఒక సినిమా డైరక్షన్ చేశాక పబ్లిష్ చేయాలని నా ప్లాన్ ఉన్నయ్-"

"బెస్ట్ అయిడియా" ఒప్పుకున్నాడు శంకరమూర్తి. "ఇప్పుడు పబ్లిష్ చేస్తే- ఆ చెత్త బుక్స్ మనల్నందరినీ కొనమని ప్రాణం తీస్తాడు" అన్నాడు మాతో రహస్యంగా. హమీద్‌మియా మళ్ళీ కంటిన్యూ చేశాడు.

"డైరక్టర్‌గా నేనెంత జీనియస్ ఉన్నయ్యో- సబ్‌కో మాలూమ్ హై! లేకిన్ నాకు నాకు ఫైనాన్షియర్స్ బాకింగ్ లేవ్!"

"అవునవును" బోసు ఒప్పుకున్నాడు.

"ఇసీలియే నేనో డెసిషన్ తీసుకున్నయ్"

"ఇంక ఛస్తే డైరెక్షన్ జోలికి వెళ్ళగూడదని డెసిషన్ తీసుకుని ఉంటాడు-" అన్నాడు విజయ్ యాదవ్.

అందరూ తప్పట్లు కొట్టారు. "సూపర్బ్ డెసిషన్! లైఫ్‌లో అందరూ ఏదొక రోజు ఇలాంటి చేదు నిర్ణయాలు తీసుకోవలసిందే తప్పదు" అన్నాడు రెడ్డి. హమీద్ మియా గాబరాగా చూశాడు.

"అరెరె! వైసా నై హై! నన్ను మీ అందరూ మిసండర్‌స్టాండ్ చేసుకున్నయ్. నా డెసిషన్ అది లేవ్"

"అది కాదా? "

"కాదు- నా డెసిషన్ ఏమున్నయ్ అంటే నేను ఇంకో డైరక్టర్ కిందకు డైరక్టర్‌గా వర్క్ చేస్తయ్! అప్పుడు నా టాలెంట్ స్టేటంతా తెలుస్తయ్-"

విజయ్‌యాదవ్ ఒప్పుకున్నాడు.

"నిజమే! ఇంత టాలెంట్ ఉన్న హమీద్ మియా ఫిలిమ్ ఫీల్డ్‌కి రావల్సిందే- అంటూ అందరూ మిమ్మల్ని బతిమాలి జూబిలీహిల్స్ తీసుకెళ్తారు. అక్కడ ఏదొక ఫిలిమ్ కంపెనీ గెస్ట్‌హౌస్‌లో పెడతారు- సినిమా డైరక్షన్ చేయిస్తారు" అన్నాడు విజయ్‌యాదవ్.

మా అందరికి హమీద్‌పై జాలేసింది.

"నిజమే మీ లైఫ్ ఆ టర్న్ తీసుకోడానికి ఛాన్సుంది!" అన్నాడు శంకరమూర్తి!

"ఇంతకూ ఇదంతా నేను నీకెందుకు చెప్తున్నయ్ అంటే మీ కజిన్ ఎన్ఆర్ఐ ఫిలిమ్ తీయడానికి వస్తున్నాయ్ కదా! ఆయనకి నేను కోడైరక్టర్‌గా వర్క్ చేస్తయ్ అని నువ్ రికమెండ్ చేయాలి"

బోస్ హాపీగా ఫీలయ్యాడు.

"చాలా మంచి అయిడియా హమీద్ భాయ్! అటు మా బ్రదర్‌కి మంచి నాలెడ్జ్ ఉన్న కోడైరక్టర్ దొరికినట్లవుతుంది!"

"ఉట్టి నాలెడ్జే కాదురా భాయ్! నేను ఆజ్ తక్ ఎవరికి చెప్పలేవ్‌గానీ! నేను చాలా గ్రేట్ జీనియస్ ఉన్నయ్! బాకీ డైరక్టర్స్‌కే వైసా నహీ హు! టోటల్‌గా ఒక న్యూయాంగిల్లో షాట్స్ తీయాలని ఎప్పుడో నేను నోట్స్ తయారుచేసుకున్నయ్! మేరే వైసా జీనియస్, కోడైరక్టర్ రహానా.. మీ కజిన్‌కి ఒక పెద్ద 'ఎసెట్' ఉంటయ్!"

"అవునవును!" ఒప్పుకున్నాడు బోసు.

"ఫిర్- మీ కజిన్‌కి నా గురించి రికమెండ్ చేస్తయ్? "

"సెంట్ పర్సెంట్ చేస్తయ్!"

"ప్రామిస్ కరో!"

"గాడ్ ప్రామిస్"

"మదర్ ప్రామిస్? "

"మదర్ ప్రామిస్"

ఇది జరిగిన వారంరోజులకే కిషోర్ బాబు హైద్రాబాద్ చేరుకోవటం, మా అపార్ట్‌మెంట్స్‌లోనే- అంటే బోస్ ఫ్లాట్లోనే దిగటం జరిగిపోయింది.

నిజానికి అతను జెట్‌లాగ్ వల్ల కనీసం నాలుగయిదు గంటలు రెస్ట్ తీసుకోవాలనుకున్నాడుగాని- హమీద్‌మియా అతనికా ఛాన్స్ ఇవ్వలేదు.

*(మిగతాది వచ్చే నెల)*

# అరిష్టం



-దూరి వెంకటరావు

కుటుంబంలో సీరియల్‌గా సంభవిస్తున్న సంఘటనలతో కృంగిపోయాడు కామేశం. కష్టాలన్నీ కట్టగట్టుకుని తననే ఎందుకు పలకరిస్తున్నాయో తెలియడం లేదు.

"ఇంటికేదో శని పట్టిందండి. మీ తాతయ్యగారు పోవడమేంటి? పిల్లాడు పరీక్ష తప్పడమేంటి? పిల్లకొచ్చిన సంబంధం చెడిపోవడమేంటి? " కంటతడి పెడుతూ అన్నది అపర్ణ.

"నువ్వన్నది నిజమేనే. మనింటికేదో దోషం ఉంది. నివారణకి ఏం చెయ్యాలో సిద్ధాంతిగారిని అడుగుతాను" సమస్యకు పరిష్కారం దొరికినట్లు సంబరపడుతూ అన్నాడు కామేశం. ఇంకేముంది 'తలచుకున్నప్పుడే తాత పెళ్లి అన్నట్లు' సిద్ధాంతుల సూచనలమేరకు జపాలు, శాంతులు జరిపించి చేతులు కాల్చేసుకున్నాడు. అయినా అతడి వెతలు తీరలేదు. ఏం చెయ్యాలో పాలుపోక వాస్తు నిపుణుడిని ఇంటికి లాక్కొచ్చాడు.




"ఈ ఇల్లు వాస్తు విరుద్ధంగా కట్టబడింది. అందుకే మీకిన్ని అరిష్టాలు సంభవిస్తున్నాయి" అన్నాడు వైకుంఠం ఇంటిని భూతద్దంలా పరిశీలించి.

"అందుకే కదా మిమ్మల్ని పిలిచింది. వాస్తు ప్రకారం ఏయే మార్పులు చెయ్యాలో సెలవిస్తే..." అర్థింపుగా అంటూ ఆగాడు కామేశం.

"ఇంటిని పడగొట్టించి పునర్నిర్మించవలసిందే. వెంటనే ఆ పని చెయ్యకపోతే మీరు మరిన్ని ఇబ్బందులు పడవలసి వస్తుంది.. చూస్కోండి" హెచ్చరించాడు వైకుంఠం.

ఆలోచనలో పడ్డాడు కామేశం. ఇల్లు పడగొట్టి కట్టించాలంటే మాటలా!?

"మీరా పని చెయ్యలేకపోతే ఏదైనా అద్దె ఇంట్లోకి వెళ్ళిపొండి" అన్నాడు వైకుంఠం అతడి అంతరంగానికి అద్దంపడుతూ.

క్షణాలమీద ఇంటికి 'టు లెట్' బోర్డు తగిలించి అద్దె కొంపలోకి మారిపోయాడు కామేశం.

రోజులు గడుస్తున్నా అందులో దిగడానికి ఎవరూ సాహసించడం లేదు. బహుశా విషయం అందరికి తెలిసిపోయిందేమో!

ఇక ఇలా లాభం లేదనుకుని ఇంటిని అమ్మకానికి పెట్టాడు. అయితే కొనడానికెవరూ ముందుకు రాకపోవడంతో మరింత దిగాలు పడిపోయాడు.

ఇలా ఉండగా ఓ రోజు ఆ ఇంటిని కొనడానికి ఎవరో వచ్చారు.

"పన్నెండు లక్షలిస్తే చెప్పండి"

కామేశం మాటకు ఓ వెకిలి నవ్వు నవ్వి "ఈ పాత కొంపని అంత ధరపెట్టి ఎవరు కొంటారు? పైగా దీనికి వాస్తు దోషం ఉందని తెలిసింది. మేం గనుక ధైర్యం చేసి వచ్చాం. మూడు లక్షలకైతే చెప్పండి ఇవాళే క్యాషిచ్చి తీసుకుంటా" నోరూరిస్తున్నట్లు అన్నాడు ఆసామి.

ఇంకా లేటు చేస్తే ఆ రేటు కూడ పలకదేమోనని సరేనన్నాడు కామేశం.

ఉన్నఫళంగా డబ్బిచ్చి రిజిస్ట్రేషన్ చేయించుకున్నాడు వచ్చిన వ్యక్తి.

తన కొంపని ఎంతో కారు చవకగా కొట్టేసిన ఆ వ్యక్తి వైకుంఠం కొడుకేనని తెలిసి కంగుతిన్నాడు కామేశం.

# షో బిజినెస్!

-కర్లపాలెం హనుమంతరావు

హైదరాబాద్ నుంచి చెన్నై వెళ్లే చార్మినార్ ఎక్స్‌ప్రెస్ ఫస్ట్‌క్లాసు బోగీలో ముగ్గురు రిచ్‌క్లాస్ కుర్రాళ్ళు ప్రయాణం చేస్తున్నారు. విజయవాడలో ఎదురు సీట్లోకి ఒక ఇరవై ఏళ్ళ సెక్సీగర్ల్ వచ్చి కూర్చుంది. బండి తెనాలి చేరేసరికి వాళ్ళకి ఆమెతో మాటలు కలిశాయి. ఆ మాటల మధ్యలో ఆమె పబ్బుల్లో షో బిజినెస్ చేస్తుందనీ, తమిళ సినిమాల్లో చిన్న చిన్న ఐటమ్ సాంగ్స్ ట్రూపుల్లో కూడా కనపడుతుం దని కుర్రాళ్ళకి తెలిసింది.

"పొట్టి దుస్తుల్లో ఒళ్ళంతా చూపిస్తూ కనిపించటానికి ఏమీ అనిపించదా మీకు?" అనడిగాడు ఆ బేచ్‌లోని ఒకబ్బాయి ముందుగా కాస్త ధైర్యంచేసి.

"డబ్బవసరం సార్! మీరూ తలా ఒక వంద రూపాలియ స్తానంటే పాదాలు చూపించటా నికి నేను రెడీ" అందామె వయ్యారంగా అదోలా చూస్తూ.

కుర్రాళ్ళకి హుషారొచ్చింది. మూడొందలిచ్చారు. ఆమె చీరె కుచ్చెళ్లనలా సుతారంగా కొద్దిగా పైకి లాగి పద్మాల్లాగా ఉన్న పాదాలను రెప్పపాటు చూడ నిచ్చి ఇలా వదిలేసింది.

బండి బాపట్ల చేరేసరికి ఇంకో కుర్రాడికి కాస్త ధైర్యం పెరిగింది "ఈసారి తలా ఐదొందలిస్తాం. మోకాళ్ళ దాకా చూడనిస్తారా?" అనడిగాడు బిడియపడుతూ,

"ఒకే" అందామె. పదిహేనొందలు తీసుకుని కుచ్చిళ్ళను మరికాస్త పైదాకా లాగి ఓ నిమి షంలో సగం సేపు చూడనిచ్చి దింపేసింది. కుర్రాళ్ళకు కళ్ళు బైర్లు కమ్మాయి. అరగంట గడి చింది. వాళ్ళ వేడి నిట్టూర్పుల సెగలు తగులు తున్న ఆ పిల్ల "తలా వెయ్యి ఇవ్వండి... నేను అంపెడిసైటిస్ ఆపరేషను చేయించుకున్నచోటు కూడా చూపించేస్తాను.. ఓ పనైపోతుంది" అనే సింది మోస్ట్ ఎరోటిక్‌గా. ఈ ఆఫర్ వాళ్ళు ఊహించనిది. వాళ్ల నోరు విప్పి స్వయంగా అడగలేనిది. చచ్చినా ఈ ఛాన్సు వదులుకోకూడ దనుకున్నారు ముగ్గురూ.

మూడువేలు పోగేసి ఆమె చేతిలో పోసేసి ఆత్రంగా చూస్తూ కూర్చున్నారు కుర్రాళ్ళు. వాళ్ళ గుండెలు రైలు ఇంజను కన్నా వేగంగా కొట్టుకుం టున్నాయి.

ఆమె లేచి నిలబడింది. చీరె కుచ్చెళ్ళు సర్దు కుంటూ వయ్యారంగా వాళ్ళ ముందుకు నడిచి వచ్చింది.




బండి వేగం తగ్గింది. విండో డోర్ పైకిలాగి.. "నెల్లూరు వస్తున్నట్లుంది" అంది. దూరంగా కని పించే ఓ బిల్డింగుని చూపిస్తూ "అదిగో.. ఇండో అమెరికన్ ఆసుపత్రి.. అదే నేను అపెండిసైటి స్‌కి ఆపరేషన్ చేయించుకున్న చోటు" అంటూ అప్పుడే ఆగిన రైల్వే ప్లాట్‌ఫామ్ మీదకు చక్కా దిగి.. వెళ్ళిపోయింది.

పిల్లకాయలు నోరెళ్ళబెట్టి చూస్తూ కూర్చున్నా రని వేరే చెప్పాలా!

# లేని అందం

- ఎం.వి.వి. సత్యనారాయణ

ఒక రాజు తన నిలువెత్తు రూపం అందంగా వేయించుకోవడానికి తగిన చిత్రకారుడికోసం చాటింపు వేయించాడు. ఎంతోమంది చిత్రకారులను పరీక్షించాక ఒకడిపై అతడికి నమ్మకం కుదిరింది.

"చిత్రాలు అందంగా తీర్చి దిద్దగలవని భావించి నీకు ఈ పని ఒప్పచెబుతున్నాను" అన్నాడు.

"కృతజ్ఞతలు మహారాజా! మీ రూపం ఉన్నది ఉన్నట్టు చిత్రించే శక్తి నా సొంతం. నా ప్రతిభను తమరే గుర్తిస్తారు" చిత్రకారుడు ఆత్మవిశ్వాసం ప్రదర్శించాడు.

"నా మనస్సు నీకర్థం కాలేదు. నా నిలువెత్తు రూపం అతి సుందరంగా ఉండాలి సుమా! భావి తరాలవారు కూడా సమ్మోహితులు కావాలి"

మహారాజంతటివాడు తనతో అంత వివరంగా మాట్లాడుతుండటంతో ఉత్తేజంతో ఊగిసలాడిపోయాడు చిత్రకారుడు. ఆయన మాటలకు వినయపూర్వకంగా తన అంగీకారం తెలిపి చిత్రరచన ప్రారంభించాడు.

మూడు నెలల వ్యవధిలో రాజుగారి నిలువెత్తు చిత్రం పూర్తి చేశాడు. మధ్య మధ్య రాజుకు తన చిత్రీకరణ ఎంత వరకూ వచ్చిందో చూపించే ప్రయత్నం చేశాడు చిత్రకారుడు.

రాజు అంగీకరించలేదు.

"నా చిత్రాన్ని ఎంత సుందరంగా చిత్రీకరిస్తావో ఒకేసారి చూసి సంతృప్తి పడతాను. నీ పనితనం నన్ను మెప్పిస్తే మా కుటుంబ చిత్రాన్ని నువ్వే గీయవచ్చు. నువ్వు జీవించినంత కాలం ఏ లోటూ రాకుండా ఏర్పాటు చేస్తాను" అన్నాడు రాజు.



చిత్రకారుడు ఉబ్బి తబ్బిబ్బయ్యాడు. రాజుగారికి తనమీద ఎంత గురి కుదరకపోతే అంత గొప్ప అవకాశం కల్పిస్తాడు!

చివరికి నిలువెత్తు చిత్రం ప్రదర్శనకు వచ్చింది.

రాజు దాన్ని చూసి, "చెయ్యి వంకరగా చిత్రించావు. కుడి కాలు కొద్దిగా కురచ పెట్టి అంగ వైకల్యం బయట పెట్టావు. మొహంలో ఎలాంటి సంతోష ప్రకటనగానీ అందంకానీ లేదు" అన్నాడు.

చిత్రకారుడు ఆయన మనస్సు అర్థం చేసుకోకుండా, "చిత్తం మహారాజా! తమ చిత్రం సహజరూపంతో ప్రాణం పోసుకుంది" అన్నాడు.

భటులతో, "ఇతడిని ఉరి తీయండి" అన్నాడు రాజు.

చిత్రకారుడు తెల్లబోయి తానెక్కడ తప్పు చేశానోనని ఆలోచనల్లో తలమునకలయ్యాడు. ©

# మనసున ఉన్నదీ...



★ 'తేనె ప్రవాహం' గుండె తలుపులను తట్టే చక్కని కథ. ఓ. హెన్రీ మార్కు ముగింపు కనిపిస్తుంది. కొడవటిగంటివారి తనయ శాంతసుందరి కథనం 'మానాన్న..నేనూ...' వారి రచనపట్ల నా అభిరుచిని, ఆరాధనను ఒక్కసారిగా అరవై ఏళ్ల వెనక్కు తీసుకెళ్లింది. 'ఆనందమానంద మాయె!' నవల ఆరోగ్యకరమైన సున్నిత హాస్యంతో మనసుకు గిలిగింతలు పెట్టింది.

–డి.వి.రమణమూర్తి,
అచ్యుతాపురం, కాకినాడ

★ అక్టోబరు చతురలో జ్ఞానపీఠాలులోని రామ్‌ధారీ సింహ్ దినకర్‌గారి సాహితీ విశేషాలు చాలా బాగున్నాయి. ఆయన రచనలన్నీ అమూల్యాలే. అలాగే కొడవటిగంటివారి జీవిత విశేషాలను అనేకం అందించారు. పొత్తూరి విజయలక్ష్మి నవల హాస్యంగా సాగింది. పాత మిత్రులు కలిస్తే ప్రపంచాన్ని మరిచిపోయి ప్రవర్తిస్తారని చాలా బాగా నవ్వు వచ్చేలా వర్ణించారు. 'సెల్‌ఫోన్' కథద్వారా జాగ్రత్త గుర్చి తెలియజేశారు. కవర్ పేజీలో వారెవ్వాలో కలాల చిత్రాలూ బాగున్నాయి.

–పేడపర్తి విజయలక్ష్మి, కాకినాడ

★ 'ఆనందమానందమాయె!' విజయలక్ష్మి నవల ఆద్యంతం చదివించింది. కొత్తగాలి కవితలు తగ్గించేయడం నిరుత్సాహానికి గురిచేసింది. క్యాప్షన్ మీదే శీర్షిక చాలా ఇంటరెస్టింగ్‌గా ఉంది. అపార్ట్‌మెంటాలజీలో 'లై డిటెక్టర్' నవ్వు తెప్పించింది. జ్ఞానపీఠ్ గ్రహీత దినకర్ గురించి చాలా విషయాలు తెల్పినందుకు ధన్యవాదాలు.

–జి.జి.కె.రావు, శ్రీకాకుళం

★ అక్టోబరు నవలలో అంతటా హాస్యరస భరిత సన్నివేశాలను రచయిత్రి సరస సంభాషణలతో రమణీయంగా చిత్రించారు. అలాగే సహజరీతిలో సాగే పాత్రల చిత్రణతోపాటు పాఠకుల్ని రంజింపజేసే నాటకీయత ఉంది. ప్రవరుడిలాంటి సూర్యహా వాలుచూపుల శిల్ప ప్రేమపాశానికి బందీ అయిన సన్నివేశం రసాత్మకంగా ఉంది.

–పారుపల్లి వెంకటేశ్వరరావు, హైదరాబాద్

చిరునామా: మనసున ఉన్నదీ... సంపాదకుడు,
చతుర, ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాద్ –500 082
ఈ మెయిల్ చిరునామా:
chatura@eenadu.net



# చతుర ప్రవేశిక



## నవంబరు- 09

నవంబరు 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. ఇంగ్లీష్ మాస్టారుతో వెళ్లిపోయిన అమ్మాయి?
2. ఐ.పి.ఎస్. ఆఫీసర్ కావాలని లక్ష్యంగా పెట్టుకున్నదెవరు?
3. అత్తింటివారి చేతిలో తనువు చాలించిన శాంతి స్నేహితురాలు?
4. డాక్టర్ మానస ఎవరిని ప్రేమించింది?
5. కిడ్నాప్డ్ నవలా రచయిత?
6. బేంద్రేకు జ్ఞానపీఠ అవార్డును తెచ్చిపెట్టిన రచన?
7. సాటర్ డే రివ్యూ పత్రిక సంపాదకుడెవరు?
8. 'ముద్ర' నవలా రచయిత ఎవరు?
9. నాగార్జునతో సినిమా తీయాలనుకుంటున్నానని చెప్పిందెవరు?
10. చిత్రాన్ని యథాతథంగా వేసినందుకు రాజు విధించిన శిక్ష?

---

పంపినవారి పేరు: -------------------------------- వయసు (   )

చిరునామా: ------------------------------------------------

------------------------------------------------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర,
ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

ప్రవేశికలకు చివరి తేదీ 16

నోట్ : చతుర ప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపవచ్చు.

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.

# కాప్షన్ మీదే - 11



ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు నవ్వొచ్చే కాప్షన్ రాయండి. చక్కని బహుమతి అందుకోండి! బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 16

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082

e-mail : chatura@eenadu.net

ఉత్తమ వ్యాఖ్య :

ఇదంతా చూడడానికా నేను చచ్చింది?
దేవుడా! నన్ను ఎంత త్వరగా బతికిస్తే
అంత మంచిది!!

-ఓలేటి రమ్య,
బనశంకరి, బెంగళూరు





## కాప్షన్ మీదే -10

బాగున్న మరికొన్ని కాప్షన్లు:

ఒసేవ్ మూషికమా!
నా అమాయకత్వం చూసే కదా,
నీ ఈ అరాచకత్వం?!

– ఎన్.ఉమాపార్వతి,
పెనుగొండ, ప.గో. జిల్లా

నీకంత సీను లేదు
తోక జాడిస్తే చస్తావ్ జాగ్రత్త

– మంచెళ్ళ వాణీచందన,
హబ్సిగూడ, సికింద్రాబాద్

ఔనులే! ఓడలు బళ్లు,
బళ్లు ఓడలవ్వడమంటే ఇదేలే!

– జి.వెంకటరవికుమార్,
కత్తిపూడి, తూ.గో. జిల్లా

ఎలుకకి చెలగాటం
పిల్లికి ప్రాణ సంకటం

– పారుపల్లి వెంకటేశ్వరరావు,
హైదరాబాద్

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. HD/965/2009-2011 RNI/32186/78